

అడయార్‌లో గాంధీమండపం

ఫొటో : డా॥ కె. వి. మోహన్‌కుమార్ (మద్రాసు)

వచ్చేవారం ప్రారంభం!

# 'రేఖా' చిత్రకథ

(బంగారం-సింగారం బొమ్మల సీరియల్ కథ!)

**28-6-1961**

## ప్రత్యేక సంచిక!

వివరాలకు:

వచ్చేవారం పత్రిక చూడండి!

# ఉత్తరాలు

## కథకాని కథ

శ్రీమతి జి. హేమలత (హైదరాబాద్) గారు వ్రాసిన కథకాని కథ "క్రికెట్ పిచ్చి" లో ఒక విద్యార్థి క్లాసులో క్రికెట్ సమీక్ష వింటూండగా లెక్చరర్ స్కోర్ అడిగితే "భారతదేశం మూడు వికెట్లు నష్టానికి 394 పరుగులు సంపాదించింది" అని చెప్పినట్లు వ్రాశారు.

నేను విన్న సమీక్షలో భారతదేశం మూడు వికెట్లు నష్టానికి 394 పరుగులు సంపాదించనే లేదు

లక్ష్మీకాంతం (బి.ట్రగుంట)

* * *

మాయాబజారు కేవలం కల్పిత కథ. ఎవరైనా రిక్షా ఎక్కేటప్పుడు సినిమా థియేటరు పేరు చెబుతారే గాని, సినిమా పేరు చెప్పేవారిని నే నెక్కడా చూడలేదు ఇది చాలా అసందర్భంగా ఉంది

ఎస్ ఎన్ మరూరు (కోవూరు)

* * *

## న్యూఢిల్లీ లేఖ

'శ్రీ కృష్ణ' గారు వరకట్నాల దురాచారమును విమర్శిస్తూ 'భారతదేశం అనే దౌర్భాగ్య భూమిలో'' అనే పదమును ఉపయోగించినందుకు విచారిస్తున్నాను సంఘంలో కొన్ని దురాచారము లున్నంతమాత్రమున పవిత్రమైన మన భారతభూమిని దౌర్భాగ్యభూమి అని నిర్వచించినందుకు మీ పత్రిక ద్వారా వారికి విచారము తెలుపుకొనుచున్నాను

డి. కోటిరెడ్డి (గురజాల)

## కార్టూనులు

ఎగాదిగా చూడక నన్ను అభినందించండి." అన్న కార్టూను భలేగా ఉంది

భాగ్యలక్ష్మి రామచంద్ర,
పి. వి రంగపూర్ణ
(గుంతకల్లు)

* * *

పోలీసు దొంగజాట్లు పట్టుకోడం, జాట్లు పోలీసు చేతికి ఊడిరావడం, దొంగ దూరంగా పరుగెత్తిపోవడం చూపిన ఎస్ జయదేవ్ బాబుగారిని అభినందించాలి కాని, బాబుగారు ఒక తప్పు చేశారు దాన్ని సంపాదకులూ గ్రహించనట్లున్నది. దొంగ చేతిలో ఉన్న సంచిపై 'రూ' అని వ్రాసి ఉంది ఏమెంటు సంచి వలె ఆ సంచిపై 'రూ' అని వ్రాసి ఉండడానికి కారణం? సంచి యజమాని, 'దొంగలను అంతగా కష్టపెట్టడం ఇష్టంలేక సులభంగా దొంగ తన పని పూర్తి చేసుకోడానికై' సంచిపై 'రూ' అని వ్రాసుకున్నారా? లేక అది బాబుగారు తొందరపడ్డంవల్ల జరిగిన తప్పా?

ఎన్. నారాయణరావు (హైద్రాబాద్-2)

* * *

తమరు నాదిల్‌పసంద్ పత్రికలో షంకర్‌గారి కార్టూన్ "హెవ్వా హింతే" వేయ్కపోటం చమించరాని తప్పు చేసినార్ నాకి చాలా కోపం వచ్చింది లేకన్ 'పూమెన్' జి హేసిన కార్టూన్ లున్నయ్ చూసినార్ అవి నాకి చాలా బాగున్నాయ్.

ఇక్బాల్ (బొబ్బిలి)

(62 పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

★

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
వాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితము
1908

★

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

★

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

★

సంపుటము 55
సంచిక 40

14-6-61
బుధవారం

ప్లవసం॥ నిజజ్యేష్ఠ శుద్ధ పాడ్యమి

★

విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0

★

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి,
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

జానకి


**కథలు:**

| | | |
|---|---|---|
| గోమస్నసాయ్ | — | 3 |
| అలజడి | — | 16 |
| అసురసంధ్య | — | 24 |
| సిపాయిపెండ్లి | — | 32 |

**వ్యాసాలు:**

| | | |
|---|---|---|
| గాజులు | — | 21 |
| సమిష్టి కుటుంబాలు | — | 29 |

**శీర్షికలు:**

| | | |
|---|---|---|
| ఉత్తరాలు | — | 3 |
| ఉమెన్ కార్టూన్ | — | 6 |
| న్యూఢిల్లీ లేఖ | — | 7 |
| మనమూ-మన దేహస్థితి | — | 12 |
| కథ కానికథ | — | 15 |
| ఎప్పుడూ - ఇంతే | — | 21 |
| శిరోజాలంకరణ | — | 23 |
| రాశిఫలాలు | — | 30 |
| సినిమా | — | 48 |
| వనితావాణి | — | 55 |
| గళ్ళనుడికట్టు | — | 63 |
| పొట్టికథలు | — | 64 |

**సీరియల్ కథలు:**

| | | |
|---|---|---|
| 80 రోజుల్లో భూప్రదక్షిణం | — | 36 |
| హరివంశం | — | 56 |

**బాలసాహితి:**

| | | |
|---|---|---|
| నక్క-బావ - పావురము | — | 40 |
| తల్లితలంపులు (గేయం) | — | 42 |


వచ్చేవారం....

రిక్షావాలా!!!
ఒక కొత్తరకమైన వ్యాసం.


చూడు! నీకంటే నేను ఎంత ఒడ్డూ, పొడుగూ ఉన్నానో. మరి తెలివితేటల్లో కూడా నాదేపై చెయ్యి. ఈ సంగతి మర్చిపోకోయ్ చిట్టితండ్రీ
కెనెడీ డిగాల్‌ను కలుసుకున్నారు
ఇంకా మనం ఆంధ్రప్రదేశ్‌లో ఎందుకు పనిచెయ్యాలంట? చెమటోడ్చి పనిచెయ్యాల్సిందేమో మనమూ, ప్రమోషన్లు భిన్నజాతుల వారికా!
చూశారా పండిట్‌జీ! ఢిల్లీలో కూడా తేళ్ళు కనిపిస్తున్నాయి
ముస్లిం మహాసభ



లోక్‌సభ అధ్యక్షుడు శ్రీ ఎం. అనంతశయనం అయ్యంగార్, ఇటీవల మాస్కో వెళ్లేముందు ఢిల్లీ విమానాశ్రయంలో వారికి వీడ్కోలు.

<u>న్యూఢిల్లీ లేఖ</u>

<u>శ్రీకృష్ణ</u>

# మంత్రుల ప్రచారానికి మంచినీటి ప్రాయంగా ఖర్చు: ముస్లిం మహాసభకు కాంగ్రెసు అధ్యక్షుని ఆమోదముద్ర!

న్యూఢిల్లీలో సంవత్సరం స్పష్టంగా రెండు భాగాలుగా విభక్తమై ఉంటుంది. ఇది వసంతకాలంతో ప్రారంభమవుతుంది. మండు వేసంగిలో నీటి కరువుతో పరాకాష్ఠ పొందుతుంది. తర్వాత వర్షాలు, వరదలు, నీరు చెడిపోవటం, కామెర్ల వ్యాధిలాంటి 'దైవ ఘటనలు' ఒకదాని వెంబడి ఒకటి వస్తూ వుంటాయి. విదేశీ అధినేతలకు స్వాగతం చెప్పేందుకు నగరాన్ని అలంకరించి చేసే ఉత్సవాలతో ఈ కార్యక్రమం పర్యవసిస్తుంది. ఈ స్వాగత కార్యకలాపాలన్నీ అందరికీ కంఠతా వచ్చేవుంటై. అధినేతలకు విమానాశ్రయం దగ్గర స్వాగతం చెప్పటం, సలాంఛనంగా ఊరేగింపు, రాత్రికి విందు జరుగుతాయి. ఆ మర్నాడు గాంధి సమాధి సందర్శనం జరుగుతుంది. సమాధులతో పాటు, జాతీయ భౌతికశాస్త్ర పరిశోధనాలయం, సమాజవికాస కేంద్రంలో ఫలానాని ముందే నిర్ణయించుకున్న గ్రామ సందర్శనము కూడా ఏర్పాటవుతాయి. ఈ గ్రామం చూపి ప్రశంసా పత్రాలు సంపాదిస్తారు. ఆంగ్లేయులు ఇలాంటి ప్రశంసా పత్రాలు తమ సేవకులకు ఇచ్చేవారు. మంత్రివర్యులు శ్రీ ఎస్. కె. డే దగ్గర ఇలాంటి పత్రాల పుస్తకమే పురావస్తు ప్రదర్శనశాలలో ఉంచదగింది, ఒకటుంది. ప్రస్తుతం ఢిల్లీలో ఉన్న దల్లా వేడిగాలి, నీటి కరువు.

* * *

ఆడిటర్ జనరల్ ఇటీవల ఒక సత్యాన్ని ప్రకటించి ఎంతో సేవ చేశారు. అదేమిటంటే, వెనక బ్రిటిషువారి హయాములో ఉన్న వేతనాల కన్న చాలా తక్కువ వేతనాలు పుచ్చుకొంటూ కాంగ్రెసు మంత్రులు ఎంతో త్యాగం చేస్తున్నారన్నకట్టు కథ ఖండనం. బ్రిటిషు ప్రభుత్వము అంతా కలిపి నెలకు రు. 7000 — చొప్పున ముట్టజెప్పేది. దీనిపైన ఆదాయపు పన్ను కూడా ఉండేది. గవర్నర్ జనరల్ గారి కార్యనిర్వాహక సంఘం (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్) ఢిల్లీలో ఒక యిల్లు, సిమ్లాలో ఒక ఇల్లు, వెరసి రెండు ఇళ్లను భరించాల్సి వచ్చేది. ఈ ఇళ్లకు అద్దె, నీటి, విద్యుచ్ఛక్తి పన్నులు గవర్నర్ జనరలే చెల్లించేవారు. పైగా ఈ రెండు ఇళ్లకు ఉద్యానవనా లుండేవి. ఈ వనాభివృద్ధికి కావలసిన విత్తనాలు నీరు, ఎరువులు .... వీ టన్నిటి ఖర్చూ కూడ ఆయనే భరించేవాడు. అన్నీ అమర్చిన బంగళాయే ఆయన కిచ్చినప్పటికీ, కుర్చీ బాలీసులు, అపనికలు వగైరా సరంజామా అంతటికీ ఆయనే ముడుపు చెల్లించుకోవాల్సి ఉండేది. మొత్తం మీద ఆయనకు రు. 5,500 ల నెలసరి వేతనం వచ్చేది. దీనిపై ఆదాయపన్ను కూడా ఉండేది.

ఇక్కడ ఒక విషయం చెప్పాల్సి వుంది. బ్రిటిషు వారికి సంబంధించినంతవరకు, వారిలో ప్రతి ఒక్కడు ఎంతో కొంత ప్రాముఖ్యం ఉన్న స్థానంలో ఉండేవాడు. లోగడ ఆర్థిక సభ్యుడుగా ఉన్న సర్ జరిమొనీ రైస్‌మన్, ఇప్పుడు లాయడ్సు బాంకుకు డిప్యూటీ గవర్నరుగాఉన్నారు.. శ్రీ నెహ్రూ మంత్రివర్గంలోఉన్న త్యాగశీలురైన మంత్రులు నెలకు రు.6000 వేతనం పొందుతున్నారు. మంత్రివర్యుల ప్రచారం లాంటి వాటికయ్యే ఖర్చును లెక్కల్లోకి తీసుకుంటే ఈ సంఖ్యకు చాలా మొత్తం చేర్చాల్సి ఉంటుంది. ఈ విషయాన్ని నిరూపించుకొనేందుకు మన రక్షణమంత్రినే ఉదాహరణగా తీసుకుందాం. ఇటీవల శ్రీ కృష్ణమీనన్ ఛాయా చిత్రాలు జినీవానుంచి విమానంలో వచ్చాయి. ఏదో సినిమా నటీనటులకు తీసి

(58-వ పేజీ చూడండి)

# గోమన్నసాయి

వాకాటి పాండురంగరావ్



"ఏయ్ పిల్లా! నీ పేరే మీ బాగోలేదు—"

ఒక్కక్షణం కుంపటి విసరడం మాని ఇటు తిరిగింది సరోజ. ఆ తిరగడంలో భుజంమీదుగా ముందుకొచ్చిపడింది ఆమెజడ.

"ఒహోహో" అనుకున్నాడు శేషగిరి ఆజడ విన్యాసాన్ని వీక్షించినవాడై.

"ఏమిటి?"

"ఏమీలేదు గానీ—ఇందాకా నేను వేయించిన ప్రకటన వినలేదూ?" భ్రుకుటి ముడిచింది సరోజ.

"అదేనోయ్......నీ పేరు నాకు నచ్చలేదు..... "ఓ క్షణం ఆగి, "ఆ......బొత్తిగా నచ్చలేదు......" అని ఒత్తి పలికాడు శేషగిరి.

వచ్చిన నవ్వును దాచుకుంది సరోజ.

"మరీ నియంతలా అణిచేస్తావేం ఆ నవ్వునూ—"

"కారణం ఉందిలెండి; నే నించక్కా నవ్వుతానని మీ రన్నారుగా?"

"నేనేమిటి మీ బావగారు కూడా 'మా మరదలు నవ్వితే జలతరంగంమీద శంకరాభరణంలా వుంటుందోయ్'—అని మెచ్చేసుకున్నారు."

"మరే?...... అంచేత అంతోటి ఆభరణాల నవ్వులు ఉత్తినే పంచిపెట్టబడవు—"

"మరి?"

"సాయంకాలం సినిమాకు తీసుకెళ్ళాలి...."

"అలాగేనోయ్ అనూరాధా!"

"అనూరాధెవరూ?"

"అదే....నే నిందాక చెప్పబోయేసరికి నవ్వులూ—ఖరీదులూ అని బయలుదేరి నా ఏకాగ్రతనంతా నాశనం చేశావు—"

"సెలవివ్వండి....."

"—నీ పేరు మార్చాలి...."

"ఏం?"

"నాకు నచ్చలేదు—"

"ఎందుకనో—?"

"బాగులేదు కనుక—"

"'వనజ' అంటే బావుంటుందా మీకూ—" అని అతడి మొహంలోకి తొంగిచూసింది సరోజ.

"సందు దొరికితే చాలు మా ఆఫీసు టైపిస్టునలా నమిలేస్తావెందుకూ?"

"పోనీ—'మిస్. మెంజీస్' అని పెట్టుకోనా?"

"ఛీ— మరీ భూతదయ లేకుండా పోతూంది నీకు!......ఆ అమ్మాయి ఎప్పుడో పెళ్ళికాకముందు నాకు ఉత్తరాలు రాసిందికదా—అని—"

"ఊ...రాస్తుంది.....రాస్తుంది ..... ఉత్తరాలేనా, ఇంకేవన్నా రాసిందా?" పరుషంగా వచ్చింది సరోజ స్వరం.

"ఉదాహరణకు?"

"ఏం—సెంటు రాయకూడదూ?"

నవ్వాడు శేషగిరి; "కాబట్టి సుందరమ్మా — నీ ప్రస్తుతపు పేరు తీసేసి అనూరాధ అని పెట్టుకో—"

"పెట్టుకుంటే నన్నేమని పిలుస్తారటా?"

"ముద్దుగా—రాధా—అనో, ముచ్చటగా—అనూ—అనో పిలుచుకుంటా—"

"ఈ పేర్లవెనుక మధురస్మృతు లేమయినా వున్నాయేమిటి?" అల్లరిజల్లులు కురిసే కళ్ళతో అడిగిందామె.

"పాహి పాహి! రాముడి తర్వాత రాముడంతటి ఏకపత్నీవ్రతుడిని నన్ను పట్టుకుని ఇలా అన్నావంటే నీకు శాపం తగులుతుంది, జాగ్రత!"

"ఏడిశారు!....ఒంటిమీద జందెప్పోగయినా లేదుగాని శాపంట శాపం" అని కుంపటివైపు తిరిగింది సరోజ.

"మరీ 'క్యూబా'లా మాట్లాడక—నీ మొగుడనేవాడు చెప్పిన మాట వినడం నేర్చుకో—" అని సలహా ఇచ్చాడు శేషగిరి.

"తమరు 'చైనా'లా మొండికెత్తక వెళ్ళి కూచుని పేపరు చదువుకోండి; ఆ తర్వాత కాంగోలో ఏమయిందో వ్యాసం రాసి చూపించండి..." అంది సరోజ కుంపట్లో నిప్పులు సరిచేస్తూ—

సరోజకు కోపం వస్తుంది; రావాలి; తాను పోగొట్టాలి—అదీ శేషగిరి వ్యూహం.... "ఏయ్ రాధా!'

"ఏమిటండీ మీ బాధ?"

"ఒక్క బాధకాదే రాధా! ఇది యొక బాధాతోరణాలగాథ!!....." అని శేషగిరి దీనంగా ఉపన్యాసధోరణిలోకి దిగేసరికి, గిన్నెదించి, కుంపటిని మూలకు లాగేసి, ఇటు తిరిగి పద్మాసనం వేసుకుని, అరచేతి మీద మొహం ఆనించి, శౌనకాది మహామునుల్లా కూర్చుంది సరోజ.

శుకమహర్షిలా మొదలెట్టాడు వాళ్ళాయన:

"మొట్టమొదటిసారి ఎగ్జిబిషన్‌లో నువ్వు మెరుపులా కన్పడ్డప్పుడు నువ్వు 'జ్యోత్స్న'వని నమ్మాను... బీచిరోడ్‌లో దీపస్తంభం ప్రక్కన నాకోసం నిలుచున్నప్పుడు నీ పేరు 'లత' అయితే ఎంత బాగుండునో అనుకున్నాను .... మన పెళ్ళిపత్రికలో నీపేరు చూడగానే 'కల్యాణి' అనాలనిపించింది.... ఆరోజు రాత్రి మనింటో కట్టేసిన దూడకు నువ్వు సపర్యలు చేస్తూంటే నిన్ను "కరుణా" అని పిలుద్దామని తోచింది...."

"ఊ....." అంది జ్యోత్స్న—లతా — కల్యాణీ కరుణ, మెరుస్తున్న కళ్ళతో.

"ఎందుకో— నిన్న రాత్రి నువ్వు ఎవరోకాదు, నా రాధవే అనిపించింది—పొద్దున్నే నీతో— ఆ మాట చెప్పాలనుకుని—"

'అనూరాధా!—'అని పిలిచారు; అంతేనా?

"పోనీ వీటన్నిటిలో ఏదయినా ఒక్క పేరు నెన్నుకోరాదూ?" అని సూచించాడు భర్త.

"నాకేదీ నచ్చలేదు—"

"అయితే నీకు నచ్చిన పేర్లు చెప్పు. వాటిలో నాకు ఇష్టమయిన దానిని చెబుతానూ—" అని రాజీపడ్డాడు శేషగిరి.

అరనిముషం ఆలోచించింది సరోజ.

"వాసవదత్త — ఎలా వుంది?" అని అడిగింది.

"వసపోసిన గిత్తలావుంది—"

"వాణీ—యో?"

"బాణీ బావులేదు"

"సుషమ?"

"విషమంగా ఉంది—"

"మంగళ—?"

"మరీ రేజర్ గుర్తుకొచ్చేలావుంది—"

క్షణం ఆగి పలికింది సరోజ. "పోనివ్వండి? ఇంకోరకం పేర్లు చెబుతాను. వాటిలో మీకు నచ్చింది తప్పకవుండి తీరుతుంది.

"నీ ప్రయత్నాలకు నా సహకారం ఎప్పుడూ వుంటుంది—" అన్నాడా ఆదర్శపురుషుడు.

"—వెంకటసుబ్బమ్మ—" అని పలికి పరీక్షగా శేషగిరిని చూసింది సరోజ. అతడు కళ్ళు మూసుకున్నాడు.

"లక్షింనరుసు—"—ఇది విని చేతులతో చెవులు మూసుకున్నాడు శేషగిరి.

అతడి చేతిని బలవంతాన లాగిపారేసి చెవిలో చెప్పింది సరోజ—"అలిమేలుమంగ!—"

"అవు. అవు!! 'సరోజే' బాగుంది; ఎంతో బాగుంది—" అని కళ్ళూ చెవులూ తెరిచాడు శేషగిరి.

శేషగిరి నేడిపిస్తే తన చెవులు పిండుతాడు. అది సాకుగా అతడి ముక్కుపట్టి లాగొచ్చు—అదీ సరోజ పథకం.

"ఏబ్బే! 'సరోజా' మరీ పాతకాలం పేరండీ.... క్రొత్తదేదయినా పెట్టుకోవాలని నాకూ వుంది—"

"చాల్లేవమ్మాయ్ చాలు! ఏదో నేరక ఇందులోకి దిగాను.....ఇంకా లెంపలు వాయించడమెందుకూ?"

చిరునవ్వుల మువ్వలు గలగలలాడాయి.

"హుం.....రోజు రోజుకూ రెచ్చిపోతున్నావు.... నీ భర్త—అనగా నీ దేవుడు—ఇలా పరాజితుడై పశ్చాత్తాపం వగైరా పడిపోతుంటే సిగ్గూ — భక్తీ లేకుండా నవ్వుతావూ?"

"అది కాదండీ—ఆదివారం పొద్దున్నే నా పేరు మీదపడ్డారుకదా, తమ అభిధానాన్ని గురించి ఆలోచించారూ?"

ఆశ్చర్యంతో విండింది అబ్బాయి నయనయుగళం.

చిలిపిగా చెదిరింది అమ్మాయి అధరద్వయం.

"ఏమండోయ్......కాస్త అవధరించండి! 'శేష' అంటే 'మిగిలిపోయినది' అని అర్థమండి. 'గిరి' అంటే 'కొండ' అని తాత్పర్యమండి; మరేనం... ఆ రెంటినీ కలిపి చెప్పుకుంటేనండీ—తమ నామానికి "మిగిలిపోయిన కొండ"అని టీక వస్తుందండి ...చు కోలేని సరోజ చెక్కిళ్ళలో కుంకుమ ...చింది.

"—మిగిలిపోయిన కొండ కాకపోతే 'కుండ' అనుకో నాకేం—నీ మొగుడి పేరేగా!"

"మిగిలిపోయిన కుండ!! మిగిలి—పోయిన—కుండ" అని రెండుసార్లు అనుకుని "బాగుందిస్మండీ—'కొండ'కన్నా ఇదేనయం!" అంది సరోజ—అల్లరి మీద అమాయకత్వం పూసి.

"అంతగా నవ్వేయకోయ్.....ఆమాత్రం విద్య నాకూ వచ్చు.....కావాలంటే చెబుతా విను.... 'రోజా' అంటే 'గులాబీ పువ్వు!' తెలిసిందా.... 'స' అంటే—'తో'—అని అర్థం—"

"ఏదీ, మన—'చేతన్—చే—తోడన్—తో—' యేనా?"

"ఆ—అదేగాని, నువ్వు చిన్నయసూరిలా అడ్డం రాకు......ఏం....ఆ రెండర్థాలూ కలిపి నీ పేరుకు నిలువునా భాష్యం చెబుతే 'గులాబీతో వుండునది' అనగా—'ముల్లు' అని తేలుతుంది"—అని విజయగర్వంతో చూసిన శేషగిరి మరుక్షణం కెవ్వు

మన్నాడు.

"ఏయ్, నన్నలా గిల్లావెందుకూ?"

"ముల్లనికదూ?" అన్న సరోజ వీపువిదు ఒక్కటి వడ్డించి—"కొండనికదూ—అంచేత!" అని సంజాయిషీ ఇచ్చాడు శేషగిరి.

"ఇంతకూ ఈ పూట మన భోజనం ఎవరింటో?"—అంది సరోజ వీపు రుద్దుకుంటూ—

"కావాలంటే హోటలుకెళ్దాం; సాయంకాలం సినిమా అన్నావుగా, అలాగే అదీ కానిద్దాం....."

ఎందుకో ఎత్తు మారుతూందని తెలుసుకుంది కి తల వూపింది సరోజ.

"ఆ ముదురువచ్చ చీరమీదకు నల్ల, జరీ బార్డర్ చోళి ఇవ్వాళే కొనుక్కుందాం—ఏం...."

"థాంక్స్!" అని—అతడి కళ్ళల్లోకి చూసింది సరోజ. ఆమె చూపుని తప్పించుకుంటూ శేషగిరి ఏదో నసిగినట్లనిపించింది.

"గొణక్కపోతే అదేదో వినపడేలా చెప్పరాదూ?"

"అబ్బే ఏముందీ—ఏమీ లేదుగాని సరోజా నీ కింతభక్కగా కాఫీ తయారుచెయ్యడం ఎవరు నేర్పారా అని నాకెంతో ఆశ్చర్యం వేస్తుంటుంది."

"ఓహో, ఇదన్నమాట కథ?" నవ్వుల పున్నమి ముందరి దశమిరేఖ మెరిసింది.

"నిజంగానే సరోజా, ఎందరెందరెందరో తయారు చేసిన కాఫీలు తాగానుకానీ నీలా అద్భుతంగా చేయగల్గినవా రింకొక్కరు కన్పించలేదు నాకు—"

"కవిగారి అభిప్రాయం కనుక్కున్నాను, కానీ బొత్తిగా లాభంలేదు మహాశయా!..... ఎన్ని డొంక తిరుగుళ్ళవెంబడి వచ్చినా — మీకు రెండోసారి కాఫీ ఇవ్వబడదు" ఇహ దయ చెయ్యండి....."

"అబ్బే—రెండోసారి కాఫీ కావాలని నే నెప్పుడన్నానూ? ఏదో సెలవురోజుకదా, కొస్త తీరికవుంది కదా, కాఫీ నువ్వెంచక్కా చేస్తావో చెబుతాంకదా, ఎటూ దాన్నిగురించి చెబుతున్నప్పుడు దాంతస్సదియ్య ఉదాహరణకయినా ఓ అరగ్లాసెడు చేతిలో వుండడం బావుంటుందికదా—అని సూచించబోయానుగానీ—"

"సూచనలూ, యోచనలూ ఈ పూట ఫలించవు—" అని స్పష్టంగా చెప్పింది సరోజ.

"ఏం—?"

"ఏమేవిటి ఏం?.....నెలరోజులకింద మీరేం చెప్పారో గుర్తులేదూ?....'టీ' తాగితాగి కృష్ణమీనన్ ఆవళంగా కిందపడిపోయాడని చెప్పలేదూ-? కాఫీ తాగితాగి మీ హెడ్క్లర్కు 'అల్సర్'తో పోయాడని వివరించలేదూ? 'కేఫిన్' విషం లోపల చేరితే తర్వాత ఎక్స్‌రేలూ వగైరా యాతనలన్నీ పడాలని హెచ్చరించలేదూ—"

"ఆరోజేదో ఊసుపోక కబుర్లు చెబుతే-అలా కన్నాంబలా మీదికొస్తావేం—"

"చక్కగా గంటక్రింద గ్లాసెడు కాఫీ తాగి మళ్ళీ తయారయ్యారేం?"

"ఏం—ఎందుకవనూ, ఎందుకవనూ అంట? ఇది నా ఇల్లు; ఇది నా హోటలు; ఇది నా హక్కు; ఇది నా స్వరాజ్యం —" అంటూ పేట్రేగిపోయాడు శేషగిరి.

"అయితే?—"

"అయితే-? నాకుకొన్న-కుం ఖేం—చాల తక్కువ-

జాకొద్దిగా కాఫీ కావాలి!"

"ఓహో!"

"ఓహో ఏవిటి సోహో? - మాటలు చాలించి 'యాక్షన్'—అనగా చర్య తీసుకొమ్మ' లెమ్మ—"

"ఊ....ఇంకా?"

"(ఫ్రా—సరోజినీ! బెఫెల్ ఇస్ట్ బెఫెల్!!"

"ఏ-వి-టీ?"

"బెఫెల్ ఇస్ట్ బెఫెల్—"

"అంటే?"

"ఆజ్ఞంటే ఆజ్ఞే—అని ఈ జర్మనువాక్య తాత్పర్యం; '(ఫా'- అంటే '(శీమతి' అని అర్థం—" అని హిట్లర్ బట్లర్‌లో చిరునవ్వేశాడు శేషగిరి.

సరోజ లేచింది.

మన జర్మన్‌దెబ్బ కీవిడ అదిరిపోయింది; కాఫీ పొడుం డబ్బాదులను అలమారలోంచి తీసేం దుకు లేచింది- అని (భమ పడ్డాడు నాయకుడు.

ఆమె అలమారకు తాళం వేసింది; శేషగిరి భిన్నం అయిపోయాడు.

తాళాలగుత్తిని చీరెకొంగుకు ముడేసింది. కొంగునితీసి నడుములో చెక్కుకుంది. ఎడమ చేతిని నడుము కానించింది. నిల్చునే చేయి జాపింది; "బెఫెల్ ఈన్, నాట్ బెఫెల్! ఇహ లేవండి!"

"నీ జర్మనింగ్లీషు మి(శమం నీ కా ఫీలాలేదు—" అని ఆమెచేతి నందుకుని లేచాడు శేషగిరి.

ఇంతలో వీధివైపునుండి ఎవరో బావురుమని అరుస్తున్నట్లు వినిపించగా అటు చెవిపెట్టాడు శేషగిరి. క్షణానికి రెండుసార్లు చొప్పున తన్నెవరో పిలుస్తున్నట్లు (గహించినవాడయి, వాయువేగంతో వెళ్ళి తలుపులు తీశాడు.

"ఓహో కోనేటిరావా!! రావోయ్ కోనేరూ, రా!"

"ఏరా అబ్బీ! ఇంకాస్సేపుంటే తలుపులు తీయించడానికి పోలీసుల్ని పిలిపించేవాడిని-" అని జోకు పారేసి, నవ్వేసి, కుర్చీ నలంకరించేశాడు కోనేటి రావు.

"ఏవి(టా కోనేటం, ఇలా కొట్టుకొచ్చేశావేం.... అ......ఊ......కబుర్లేవిటి? విశేషాలేవిట-? మీ ఆవిడ పురుడోసుకునిసిందా? మీ తమ్ము డెక్కడో జాయినయ్యాట్టగా?—ఇల్లుగలావిడ మీ వాటామీద కొత్తపెంకుల్ని కప్పిందా—అసలు కప్పదా?— కార్యాలయంలో ఎడ్-క్లర్కేవంటాడూ-" అని తపతప (ప్రశ్న లడిగేసి జవాబులు కూడా వినకుండా, వంటింటికేసి తిరిగి "సరోజా!" అని పిలిచాడు శేషగిరి.

తలుపువారకొచ్చి నిల్చుందావిడ.

"సరోజా! మా కోరావు, కోరావు— అని చెబుతుంటానే ఆ కోనేరే వీడు!!" అని కాటెల్యుడిలా నవ్వి—"కాస్త మా ఇద్దరికీ కాఫీ పట్టుకొస్తావూ?" అని ముగించాడు.

గిరుక్కున తిరిగిన సరోజవీపు చూస్తున్న శేషగిరికి "అబ్బే—ఇప్పుడు కాఫీ ఎందుకురా—" అన్న కోనేటి కంఠం వినిపించింది.

"కాఫీ ఎందుకేవిటి నీ మొహం....అది మన హక్కు—" అన్నాడు శేషగిరి.

అర్థమయినట్లునవ్వేసిన కోరావు—"అదికాదోయి- ఇది కడుపా, కోనేరా? ఎన్నిసార్లు (తాగడం-" అని నవ్వి, ఇందాక శేషగిరి ఏకరువుపెట్టిన (ప్రశ్నలకు వరుసగా సమాధానాలు వల్లిస్తున్నాడు—

సరోజ వెండిపళ్ళెంలో రెండు కప్పు లుంచి తెచ్చింది. తలవంచుకుని కోపాటి (ప్రక్కనో కప్పుంచింది. ఘుప్పుమంది కాఫీ కమ్మదనం.

"మా ఆవిడ చేతి కాఫీ 'ఏ-వన్'గా వుంటుందిరా నేరూ!" అంటూ సరోజకళ్ళల్లోకి చూశాడు శేషగిరి. ఆపాటి కావిడ అతడి(ప్రక్కన రెండో కప్పునుంచి లోపలికి వెళ్ళిపోవడం జరిగింది.

"మరే....కాఫీ అచ్చం కొబ్బరి నీళ్ళల్లా వున్నాయిరా శేషం! ఎంత అదుర్‌ష్టవంతుడివో!!"

గర్వంగా నవ్వుతూ తన కప్పులోకి చూసిన శేషగిరివెంప ఫెళ్ళుమన్నట్లనిపించింది. లోన లెక్కడో సరోజ ఘల్లుమన్నట్లుకూడా అనిపించింది.

అతడి కప్పులో చిక్కటి పాలు తెల్లగా నవ్వాయి; కాఫీని చప్పరిస్తూ సమాధానాలు సాగించింది కోనేటితోని కంఠం.

శేషగిరిబుర్ర తిరుక్కుమంది.

"సరోజా!"

వచ్చింది.

"మా కాఫీలో మరీ ఇంత ఎక్కువ పంచదార వేశావేం?....ఓ గ్లాసుతో డికాక్షన్ తెచ్చిపెడతావూ?" అతివినయంతో అడిగాడు శేషగిరి.

'అబ్బే .... నాదావిలో పంచదార సరిపోయిందే" అన్న కోనూతి స్వరం మహా యుద్ధంలోవున్న చెవిటివాడిచెవి కందలేదు.

సరోజ వచ్చింది; రంగుచపెట్టింది డికాక్షన్ గ్లాసును; తక్షణం వెళ్ళిపోయింది.

ఆ డికాక్షన్‌ని పాలతో కలిపి అరగిస్తూ "ఊ ....నే చెప్పానుకదుటోయ్.....కాఫీ తయారు చెయ్యడం—అన్నది ఒక పెద్ద-మహా-గొప్ప-కళ-" అన్నాడు శేషగిరి.

అవునన్నాడు కోనేరు; అదన్నాడు ఇదన్నాడు; ఎన్నో అని ఆఖరికి బయటికి (ప్రవహించేశాడు.

లోపలికి నడిచాడు శేషగిరి.

వంటిల్లు మూసివుంది.

ఆ (ప్రక్క గదిలో సోఫాలో కూర్చునుంది సరోజ. ఆమె మొహానికడ్డంగా దిన ప(త్రికవుంది.

ప(త్రికను లాగి పారేశాడు శేషగిరి. ఆమె కళ్ళు మూసుకుంది. నేలమీద ఆమె కాళ్ళ దగ్గర కూర్చున్నాడు.

"సరోజా!"

ఆమె కళ్ళు మూసుకునే వున్నాయి.

ఆమె తెల్లచీర నల్లంచును సరిచేస్తూ అన్నాడు "సరోజినీ! గోమెన్నసాయ్!!"

ఆమె కళ్ళుతెరిచింది. నోరు తెరవకనే (ప్రశ్నించింది-

శేషగిరి చెప్పాడు:"జపాను భాషలో'గోమెన్నసాయ్-' అంటే— నన్ను క్షమించు— అని అర్థం—"

ఆమె కళ్ళు నవ్వుతున్నాయి—

"అవునోయ్!!"

ఇంక, వాళ్ళిద్దరిమధ్య

తానెందుకని

దూరం—

సిగ్గుపడి—

పోయింది! ★





# మనమూ మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## ఉచ్చారణలోపములు

మాట్లాడుతున్నప్పుడు మాటలలో ఉన్న శబ్దములన్నీ ఆయా ప్రాంతములలో వారు సాధారణంగా ఉచ్చరించవలసినట్లు ఉచ్చరించలేకపోవడం, అక్షరములు దిగమింగడం ఒక అక్షరానికి మరొక అక్షరం పలకడం, లేక, ఆ యా శబ్దములను మార్చి పలకడం, ఉచ్చారణలోపములు అంటారు.

సాధారణంగా ఉచ్చారణ లోపములు, చిన్న పిల్లలలో వినిపిస్తూ ఉంటవి. కాని పెద్దవారిలోనూ యీ లోపములు అక్కడక్కడ నిలిచిపోతవి. ఈ లోపం ఉన్నచోట ఉచ్చరించే మాటలోవుండే చివర హల్లు, అనుచ్చరితముగానో, అర్ధోచ్చరితముగానో ఉండిపోతుంది. "వస్తోంది" అనటానికి బదులు 'వస్తోం' లేక వస్తోంద్—అంటారు. 'ది' కి బదులుగా వాడే 'ద్' కూడా పూర్తిగా ఉచ్చరించబడదు.

ఉచ్చరితశబ్దములు ఏకాక్షరములయినప్పుడు, చివరఅక్షరం దిగ్రమింగబడినంతగా మాటలో మధ్య అక్షరములు మ్రింగబడవు. కాని, మాట మధ్యలో రెండు హల్లులు కలిసి సంయుక్తాక్షరం ఏర్పడ్డపుడు, అందులో ఒక శబ్దమో రెండవ శబ్దమో ఉచ్చరించబడకపోవచ్చు. 'స్థానం' అన్నప్పుడు 'స' కార తకారములలో తరుచు 'స'కారం అనుచ్చరితమౌతుంది. నాలుక కొనను పై పళ్ళ వరుస వెనక తాకించి, గాలి పైకి వదిలినప్పుడు 'త' కారం పుడుతుంది. 'స' 'శ', 'ష' శబ్దములు పై పళ్ళ వరుసకు వెనకవున్న కఠినమైన భాగం మీద నాలుక కొనవుంచి, గాలి విడచినప్పుడు పుడతవి. ఆ భాగం వెడల్పు, అంగుళంకంటె ఉండదు. క్రిందనుంచి నాలుకకొనపైకి పోయిన కొద్దీ, 'స' కారం వరుసనై 'శ' కార'ష'కారములు పుడతవి. ఉచ్చారణలోపములలో మాటికి అరనై పాళ్ళు స శ ష లతో సంయుక్త శబ్దములు ఏర్పడ్డప్పుడు ఏర్పడేవే! 'స్థానం'లో తకారం ఉచ్చరించడం తేలిక. 'స' కారం కష్టం. అందుకని 'స' కారం విడిచి తకారం వుచ్చరించబడి 'స్థానం' తానం అవుతుంది.

ఒక శబ్దానికి బదులు మరొక శబ్దం ఉచ్చరించడం కూడా, తరుచుగా, చిన్న పిల్లలలోనే కనిపిస్తుంది. కాని 'అత్తయ్యా కాస్త వత్తి పెట్టవమ్మా" అన్న మాటలను "అట్టయ్యా కాట్ట వట్టి బెట్టవమ్మా" అనడం జరుగుతుంది. కాని, పటముల ద్వారానో, నాలుకను ఆ యా స్థానములలోవుంచి చూపి ఆయాశబ్దములు ఉచ్చరించి వినిపించడంవల్లనో చాలామంది, యిటువంటి లోపాలు సవరించుకోడము జరిగింది. 'ర' కారానికి 'వ'కారము లేక 'ద' కారము వాడడం తరుచు జరుగుతుంది. పై పళ్ళ వెనుక నైపున గట్టి ప్రదేశం దగ్గర నాలుక మొన ఉంచి, దానిని వేగంగా స్పందింపజేస్తే 'ర' కారం పుడుతుంది. 'ర' కారం ఉచ్చరించడానికి చాలా శ్రమకావాలి. ఆ కీలకం తెలియనివారు రాయి అంటానికి 'వా'యి అంటారు. లేదా 'దాయి' పెట్టికొత్తేను అంటారు. 'వ' వర్గం రెండు పెదవులు గట్టిగా చేర్చి గాలి విడిచినప్పుడు పుడుతుంది. వకారరం ఉచ్చరించిన వెంటనే 'ర'కారం ఉచ్చరించడానికి చాలా అభ్యాసం కావాలి. "ప్రభూ! ప్రియం' ఇటువంటి శబ్దములు, పెదవుల కదలికచూచేవారు గమనించకుండా ఉచ్చరించడం చాలా మందికి చేతకాదు.

పిల్లలూ స్పష్టోచ్చారణ చేతకాని పాటక జనమూ ప్రభూ అన్న మాటను 'పెబూ" అంటారు. కొన్ని జాతులవారికి ప్రశబ్దమేరాదు. అటువారు 'ప్ర'తో పకార రకారములను విడి విడిగా ఉచ్చరిస్తారు. 'ప' కు బదులు, 'బ' వాడతారు. 'ప్రియము' 'ప్రమాదిచ' అన్నమాటలను 'పిరియము' 'పిరమదిచా' అని అంటారు. 'పద్మ' అనడానికి బదులు 'బద్మ' అంటారు. వ్రాయడం కూడా 'పిరియము' అనే వ్రాస్తారు. అల్లాగే కా కు బదులు హా వాడతారు. 'ప్రకాశం' అంటానికి బదులు 'ప్రహాశం' అంటారు. ఈ ఉచ్చారణ లోపం వారిలో జాతీయమైనది. 'వంగీయులు' 'వ' కు బదులుగా 'బ' వాడడం ప్రసిద్ధమైన విషయం. కొన్ని సందర్భాలలో 'శబ్ద సామ్యం' వున్న మాటలలో ఒక మాటకు బదులు మరొక మాట వాడడం జరుగు

---

## మాటలు-ఉచ్చారణ

(గతవారం తరువాయి)

అచ్చులు, నాదములు. హల్లులు శబ్దములు. అంటే అచ్చులు ఉచ్చరిస్తున్నప్పుడు ఉత్పత్తి అయినవన్నీ అనుస్వరములు, హల్లులు ఉచ్చరిస్తున్నప్పుడు ఉత్పత్తి కావు. వాటి వేగం నాదక్రమంలో వుండదు. కాని కొన్ని హల్లులు, ఉత్పత్తిలో అచ్చులకు చాలా దగ్గరగా వుంటవి. 'ల' కార 'మ' కార 'న' కార 'ర' కారములలో శబ్దంకంటె నాదమే ఎక్కువగా వుంటుంది. అంటే లేరింగ్సులో ఉత్పత్తి అయ్యే శబ్ద భాగము నోటిలో ఉత్పత్తిఅయ్యే శబ్ద భాగంకంటె ఎక్కువ. వీటి తరవాత 'బ' కార 'డ' కార 'జ' కార 'వ' కారములలో కంఠ స్వర భాగము అధికము,

'ప' కార 'ఫ' కార 'ట' కార 'స' కార 'క' కారములు కేవలం నోటిలో ఉత్పత్తిఅయ్యే శబ్దములు. వాటి ఉత్పత్తిలో కంఠస్వర సహకారం లేదు.

పై పంటివరసకు నాలుక కొన అనించివాటిమధ్య ఏర్పడిన సన్నని సందునుంచి గాలినివేగంగా బయటికి వదిలినప్పుడు, నాలుక చివరభాగం పై పంటి వరసపైనవున్న అధిజిహ్వ (Hard palate) ముందు భాగమును తాకినప్పుడు 'ట' కార డ కారములు ఉత్పత్తి అవుతవి. నాలుక మధ్య భాగము అధిజిహ్వలో వెనుకవున్న మెత్తని భాగమును (Soft–palate) తాకినప్పుడు 'క'కార 'గ' కారములు పై పళ్ళ మధ్యభాగమును తాకినప్పుడు జకార'ర'కారములు ఉత్పత్తి అవుతవి. పై పళ్ళ చివరలను నాలుక చివరకు మధ్యన ఖాళీలోనుంచి గాలిపోయినప్పుడు 'శ' కారము, అధిజిహ్వ కఠిన భాగానికీ నాలుక చివరకు మధ్య ఖాళీలోనుంచి గాలి బయటికివచ్చినప్పుడు 'ష' కారము పుడుతుంది. క్రిందిపెదవి—పై పెదవి లోపలి భాగమును త్రాకినప్పుడు గాలి బయటికివస్తే 'వ' కార 'ఫ' కారములు, పెదవులు గట్టిగా అదిమి గాలితో బలవంతంగా అవి తెరవబడ్డప్పుడు 'ప' 'ఫ' బ భ మ లు ఉత్పత్తి అవుతవి.

గుస గుసలాడుతూ మాట్లాడినప్పుడు ఉత్పత్తి అయ్యే శబ్దములన్నీ నోటిలోనే ఏర్పడతవి. వాటి ఉత్పత్తిలో కంఠస్వరానికి సంబంధంలేదు. అయితే కంఠస్వర సహాయంతో అచ్చులను ఉచ్చరించినప్పుడు నాలుక అంగిలి ముక్కు నోటిలో యితర భాగములు పరస్పరం ఏ సంబంధం కలిగివుంటవో అల్లాగే గుస గుసలతో మాట్లాడినప్పుడు ఆ యా శబ్దములనుబట్టి ఆ సంబంధమే కలిగి వుంటవి.

అనేకులు అనేక రకాలుగా అక్షరములను విభజించారు. ఎవరయినా నాలుక, నోటిలోఉండే స్థితిని

లది. 'ఇం(క్రిమెంటు' అండానికి బదులు 'ఇంక్లి మెంటు' అనీ, 'ఇన్‌టర్వ్యూ' అండానికి బదులు 'ఇంటర్‌వలర్'' అనీ కొందరు తరుచుగా అంటూ వుంటారు. ఇది కేవలం ఉచ్చారణ లోపంకాదు. ఇందులో కొన్ని మానసికలోపాలు కూడా వుంటవి. బిడ్డ మాటలునేర్చుకొనే కాలంలో తనవారు ఉపయోగించే అన్ని శబ్దములనూ నేర్చుకోనప్పుడు తనకు రాని శబ్దములను వాడవలసి వచ్చినప్పుడు ఒక శబ్దానికి బదులుగా, దానికి సన్నిహితమై, తను తేలికగా ఉచ్చరించగలిగిన మరొక శబ్దమును ఉచ్చరించడం జరుగుతుంది.

ఉచ్చారణలో మూడవ లోపం 'శబ్దము'ను వికృతి పొందించడం. 'స' కార 'ర' కారములు చాలా సాధారణంగా ఇల్లా ఉచ్చారణలో వికృతి పొందుతవి. ఒక చిన్న రేడియో మీటరు బాండులో అరంగుళం దూరంలో ఇరవై స్టేషన్లువుంటే, ఒక స్టేషన్‌కు ట్యూను చేయబోయి మరొక స్టేషన్ పెడుతూ వుంటాము. పై పళ్ళ చివరనుంచి ఒక అంగుళం దూరంలో నాలుక చివరస్థితిమారి సామ్యము వున్న అనేక శబ్దములు ఉత్పత్తి అవుతవి. 'స' 'శ' 'ష' జ ర 'ల' కారములు యిల్లాగే ఉత్పత్తి అవుతవి. మాట్లాడే రోజులలో ఈ స్థానములు గమనించి అభ్యసించడం జరగకపోతే, ఉచ్చారణ లోపాలు తప్పవు. ఇల్లాగే 'ఫ' కార 'వ' కారములు ఉత్పత్తిలో, ధ్వనిలో సామ్యం కలవి. 'ఫాయిదా' అంటానికి బదులు 'వాయిదా' అంటానికి కారణం యిదే. కొన్ని భాషలు మాట్లాడే వారికి కొన్ని శబ్దాలే వస్తవి. ఉత్తర హిందూస్తానంవాళ్ళు 'శక్తి' 'సహాయం' అన్నమాటలు ఉచ్చరించడంలో 'షక్తి' 'షహాయం' అంటారు. పిల్లలూ ఈ లోపమే చేస్తారు. 'క్ష' పలకడం కష్టం. 'అక్షరం' అంటానికి బదులు 'అచ్చరం' అంటారు. ఇక్కడ నాలుక మధ్య పై అంగిలి తాకగా 'క' కారం పుట్టిన వెంటనే నాలుక, చివర 'అధి జిహ్వ' కఠినభాగం పై అంచును తాకవలసి వస్తున్నది. గాలి వూపులో, నాలుక చివరపళ్ళనుతాకడం తేలిక. అక్కడ చకారం పుట్టి అక్షరంలో 'క్ష' 'చ్చ' గావికృతి పొందుతుంది. ఇల్లా ఎన్నో వేల ఉపమానాలు, ఉచ్చారణ లోపములో రకాలు వర్ణించడానికై యివ్వవచ్చును. ఉచ్చారణవేరు. వర్ణ(క్రమంవేరు. '(ప్రియం' అంటానికి 'పిరియం' అనే అరవవారు '(ప్రీతి' అన్నప్పుడు 'పిరీతి' అనరు. (ప్రీతి అనే అంటారు. ఈ రెండు '(ప్ర' కారం పలకలేకకాదు. అల్లా పలకడం అభ్యాసం లేక. అల్లాగే వచ్చాడు అంటానికి బదులు 'వచ్చిడు' చెప్పేడు అంటానికి బదులు 'చెప్పిడు' అంటం వర్ణ(క్రమలోపములు. ఒక నిర్దిష్ట శబ్దమును అందరూ అంగీకరించిన విధంగా ఉచ్చరించలేకపోవడమే ఉచ్చారణ లోపం. ఉచ్చారణ లోపములు. అందరిలోనూ ఒకలాగే వుండవు. అల్లాగే ఒకరిలోనే అన్ని సమయములలోనూ ఒకలాగ వుండవు. ఒక మాటలో ఒక శబ్దం సంతృప్తికరంగా అన్నవారు ఆ శబ్దమే మరొక సందర్భంలో మరొక మాటలో వచ్చినప్పుడు సరిగా పలకలేకపోవచ్చు.

## ఉచ్చారణశక్తి ఎప్పుడు పరిపూర్ణ మౌతుంది?

ఇన్ని సంవత్సరాలకు ఉచ్చారణ శక్తి పరిపూర్ణంగా సిద్ధిస్తుందని చెప్పడానికి ఆధారమేమీలేదు. అనుకూల పరిస్థితులలోవున్న పిల్లలకు, 4 సంవత్సరముల వయస్సు నాటికి ఉచ్చారణ శక్తి పూర్తిగా లభించవచ్చు. మొగ పిల్లలకంటె ఆడ పిల్లలకు మాటల త్వరగా వస్తవి. ఆరు, ఏడు సంవత్సరములదాక మాటలు బాగా రానివారున్నారు. అప్పటికీ రాకపోతే కారణము వెదికి తగిన చికిత్సా విధానం అవలంబించవలసివస్తుంది. మూడు సంవత్సరముల వరకు మారకుండావుండే ఉచ్చారణ లోపాలెన్నో, ఆ తర్వాత అతి త్వరగా అంతరించిపోతవి. కాని ఆ విధంగా జరగక, మాటలు రాని బాల బాలికలు సాటి పిల్లలలో నవ్వులపాలై తల్లి దం(డులకు సమస్యలుగా తయారవుతారు.

ఉచ్చారణలో లోపములకు కారణములు 'యివి' అని నిశ్చయంగా చెప్పలేము. కొందరిలో ఆ కారణములు అనేక రోగ పరిస్థితులు కావచ్చును. మరి కొందరిలో కారణాలే కనిపించకపోవచ్చును. కాని తెలిసిన కారణములను యీ (క్రింది విధంగా విభజించవచ్చును.

1. శారీరకములయిన కారణములు (Constitutional causes.)

2. తర్ఫీదు లోపములు.

3. మానసిక జీవితంలో లోపములు. శారీరక కారణములలో అతి ముఖ్యమయినవి. (1) పుటక లోనే పెదవులలో తొ(రలు ఉండడం (Ham Lip) (2) మెదడులో రక్త నాళములు, (ప్రసవ కాలం లోనో తరవాతనో చిట్లి పక్షవాతం ఏర్పడడం (3) (శ్రవణేం(ద్రియంలో లోపములు (4) దంతముల నిర్మితిలో దంత(శేణుల ఆకారంలో, పైవరుస (క్రింది వరుసల సంబంధంలో ఎగుడు దిగుడులవంటి లోపములు (5) అంగిలిలో తొ(ర, (6) నోటి పై భాగములోవున్న పేలెట్ (Palate) ఆకారంలో దానికీ, నాలుక ఆకారానికీ మధ్య వున్న ఆకార భేదములు.

మాట లాడడానికి దంతములకూఉన్న సంబంధం యిదివరకే వివరించాను. 'శ' కార 'స' కారములు ఉచ్చరిస్తున్నప్పుడు (క్రింది పెదవిపై వంటి వరుసను తాకడం అవసరం. పై పళ్ళు కొందరిలో అంగుళం దాకా ముందుకు తోసుకుని వుండి (క్రింది పెదవి నాటికి తాకడమే సాధ్యంకాదు. 'త' కార 'ద' కారములు పలకడానికి నాలుక పై పళ్ళ వెనుక భాగమును తాకడం అవసరం. 'ప ఫ బ భ మ' లు వుచ్ఛరించడానికి రెండు పెదవుల కలయిక అవసరం. పళ్ళుముందుకు తోసుకువస్తే యీ కలయిక కష్టసాధ్యమో, దుస్సాధ్యమో అవుతుంది. 'స జ ఛ' శబ్దములు రెండు పలువరసల చివరలను నాలుకకొన ఏకకాలంలో కలిపి, గాలి వాటి మధ్యనుంచి పోయినప్పుడు ఏర్పడేవి. పళ్ళు వరస సరిగా లేకపోతే యీ శబ్దములు ఉచ్చరించడం చాలా కష్టం. దంతాలు నములడానికెంత అవసరమో మాట్లాడ్డానికీ అంతే అవసరం. కాని దంతలోపము ఉన్నంత మాత్రాన, మాటల్లో లోపములు ఉండాలని నియమంలేదు. కాని పళ్ళవరసల సంబంధంలో ఆకారం

(60 వ పేజీ చూడండి)

---

దవడలు అంగిలి వంటి నోటి భాగముల సహాకారమునుబట్టి అక్షరములను విభాగించారు. ఆ భాగములతో ఉచ్ఛ్వాసవాయువు రుద్ధమై వస్తున్నదో బలవంతంగా తెరుచుకొని వస్తున్నదో కనుక్కొని ఆంగ్ల భాషావేత్తలు (ఫ్రైకేటివులుఅనీ,(Fricare) (ఫ్రైకేర్‌అంటే లేటిన్ భాషలో రుద్ధకోడం) గాలి బలవంతంగా తెరుచుకోవచ్చినప్పుడు ఎల్‌క్స్‌ప్లోజివ్‌లు (Explosive) అనీ, హల్లులను విభజించారు.

మనవారు అక్షరములను యీ(క్రింది విధంగా విభజించారు.

అ ఆ క ఖ గ ఘ ఙ హః కంఠ్యములు

ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ తాలవ్యములు

ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ళ ష మూర్ధన్యములు.

ఌ ౡ త థ ద ధ న ల స ౘ ౙ దంత్యములు

ఉ ఊ ప ఫ బ భ మ ఓష్ఠ్యములు

మరి కొందరు

ఞ ణ న మ అను నాశికములనీ

ఎ ఏ ఐ కంఠతాలవ్యములనీ

ఒ ఓ ఔ కంఠోష్ఠ్యములనీ

హ.(దుఃఖంలోలాగా. జిహ్వామూలీయములనీనాశిక్యములనీ

ఇల్లా అనేక రకములుగా విభజించారు.ఏమయినా నాలుకకూ నోటిలో యితర భాగములకూఉండే సంబంధాన్నిబట్టి చేసిన విభాగము, వైజ్ఞానికమయింది. మాటలాడడంలో లోపములు నాలుక ఏ స్థానంలోవుంటే యే శబ్దం ఎల్లా పుడుతుందో తెలియనందున ఎంత (శుతిలో ఏ శబ్దంఅంటే (శావ్యంగా (గాహ్యంగా అర్థవంతంగా మాట వస్తుందో తెలియనందువ ఏర్పడతవి. మూగవారికి మాటలు నేర్పే స్కూళ్ళలో ముందు పాఠం, యీ స్థానములను చూపి ఆ శబ్దములను ఉచ్చరింపజేయించడం. మన వ్యాకరణవేత్తలు శబ్దమునకు పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అని శబ్దోత్పత్తిలో పాల్గొనే అవయములనుబట్టి శబ్దమునకు నాలుగుః స్థితులు నిర్ణయించారు. శబ్దోత్పత్తికి కడుపుముందు కండరములు నాభికి సమీపంలోని అక్కలించాలి. అప్పుడే డయా(ఫం పైకిపోతుంది. గాలి ఉదరంలోనుంచి పైకిపోయే స్థితి పశ్యంతి. గాలి కంఠంలో శబ్దరజ్జువులలో నించిపోయే స్థితి మధ్యమస్థితి గాలి నోటిలో నుంచిపోయి నిర్ణీతమైన స్వరూపంపొందడం వైఖరిఅనే ఆఖరు స్థితి. ఇల్లా భాషావేత్తలు రకరకాలుగా ఉచ్చారణ (ప్రయత్న స్థానములను నిర్ణయించారు. కాని అన్నింటిలోకీ సామాన్యులకు అర్థమయ్యేది తప్పకుండా ఫలితములను ఇచ్చేది వైజ్ఞానిక విభాగమే. మాటల్లో లోపాలు సవరించుకోదలుచుకొన్నవారు యీ విభాగమును పూర్తిగా అర్థం చేసుకొని అభ్యసించాలి. ★

# కథ కాని కథ

## ఆర్యులారా! నాభార్యలారా!

### (మొదటి బహుమతి రు. 10 లు)

ఒక సంవత్సరము నాటి సంగతి. నేను, నా స్నేహితులు వసంతాపురము వెళ్ళాం. అక్కడేదో సభ జరిగేలాగున్నది. ఒకతను పెద్ద ఆఫీసరువలె ఉన్నాడు. అతను వేదికమీదకువచ్చిన వెంటనే అతనిని పుష్పమాలాంకృతుని గావించారు. కరతాళ ధ్వనులు మిన్నుముట్టినై. ఆ ఆఫీసరుగారు వెంటనే ప్రేక్షక సమూహమును ఒక్కసారి తిలకించి "సోదర సోదరీ మణులారా! ఆర్యులారా! నా భార్యలారా" అని సంబోధించారు. అందరూ ఆశ్చర్య చకితులయ్యారు. స్త్రీలు, పురుషులు చప్పట్లు తట్టిన ఆ చేతులను అట్లే పైకి ఎత్తుకొని ఉపన్యాస వేదిక మీదనున్న ఆఫీసరు మీదికి దండెత్తారు. ఇలా వస్తున్న ప్రజావాహిని చూచేసరికిఆఫీసరుగారి కాళ్ళు గజ గజ వణికాయి. దేహమంతా చమట పోసింది. అతను భయపడుతూ ప్రజలవైపు అర్థముగాక చూస్తున్నాడు. అప్పుడు ఒక బట్టతల నామాల పెద్ద మనిషి వేదికపైనెక్కి ప్రజలకు నమస్కరించి వారిని శాంతపరచి, ఆఫీసరు వైపు తిరిగి "ఏమయ్యా! అందరు స్త్రీలు నీకు భార్యలు కావలయునా?" అని విలన్ ఫోజుపెట్టి ప్రశ్నించాడు. అప్పుడు ఆఫీసరుగారు కుదుటబడి "అయ్యా నేను ముందే మిమ్ములను 'సోదర సోదరీమణులారా!' అని సంబోధించాను. నా యిద్దరి భార్యల మాట ఎత్తకపోతే వారు నన్ను ఇంట్లో పీక్కుతింటారు. కావున వారికి భయపడి అలా అనవలసి వచ్చినది" అని ముందు సీట్లలో మూగ ఎద్దులవలె కూర్చున్న తన ఇద్దరి భార్యలను చూపించాడు. అప్పటికిగాని ప్రజలు శాంతించలేదు. ఆ జనములో ఒకరు "ఎంతపని చేశావయ్యా ఇద్దరి భార్యల ముద్దుల మొగుడా!" అని నెమ్మదిగా హాస్యము చేశారు. ఆ సంఘటన, ఆఫీసరుగారిస్థితి తలచుకుంటే మాకు యిప్పటికి నవ్వాగలేదు.

సి. నాదముని ( తిరుపతి )

* * *

## "ఇల్లా ల్లు"

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా హిందీ మాష్టారు క్లాసుకు వచ్చేటప్పటికి పాఠ్య పుస్తకం ఎవరో ఒకరు బల్లపైన పెట్టుట అలవాటు. మా స్నేహితునికి హిందీ అంటే ఎక్కువ ఇష్టమగుటవల్ల తరచు వాడే బల్లపైన పుస్తకం పెట్టి ముందు బెంచిలో కూర్చుని ఎంతో ఆసక్తి వింటూండేవాడు. మా వాడికి సినిమా పేపర్ల అట్టలు వేయడం అలవాటు. ఆరోజు 'ఇంటికి దీపం ఇల్లాలే' అన్న సినిమా పేపరు హిందీ పుస్తకమునకు అట్ట వేశాడు. మా మాష్టరు పుస్తకం చేతితో పట్టుకొని 'ఈ ఇల్లాలు ఎవరిదిరా'? అని నవ్వుతూ ప్రశ్నించారు. చెప్పబోయే పాఠము ఊహించుకొంటున్న మా స్నేహితుడు పుస్తక మెవరిదని అడిగి నారనుకొని వెంటనేలేచి 'నాదిసార్' అన్నాడు. మేమంతా ఘొల్లుమని నవ్వాం. అసలు విషయం తెలుసుకొని వాడూ మాతోపాటు శ్రుతికలిపాడు.

చామర్తి వెంకట సుబ్బరావు ( భీమవరం )

* * *

## 'నీలం చొక్కా'

### (రెండవ బహుమతి రు. 5 లు)

అవి మేము 'శ్రీ యూనివర్శిటీ' చదివే రోజులు. మా ఇంగ్లీషు లెక్చరర్ బదిలీఅయి వెళ్ళిపోయారు. ఆయనకు బదులు ఇంకో కొత్త లెక్చరర్ వచ్చారు. అదే మొదటిరోజు ఏమో మొదటి అరగంటా కబుర్లతో గడిపారు. తరువాత మెల్లగా ఇంగ్లీషు పుస్తకం తీశారు. ప్రశ్నలుగానీ వెయ్యరుకదా! అని సందేహం పట్టుకొని ఆముదం త్రాగిన ముఖాలతో కూర్చున్నాం. మొదటినుంచి చదివి చస్తేగా. ఐదు నిముషాలు అలాగే నిశ్శబ్దముగా కూర్చున్నాం.

ఉన్నట్లుండి 'ఏయ్ నీలంచొక్కా' అనేసరికి ఒకరి ముఖాలొకరు చూసుకుంటున్నాం. లెక్చరరుగారు ప్రశ్న వెయ్యనేవేశారు. ఎవ్వరు మాట్లాడలేదు. సరే లెక్చరరు కూర్చిలోనుండి మా డెస్కుల దగ్గర కొచ్చి 'నీలంచొక్కా' నిన్నే అని ఒకతన్ని అడిగారు అదే ప్రశ్న. అతను దీమాగా లేచేసరికి ఏం చెపుతాడో నని గుడ్లప్పగించి చూస్తున్నారు కొంతమంది. అతడు మా త్రం ఏమో లోచించుకొన్నాడో ఏమో గబగబా చొక్కాతీసి బల్లమీద పెట్టేసి "చూసుకోండోహో" అన్నట్లు కూర్చున్నాడు. మాకేం అర్థంగాక చూస్తున్నాం.

ఏమిటోయ్ జవాబు చెప్పకుండా కూర్చున్నావు అన్నారులెక్చరర్ ఆయన ధోరణిలో. మీరు ప్రశ్న నీలం చొక్కానిఅడిగి జవాబు నన్ను చెప్పమంటారేం అది ఆ నీలంచొక్కానే అడగండి. అనేసరికి అంతా ఒక్కసారి ఘొల్లుమన్నాం. లెక్చరరుగారు కూడా అతని సమయస్ఫూర్తికి అభినందించకుండా ఉండలేకపోయారు.

ఎస్. రమాసుందరి ( విజయవాడ )

* * *

## తిరుపతి వెళ్లారా?

### (రెండవ బహుమతి రు. 5 లు)

కాఫీ హోటల్లో ఒకసారి మా మిత్రబృందం కాఫీ త్రాగుతుండగా మాలో ఒకరికి తెలిసిన అతను వచ్చి, అతనితో "ఏమండీ చాలా రోజులనుండి కనపడటంలేదు. ఈ మధ్య తిరుపతివెళ్ళారా ఏమిటి? గుండు చేయించారు" అన్నాడు. మా మిత్రుడు వెంటనే సమాధానమిస్తూ "మొన్ననే మా నాన్నగారుపోయారండీ" అనేసరికి అతను వెంటనే "మీ నాన్నగారు తిరుపతిపోతే మీరు గుండు చేయించటమేమిటండీ" అని ఆశ్చర్యం వెలిబుచ్చాడు. మేమంతా ఆ మాటలతో పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వుకున్నాం.

ఎస్. అప్పారావు, వై. రంగారావు ( నాగపూర్ )

* * *

## పెళ్లికూతురు వయస్సు

### (రెండవ బహుమతి రు. 5 లు)

మా చెల్లిని చూడ్డానికి [illegible] పెళ్ళివారు వచ్చారు. మేము వారికి చెయ్యవలసి[illegible] మర్యాద లన్నీ చేశాం. తరువాత మే మొకసారి [illegible]మ్మయిని చూడాలన్నారువారు. మా చెల్లిని తీ[illegible] కూర్చో బెట్టారు. పెళ్ళికొడుకు తండ్రి మా [illegible]ని సంగీతం నాట్యం మొదలైన వాటిలోగల ప్రావీణ్యం గురించి అడిగారు. తరువాత 'అమ్మాయీ' నీ వయస్సెంత?' అన్నారు. మా చెల్లి బుర్ర వంచుకొని 'దేనిలో వయస్సు కావలండీ!' అన్నది. అందుకు ఆయన ఆశ్చర్యపడి 'దేనిలో వయస్సేమిటమ్మా' అన్నారు. మా చెల్లి నా వయస్సు స్కూలు ఫైనలు రిజిష్టరులో అయితే పదహారండి. జనన మరణ లెక్కల ఆఫీసులో అయితే పది హేడండి. మొన్న ఉద్యోగానికి పెట్టిన అప్లికేషన్‌లో పద్దెనిమిదండి. కాని నా అసలు వయసు పది హేనండి' అంది. దాంతో వచ్చిన వాళ్ళందరూ గొల్లున నవ్వారు. వారితో బాటు మేం గూడా శ్రుతి కలిపాం.

ద్విభాష్యం రాజేశ్వరరావు ( యలమంచిలి )

★

**"శేఖర్ గారు! మీరు దయచేసి వెళ్ళిపోండి. ఇంకెప్పుడూ నాతో మాట్లాడడానికి ప్రయత్నించకండి" అని మైథిలి ఆవేశంతో అన్నది. ఎందుకో ఆమె కంత అలుక?**

సాయంకాలం నాలుగు—అయిదు గంట లప్పుడు స్నేహితురా లింటిదగ్గరనుండి వచ్చిన మైథిలి పంజరంలోని మైనా 'మధూ, మధక్కాయ్' అని పిలుస్తున్నా వినిపించుకోకుండా, విసురుగా సరాసరి తన రూంలోకి పోయి చేతిలోని వానిటీ బాగ్, ఫ్యాకెట్ బల్లమీద గిరవాటేసింది. డోర్‌వింగ్స్ 'ఘామ్మ'ని వేసేసుకుని 'దఘాలున' బెడ్‌మీద వాలిపోయింది.

పంజరంలోని మైనా హడలిపోయి ముడుచుకు కూర్చుని మౌనంగా కునుకుతీయసాగింది.

*          *          *

అరగంట గడిచింది. మంచంమీంచి లేచి 'రయ్' మంటూ తలుపులు తెరుచుకు బయట కెళ్ళింది మైథిలి.

"వీరాయ్ !" .... గట్టిగా కేకేసింది.

తోటలో మొక్కలకు గొప్పులు తవ్వుతూన్న వీరయ్య 'మబ్బులేవీలేకండా ఉరిమిందేం చెప్మా' అనుకున్నాడు ఆకాశంకేసి చూసి.

"వీరాయ్!" .... మళ్ళా ఉరిమింది.

వీరాయ్ ఈసారి అదిరిపడ్డాడు. 'అమ్మాయిగారా పిలుస్తున్నారు' అనుకుంటూ 'ఆఁ! ఆఁ! వస్తున్నా నమ్మా'....అంటూ చేతిలోని పలుగు క్రింద పడేసి మెట్లకేసి పరుగులీశాడు.

మైథిలి మెట్లమీద నుంచుంది. ఎప్పుడూ వసంతలక్ష్మిలా హాయిగా నవ్వుతూ కలకలలాడే అమ్మాయిగారు ఈవేళ అపరకాళికలా అగ్నిపిడుగులు వెదజల్లుతూండడం చూసి వీరయ్య తెల్లబోయాడు.

"ఇదిగో! వీరాయ్! ఆ శేఖరంగారు గాని నా కోసమని వచ్చి అడిగితే నేను లేనని చెప్పు తెలిసిందా"

ఆమెమాటలు విని వీరయ్య మరింత తెల్లబోయాడు.

"అమ్మాయిగారూ ! ఏంటండీ అంటున్నారు. మన శేఖరంబాబు! ఆరు వత్తే మీరు లేరని చెప్పమంటున్నారా" .... మనస్సులోని సంశయాన్ని వెళ్ళగక్కాడు వీరయ్య.

మైథిలికి చెడ్డ విసుకు వచ్చేసింది.

"అవునురా వీరాయ్ ! ఆయనగారే ! అలా అని చెప్పు నే నింట్లో ఉన్నానని నన్ను పిలిచావో నీ పని పడతా" .... అంది తీక్షణంగా.

బర్ మంటూ ఇంటిముందు కారాగింది. కార్లోంచి దిగుతూన్న తండ్రిగార్ని చూసి గతుక్కుమంది మైథిలి. ఇంటి కీవేళ ఆలస్యంగా వస్తానన్నారే! వాచి ఉబ్బిపోయున్న తన కళ్ళనీ, ఎర్రగా కందిపోయున్న మొహాన్ని చూశారంటే ఆయన వూరుకోరు. కారణం చెప్పమంటూ కూర్చుంటారు. మైథిలికి ఏం చేయాలో తోచలేదు. చటుక్కున లోపలకు పరుగెత్తి టవల్ తీసుకు బాత్‌రూంలోకి పరుగెత్తింది. పంజరంలోని మైనా "వచ్చారా బాబాయ్" అంటూ కికిచ లాడింది.

*          *          *

గడియారం టంగుటంగున ఆరుగంటలు కొట్టింది.

గార్డన్‌లో జాజిపందిరి ప్రక్కగా కుర్చీ వేసుకు కూర్చున్నారు. రోజూ ఆవేళకి అక్కడ కూర్చుని కూతురితో కబుర్లాడుతూ టీ త్రాగడం ఆయనకి అలవాటు. ఆయన కెదురుగా మరో కుర్చీలో మైథిలి కూర్చుని ఏదో పత్రిక తిరగవేస్తోంది. ఖాళీచేసిన టీ కప్పును బల్లమీద పెడుతూ ప్రకాశరావుగారు కూతురువంక చూశారు.

'అమ్మా! మధూ! ఒంట్లో బాగుండలేదా" అన్నారాయన చిటుక్కున. మైథిలి మొహాన్ని పుస్తకంమాటున దాచుకుంటూ ఏదో చెప్పబోయింది. అప్పుడే గేటు తెరుచుకు లోపలకు వస్తూన్న చంద్రశేఖరాన్ని చూసేసరికి ఆమెనోరు మూగవోయింది. గభాలున కుర్చీలోనుండి లేచి 'టీ' మరి కాస్త తెచ్చేదా నాన్నా' అంటూ తల వంచుకు లోపలకు గబగబా వెళ్ళిపోయింది.

> ఉపన్యాసకుడు : కాలాతీతమైనందుకు సభికులు మన్నించాలి. రిస్టువాచీ ఇంటిదగ్గఱ మరచిపోయాను. అందువల్ల టైము తెలియలేదు.
>
> సభికులలో ఒకరు : గడియారం లేదుసరే. గోడమీద కేలండరుందిగా!
>
> వి. శివరామయ్య (బాపట)

"ఓహో ! శేఖర్ ! రావోయ్ రా! ఈవేళ ఇంకా రాలేదేమా అనుకుంటున్నా. ఈ దినం సినిమా ప్రోగ్రాం ఉంది గాదూ" అంటూ వస్తూన్న యువకుని ఆహ్వానించారు. శేఖర్ ఆయనకు దగ్గరగా ఉన్న మరో కుర్చీలో కూర్చున్నాడు. కాని అతని మనస్సంతా తను వస్తూంటే లోపలకు 'రయ్' మంటూ వెళ్ళిపోయిన మధు మీదే ఉంది.

'అమ్మాయ్ ! శేఖరం వచ్చాడు. మరో రెండు కప్పులు టీ తీసుకురా"...కేకేశారు ప్రకాశరావుగారు. కాని మైథిలి రాలేదు. నిముసాలు గడిచాయి. ఈవాళ్టి ఆమె ప్రవర్తనలో ఏదో పెద్ద మార్పు కనిపించింది ఆయనకు. రోజూ శేఖరందర్శనం కోసం ఎదురుతెన్నులు చూస్తూ అతను రాగానే కలకలలాడుతూ ఎదురువెళ్ళే మధు అతను వస్తూంటే అంత నిర్లక్ష్యంగా ఎందుకు వెళ్ళిపోయిందో ఆయనకు అర్థంకాలేదు. శేఖరం సంగతి సరేసరి. ఉదాసీనంగా అటూ ఇటూ ఊగిసలాడుతున్న జాజి మొగ్గల వంక చూస్తూ కూర్చుండిపోయాడు. మరి కాస్సేపటికి వీరాయ్ రెండు కప్పుల టీ తెచ్చి టేబిల్‌మీద ఉంచాడు.

"ఇవ్వాళ 'సినిమాకు' పోదా మనుకున్నాం కదండీ మరచారా" అన్నాడు శేఖర్ ఉల్లాసంగా టీ తాగుతూ.

"అవునోయ్. జ్ఞాపకముంది. కాని నాకు రావటానికి తీరికలేదు బాబూ! కలక్టర్‌ని కలిసే పని తగిలింది. మధూ, నీవూ వెళ్ళండి, టైం అయిపోయింది. ఈవేళకి ప్రారంభం లయ్యేం టుందికూడా" అంటూ "మధూ" అని కేకేశారు ప్రకాశరావుగారు.

మైథిలి వచ్చింది. శేఖరం ఆమెవంక ఆత్రతగా చూశాడు.

"మధూ ! సినిమాకు పోదామా"...అన్నాడు చిరునవ్వుతో.

అతని ప్రశ్నకు జవాబీయకుండా మైథిలి తండ్రికేసి తిరిగింది.

'సినిమాకా! నాన్నా! ఈవేళ నాకెక్కడికీ వెళ్ళాలని లేదు"... అంటూ గిరుక్కున తిరిగి లోపలకు వెళ్ళిపోయింది.

శేఖర్ రాతిబొమ్మలా కూర్చుండిపోయాడు. ప్రకాశరావుగారికి పరిస్థితి ఏమీ అర్థంకాలేదు.

"పోనీలే! శేఖర్! మధు ఈవేళంతా అదోలా ఉంది. ఒంట్లో బావుండలేదేమో ! మంోసారి వెడదాం" అనా రాయన.

మధు ఎందుకో శేఖరం మీద అలిగింది. ఆలస్యం చేశాడని కాబోలు. పిచ్చిపిల్ల అనుకున్నాడాయన మనస్సులో. ఇంతకీ చంద్రశేఖర్ ఆయనకి కాబోయే అల్లుడు. మరో నెలలోనే పెళ్ళి కాబోతోంది.

'మరి నేను వెడతానోయ్ శేఖరం! భోజనానికి ఉంటావుగా. తొందరగా వచ్చేస్తా. మధు లోపల ఉంటుంది....చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళిపోయారు ప్రకాశరావుగారు. ఆయన వెళ్ళాక శేఖర్ కుర్చీలో కాస్సేపు అలానే కూర్చుండిపోయాడు. మధు ఎందుకో కోపంగా ఉంది. కాస్సేపు బతిమిలాడాలి కాబోలు. ఏం చేస్తున్నదో చూద్దాం. లేచి హుషారుగా లోపలకు వెళ్ళాడు. హాల్లో మైథిలి సోఫాలో పరధ్యానంగా ఏదో ఆలోచనగా కూర్చుంది. రేడియోలో 'పన్యాల' అతి గంభీరంగా తెలుగులో వార్తలు చెప్పుకుపోతున్నారు. కారు రావడం...నాన్న వెళ్ళడం — అంతా ఆమె వింటూనే ఉంది. శేఖర్‌కూడ ఆయనతో వెళ్ళిపోయుంటా డనుకుంది మధు.

"మధూ !" అని తీయగా ఎవరో పిలిచేసరికి అదిరిపడి చూసింది. ఎదురుగా శేఖర్ చిరునవ్వు నవ్వుతూ నిలుచున్నాడు.

'ఏం మధూ ! నామీద అలిగావు. సినిమా ప్రోగ్రాం అంతా పాడు చేశావుకదూ!" లాలనగా అన్నాడు.

మైథిలి సోఫామీంచి రుస్సుమ్మని లేచింది. కోపంతో—ఆవేశంతో ఆమె ముఖం మరింత ఎర్రగా కందిపోయింది.

‘శేఖర్‌గారూ! మీరు దయచేసి వెళ్లిపొండి. ఇంకెప్పుడూ నాతో మాట్లాడడానికి ప్రయత్నించకండి. నా కిష్టంలేదు. మీ రిక్కడికి కిక రాకుండా ఉంటే మంచిదనుకుంటా’’ అంది తీక్షణంగా.

శేఖర్‌కి ఆమె మాటలు అర్థంకాలేదు.

“మీ రంటూన్నది నాకేం అర్థం కావటంలేదు.”

“నాకంతా తెలుసు. ఇక మమ్మల్ని మీరు మభ్యపెట్టలేరు. వెళ్లిపొండి. ప్లీజ్!” ప్రక్క గదిలోకి వెళ్లిపోయి తలుపులు భడేలుమని వేసేసుకుంది.

అవమానంతోను, అభిమానంతోను శేఖర్ ముఖం కందగడ్డలా ఎర్రబడి పోయింది. కొన్ని క్షణాలపాటు అలానే నిలుచుని మైథిలి బాకు పోటుల్లాంటి మాటలు వాడిగా హృదయాన్ని తాకుతుండగా గిరుక్కున వెనక్కుతిరిగి బయటకు వెళ్లిపోయాడు. రేడియో తనదారిన తను ‘కాయంగల విన్నపాలను’ సాగించుకు పోతోంది. అంతా దూరాన్నుండి గమనించుతున్న వీరాయ్ నోరు నొక్కుకుంటూ నేలమీద కూర్చుండి పోయాడు.

మైథిలి పక్కమీద ఇటూ అటూ దొర్లుతూ మనస్సులోని ఆరాటాన్ని మరచిపోడానికి ప్రయత్నం చేస్తోంది. కాని ఆ బాధ తగ్గేసూచన లేపి కన్పించటం లేదామెకు. ఆదినం రెండుగంటలవరకు ప్రపంచంలో తనంత అదృష్టశాలిని లేదని మురిసిపోయింది. శేఖర్ తనపాలిట దైవమని, నోముల ఫలమని ఆశించింది. కాని, ఆ ఆశలన్నీ అడియాసలయినాయి. శేఖర్ వంచకుడు. తనని—నాన్నని మంచి మాటలతో వంచించాడు. అమాయక హృదయాలతో చెలగాటమాడుతున్న వగటివేషధారి. అసలు సంగతి వినోద వాళ్ళు తనకు చెప్పకుండావుంటే తను అతన్ని ఈవేళ షాపులో చూడకుండా వుంటే తన గతేమయ్యుండేది! వారం గినాల క్రితం వినోద చెప్పిన విషయం మైథిలి మస్తిష్కంలో ఒక్కసారి మెరిసింది. వినోద తనకి శేఖర్ విషయమే చెప్పింది. శేఖర్ వాళ్ళ కాలేజీలో లెక్చరర్. అతడు ఈమధ్య క్రొత్తగా వచ్చిన ఫిజిక్సు లెక్చరర్ ఇంటికి తరుచు వెడుతున్నాడని, అతని భార్యతో చాల చనువుగా తిరుగుతున్నాడని, సినిమాలు షాపింగులు—ఒకటేమిటి అలాంటివి చాల జరుగుతున్నాయని కాలేజీలో ఆడపిల్లలంతా గోలగా చెప్పుకుంటున్నారని వినోద చెప్పింది. అప్పుడు తనా విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. కాని ఈవేళ అనుకోని రీతిగా షాపింగుకి వెళ్లి, సిటీ ఎంపోరియంలోకి వెళ్తున్న శేఖరాన్ని మరో అందమైన, అమ్మాయిని కళ్లారా చూసింది. దుఃఖంతోనూ, రోషంతోనూ నిండిపోయిన మనస్సుతో ఇంటికి తిరిగి వచ్చింది.

.... పది గంటలు కొట్టింది గడియారం. మైథిలి మంచం దిగి కిటికీ చేరువగా నిలుచుంది... ఈ మోసాన్ని తను సహించలేదు. శేఖర్‌ని తను

వింతమాత్రం క్షమించలేదు. అలాంటి మలిన చరిత్రునికి తన హృదయంలో స్థానం ఇవ్వలేదు. స్థిరనిశ్చయంతో తండ్రిగారి గదిలోకి నడిచింది మైథిలి. గదిలో దీపం వెలుగుతోంది. ప్రకాశ రావుగారు చదువుకుంటున్నారు. కొన్ని క్షణాల వరకూ గుమ్మం దగ్గరే నిలుచుండిపోయింది. ఆమె నిలువెల్లా ముచ్చెమటలు పోస్తున్నాయి.

గుమ్మంలో అలికిడి విని ప్రకాశరావుగారు వెనక్కి తిరిగారు. గుమ్మంలో విషాదమూర్తిలా నిలుచున్న కూతుర్ని చూడగానే ఆయన హృదయం కంగారు పడింది.

'మధూ ! ఏం కావాలమ్మా ! ఇటురా'' అన్నారు.

మైథిలి తూరీగలా ముందుకు వాలి తండ్రి వొళ్లో తలదాచుకు వలవలా ఏడ్చింది. కుమార్తె దుఃఖాన్ని చూసిన ఆయన కళ్ళు చెమ్మగిలినయ్.

'మధూ ! ఎందుకమ్మా. నాకు చెప్పు తల్లీ. నీ కెవరు కష్టం కలిగించారు. ఎందుకీ దుఃఖం.

'నాన్నా! నాకు శేఖర్‌గారిని చేసికోవడం ఇష్టం లేదు నాన్నా. ఈ పెళ్లి నాకు ఇష్టంలేదు'' అంది మైథిలి.

ప్రకాశరావుగారు నిశ్చేష్టితులయిపోయారు.

'మధూ ! ఏమిటమ్మా ! చంద్రశేఖరబాబులో ఏం లోపముంది ? నీవు మనస్ఫూర్తిగా కోరుకున్న సంబంధమేగా.''

''కారణాలు చెప్పమని నన్నేమీ అడగకు నాన్నా. ఈ పెళ్లి నాకు ఇష్టంలేదు. నామీద నీకేమాత్రం ప్రేమ ఉన్నా—ఈ సంబంధం రద్దు చేయి. లేక పోతే చావు తప్ప నాకు......

'మధూ !' అన్న అరుపు మైథిలి మాటల్ని అడ్డేసినయ్.

అప్రయత్నంగా ప్రకాశరావుగారి కళ్ళు చెమ్మ గిల్లాయి. కూతురు మాటలు ఆయన హృదయా నికి రంపపుకోతలా ఉన్నాయి. ఒక్కగా నొక్క కుమార్తె. పసితనంలోనే తల్లిని గోల్పోయిన పిల్ల. తన ఆశలూ, ఆశయాలన్నీ కుమార్తెమీదే పెట్టుకు వచ్చాడాయన. అల్లారుముద్దుగా ప్రాణంలో ప్రాణంగా చూచుకు వచ్చారు. ఆ బిడ్డ కన్నీరు తను చూడలేడు. తనకున్న సర్వస్వమూ మధే! ప్రకాశరావుగారు నిట్టూర్చారు.

మనస్సులో చెలరేగుతున్న భావాలను పైకి కన్పించనీకుండా....

''సరేనమ్మా ! నీ ఇష్టప్రకారం జరిగిస్తాను. వెళ్ళు. పడుకో'' అంటూ తలనిమిరారు. మధు కళ్ళు తుడుచుకు లోపలకు వెళ్లిపోయింది. ఆమె వెళ్లినవంకే చూస్తూ ప్రకాశరావుగారు కూర్చుండిపోయారు. కూతురుభవిష్యత్తు ఏమి కానుందో అనే భయంతో ఆయన మనస్సంతా నిండిపోయింది. మనసావరించిన శేఖర్‌ను ఎందుకో నిరాకరించుతోంది. క్రుంగిపోతూంది. నిశ్చయ మైన పెళ్లి రద్దుచేస్తే తన మధుకిక జన్మలో పెళ్లికాదు. అలా అని బలవంతంగా ఆమె నీపెళ్లికి ఒప్పింపలేడు. ఆమె మాటలు విని తొందర పడి పెళ్లి ఆపుచేయించనూలేడు. నెమ్మదిగా, సావకాశంగా ఈ విషయాన్ని ఆలోచించాలి. శేఖర్‌ని కలుసుకొని ఏ సంగతీ తెలిసికోవాలనీ నిశ్చయించుకున్నా డాయన.

మర్నాడు ప్రకాశరావుగారు కోర్టునుండి సరా సరి శేఖరంరూముకు వెళ్లారు. అప్పుడే కాలేజి నుండి వచ్చి కాఫీ తీసుకుంటున్న శేఖర్ ఆయన్ని చూసి చెయిర్‌లోనుండి లేచాడు. శేఖర్‌ని చూడ్డంతోనే ప్రకాశరావుగారు .... 'బాబూ! ఒక్కమాట అడుగుతాను. ఏమీ అనుకోవు కదూ! ఈమధ్య నీవూ, మధూ ఏమన్నా మాటా, మాటా అనుకున్నారా!'' అనేసారు. శేఖర్‌ముఖం వివర్ణ మయిపోయింది. ఆయన అడిగిన ప్రశ్నకు .... చాలసేపటికి తేరుకుని జవాబిచ్చాడు.

''అలాంటిదేమీ జరగలేదండీ! కాని నిన్న మీరు వెళ్లినతర్వాత మైథిల్ని కలుసుకున్నాను. కఠి నంగా మాట్లాడింది. ఇక రావద్దంది. ఎప్పుడూ ఆమెతో మాట్లాడవద్దని హెచ్చరించింది'' అంటూ చెబుతూన్న శేఖర్ ముఖం అభిమానంతో, అవమానంతో ఎర్రబడిపోయింది. ప్రకాశరావుగారు నిట్టూర్చారు. శేఖర్ భుజంమీద చేయివేశా డాయన.

> మా వూరికి ఒక క్రొత్త సినిమా వచ్చింది. హాలువద్ద జనం కిక్కిరిసి వున్నారు. ఇంతలో ఒక బిచ్చగాడు 'క్యూ'లో నిలబడి వున్న నా దగ్గరకువచ్చి,
>
> "సినిమాకి ఒక అణాతక్కు-వయింది బాబయ్యా! నాకూ మీవలెనే క్రొత్త సినిమా చూడాలని ఎంతో ఆశగా వుంది బాబుగారూ! బాబ్బాబు! ఒక అణావుంటే ఇప్పించరూ!" అని అన్నాడు.
>
> అపుడు నేను ఆ బిచ్చగా డితో ఇలా అన్నాను.
>
> "ఒరేవ్! నీవుకూడా ఈ క్రొత్త సినిమా ఈవేళే చూడాల్రటా! రేపు చూడకూడదూ!
>
> నా మాటలకు వాడిచ్చిన సమాధాన మిది:
>
> "రేపటిదాకా నేనూ, ఈ సినిమా, వుంటామని నికరం ఏమిటి బాబయ్యా!"అన్నాడు.
>
> జోశ్యుల విశ్వమోహనరావు
> (గుంటూరు)

''నీవూ తొందరపడి ఏ నిర్ణయానికీ రాకు శేఖర్. మధు త్వరలోనే తన పొరపాటు తెలుసు కుంటుం దనుకుంటాను'' అన్నారు. శేఖర్ మాట్లాడలేదు. మరి కాస్సేపటికి ప్రకాశరావుగారు వెళ్లిపోయారు. ఆయన వెళ్లిపోయాక శేఖర్ చాలా సేపు ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు. ఇక ఈ గాయపడిన మనస్సుతో తను అవూళ్లో తలెత్తుకు తిరగలేడు. ఎంత త్వరగా ఈ ప్రాంతాల నుండి దూరంగా పోతే అంత మంచిది.

* * *

మర్నాడు — మూడుగంటలు కొట్టిందు గడియారం. మైథిలి కిటికీలోనుండి దూరాన విరాయ్ తోటలో మొక్కలకు గొప్పులు తవ్వు తూంటే చూస్తూ పరధ్యానంగా కూర్చుంది. ఎంత వద్దువద్దనుకున్నా 'శేఖర్' అనే మూ డక్షరాలు ఆమె మనస్సులో పదేపదే మార్మోగు తున్నాయి.

''అమ్మాయిగారూ'' .... ఎవరో పిలిచినట్లయి వెనక్కు తిరిగి చూచింది మధు. పన్నెండేళ్ల కుర్రాడు అంటించబడిన కవరు నందించి, 'అయ్య గారికి' అంటూ వెళ్లిపోయాడు. ఎడ్రసు చూసి మధు అది శేఖర్ రాసిన ఉత్తరమని గ్రహించింది. ఆ ఉత్తరాన్ని తండ్రిగారికి అందించకూడదు. చదవకుండానే చించివేయాలి— అనుకుంటూనే మనస్సులో ఏదో ఉత్కంఠ ఆరాటం ఎక్కువ కాగా...కవరు చించి అనుకోకుండా కాగితాన్ని బయ టకు లాగింది.

ప్రకాశరావుగారికి,

నేను ఈవేళే ఇంటికి వెళ్లిపోతున్నాను. బహుశా మళ్లా మీకు కనుపించను. ఇక ఈ ప్రాంతా లకు రావాలని లేదు. వెళ్లిపోయేముందు మీకు చెప్పకుండా వెళ్లిపోయేందుకు మనస్సు ఒప్పుకో లేదు. అందుకే ఈ చివరిసెలవు తీసుకుంటు న్నాను. నావలన మీకూ, మీ కుటుంబానికీ ఎలాంటి బాధ అయినా కలిగించితే క్షమించండి. నే నెక్క డున్నా మీకు ఆత్మీయుడనే. మిమ్మల్ని తలుచు కుంటూనే ఉంటాను. నా అవసరం మీ కెప్ప డయినా కావలసి వస్తే (బహుశా అలాంటి అవ కాశం రాదనుకుంటాను) ఈ వూళ్లోనే మా పెద్దనాన్నగా రమ్మాయి భర్త రాఘవరావు ఫిజిక్స్ లెక్చరర్‌గా ఉన్నాడు. అతని ద్వారా నా ఉనికి మీకు తెలియగలదు. ఇంతకాలమూ గడిపిన మీ సహ చర్యానికి ఎంతో కృతజ్ఞుడను.'' నమస్కారము లతో "శేఖర్."

మైథిలి ఉత్తరం సాంతంగా చదివింది. మళ్లా చదివింది. మళ్లా—మళ్లా—ఎన్నోమారులు చది వింది. చూస్తుండగానే ఆమె విశాలనేత్రాలు కన్నీ టితో నిండిపోయాయి. ''పెదనాన్నగా రమ్మాయి'' అన్న మాటలే మాటిమాటికి ఆమె కళ్లముందు కనిపించసాగింది. తాను తొందరపడిందా ! మధుకు ఏమిచేయాలో తోచలేదు. ఉత్తరం పట్టుకొని డ్రస్సైనా మార్చకుండా వినోద దగ్గరకు పరు గెత్తింది.

వినోద సోఫామీద అర్ధశయనంగా వాలి అర మోడ్పు కన్నులతో రేడియోలో తెలుగు సంగీతం వింటోంది. మధు ఆమె దగ్గరకు వెళ్ళేసరికి

# అలజడి

రేడియోలో 'ఇన్నర్ రిక్వెస్ట్' అంటూ ప్రశాంత సంగీతం ఆలాపిస్తున్నారు.

"వినూ! అక్క పిలుపు విని వినోద చటుక్కున లేచి రేడియోలో ట్యూన్ చేసింది. మధు ఉత్తరం ఆమె మీదికి విసిరి 'సన్మానం చేయమంటావో చెప్పు' అంది. వినోద గబగబా ఉత్తరం చదివేసి తెల్లబోతూ మధువంక కంగారుగా చూసింది.

'ఏమిటే మధూ ఇదంతా. ఏమన్నా పాడావుడి చేశావా ఏం. ఆ తర్వాత తెలిసింది నాకు ఆ ఫిజిక్సు లెక్చరర్ భార్య మీ శేఖర్‌గారి పెదనాన్న కూతురని. నీకు చెబుదా మనుకుంటూనే ఏం కొంప మునిగిందిలే అనుకుంటూ గడిపివేశా! ఏం జరిగిందే మధూ! అరె" .... ఆమె నోరు మూతబడింది.

మైథిలి కళ్లనుండి కన్నీటిబిందువులు అంతు లేకుండా ప్రవహించుతున్నాయి.

"ఏం చేశావా? మీ అందరి మాటలు విని ఆవేశంతో తొందరపడి ...." ఇక చెప్పలేక రెండు చేతులతో మొహాన్ని కప్పుకుంది మధు. వినోద మొహం చిన్నబోయింది.

'ఎంతపని చేశావు మధూ! ఏదో పెద్ద గొడవ చేసిఉంటావు. ఇప్పటికయినా మించిపోయింది లేదు. ఒక్కసారి అయన్ని సారీ అను. అప్పుడు నిన్ను వెదుక్కుంటూ వస్తాడు' అంది వినోద.

మైథిలి చటుక్కున లేచి కొంగుతో మొహాన్ని తుడుచుకొని గబగబా ఇంటికి వెళ్ళిపోయింది. ఉత్తరం పట్టుకొని ఆమెకూడా పరుగెత్తింది వినోద. గదిలో తలుపులు బిడాయించుకు బోర్లా పడుకున్న మైథిల్ని చూసేసరికి ఏం చేయాలో తోచలేదు, వినోదకు. మైథిలి ప్రశాంతకరమయిన మనస్సులో అసలు ఈ అలజడికి నాంది కలిగిం

(45-వ పేజీ చూడండి)







# గాజులు

'గాజులమ్మా గాజులు కన్నె పిల్లల మోజులు' కార్తవరాయుని కథలోని గాజులమ్మిపాట ఆడవాళ్ళ నోట మహా ప్రచారానికొచ్చింది గాజులంటే కన్నె పిల్లలకే మాత్రమేగాక, చిన్న పిల్లల దగ్గర నుంచి పండుముత్తయిదువల వరకు మహా మోజు అసలు గాజులు ధరించటం ఆడవారి లక్షణం, అందులోనూ సౌభాగ్యవతుల చిహ్నం

మన స్త్రీజాతికి నగలంటే తగని ప్రీతి అందుకే శరీరమంతటా రక రకాల ఆభరణాలు అలంకరించుకుని చిలకల్లా ముస్తాబవుతారు ముఖ్యంగా చేతికి గాజులు వేసుకొని వాటి అరుదు ఫాషనుకోసం కొంతమంది ఈ తప్పనిసరి అలంకారాలు సహితం తీసిపారేసి సన్యాసినుల్లా బోసిగా తయారవుతుంటారు అలాంటి పడతులు మోటుగా మగరాయుళ్ళలా కనపడతారేతప్ప మరోవిధంగా కంటికానరు

డబ్బున్నవాళ్ళు బంగారపుగాజులతో చేతులు సింగారించుకుంటే, లేనివాళ్ళు చవకలో వచ్చే మట్టిగాజులతోనే సరిపెట్టుకుంటారు బంగారపు గాజుల్లో సన్నపాటి జతలు, వెడల్పాటివి, వంకీలు, రాళ్ళగాజులు రక రకాలవి ధరించి మోజు తీర్చుకో వచ్చు ఆకారాలనుబట్టి వాటికి మిరియం గాజులు, రేడియో గాజులు, చెక్కుడు గాజులు, బ్రిడ్జి గాజులు ఇలా సవాలక్ష పేర్లు నాజూగ్గా కళ వుట్టిపడే డిజైన్లతో తళుకులీనే ఆ గాజులంటే మనకు మోజు వుండటంలో సుంతైనా వింతలేదు కొన్నాళ్ళ క్రితం వెడల్పాటి గాజులు వేసుకోవటం ఫాషనుగా వుండేది మళ్ళా ఇప్పుడు సన్నటి గాజులే రాజ్యం ఏలుతున్నట్లు తోస్తున్నది వంకీల గాజులు, వంకీల జాట్లలా అంద చందాలతో అందరినీ ఆకర్షిస్తుంటాయి చేతులు ముడిచి ఎక్కించుకోనవసరం లేకుండా సీలత్రిప్పి పెట్టుకునే గాజులు సొగసుగా వుంటాయి రాళ్ళ గాజుల అందం కళ్ళతో చూడాల్సిందేతప్ప నోటితో చెప్పలేం కాస్త ఖరీదు ఎక్కువే అయినా, ధగధగలాడుతూ మిరుమిట్లు గొల్పుతూ వుంటాయి

రాజులా సింహాసనమెక్కి అందకుండా కూర్చునే బంగారం జోలికి వెళ్ళలేనివారు వెండిగాజులు తొడుక్కొని ముచ్చట తీర్చుకుంటారు అందులోనూ రంగురంగుల ఎనామిల్ గాజులు అందాలు విరజిమ్ముతాయి వాటినీ పెట్టుకోలేని వారికి, గిల్టుగాజులు చక్కగా మోజు తీరుస్తాయి

ఇకపోతే, మట్టిగాజులు అందరికీ అందుబాటులో వున్న గాజులు అటు డబ్బున్నవారు, ఇటు లేనివారు మట్టిగాజులంటే మనసు పడతారు నిజానికి ఆ గాజులు తమాషాగా మెరుస్తూ, ముచ్చట గొల్పుతూ వుంటాయి రంగురంగుల మట్టి గాజులకున్న వంపుసొంపులు బంగారపు గాజుల్లో కనపడతాయా? మట్టిగాజుల్లో, సాదావి, వంకీలు, సన్నపాటివి, వెడల్పాటివి, చారలవి, రకరకాల డిజైన్లవి, చెప్పతరం కాదన్న! అవికాక, రబ్బరు గాజులు, ప్లాస్టిక్ గాజులు, ముత్యాల గాజులు, అద్దాల గాజులు, సింగారి గాజులు, చెమ్కీ గాజులు మనల్ని మరింత మురిపిస్తుంటాయి మట్టిగాజులు, సింగారి గాజులు కాస్త దెబ్బ తగిలితే చాలు పగిలి పూరుకుంటాయి మిగతావాటితో ఆ గొడవ వుండదు ఎంతో మోటుగా వాడితేతప్ప అవి చిట్లనన్నా చిట్లవు [illegible] క్రైలాన్ గాజులే. అవి కూడా బాగా మెరుస్తాయి.

తెల్లనివారు నల్లని గాజులు వేసుకుంటే అందంగా వుంటారు నల్లనివారికి లేతరకటి గాజులు నప్పుతాయంటారు రెండు చేతులనిండా ప[illegible]రంగా ఎక్కించుకోకుండా ఈ చేతికో రెం[illegible] ఆచేతికోరెండు వేసుకుంటే కంటి[illegible] వుంటుంది మరీ తక్కువనిపిస్తే చేతికి మరో రెండు వేసుకున్నా ఫర్వాలేదు. రెండుచేతికి వాటి

ఎప్పుడూ ఇంతే... 87

శంకర్



## గాజులు

పెట్టుకునేవారైతే ఒక చేతికే గాజుల ముప్పట రకరకాల గాజులు కొనుక్కుని వేటిమధ్య వేటిని వేసుకోవాలా అని తికమక పడుతుంటాం ఆ అవస్థ కనిపెట్టి, 'సెట్టు' గాజులు ప్రత్యక్షమయ్యాయి అవి సెట్టులా వేసుకోవాల్సిందేతప్ప విడదీయటానికి వీల్లేదు

గాజులు తయారుచేసేవాళ్ళు ఎప్పటికప్పుడు క్రొత్తరకాలు తయారుచేసి ఆడవాళ్ళను మెప్పించటానికి పాటు పడతారు. గాజులమీద అక్షరాలు చెక్కితే అదో గమ్మత్తుగా వుంటుంది ఏడుకొండలవాడిని చూద్దామని తిరుపతికి వెళ్ళినవాళ్ళంతా 'పద్మావతి'గాజులు చేతులకు తగిలించుకోకుండా రారు సరే 'లవ్' 'పతివ్రత' (నేను చూసినవి అవే లెండి) ఇలాంటి మాటలన్నీ ఇంగ్లీషు, హిందీ, తెలుగు, రకరకాల భాషల్లో గాజులమీద చెక్కించేసరికి మోజు ఎక్కువై విరగబడి కొనుక్కుంటారు ఆడవాళ్ళు చెమ్కీగాజులు తళుకు బెళుకులతో మనస్సును హరిస్తాయి ముత్యాలగాజులు తెల్లగా మెరుస్తూ వుంటాయి అద్దాలగాజులు తళుకులీనుతూ వుంటాయి ఈ గాజులు పగిలిపోకపోయినా వాటితో మరోక బెడద వుంది కొన్నిరోజుల య్యేసరికి మాసిపోయి కళాకాంతులు తగ్గుతాయి చెమ్కీ గాజులపైని చెమ్కీ వూడిపోతుంది ముత్యాలు నల్లబడిపోతాయి దాంతో మూలపడెయ్యాలేతప్ప మరెందుకూ పనికిరావు అందుకని వాటిని అపురూపంగా అప్పుడప్పుడు వాడుకోవాలి అదీగాక రబ్బరు, ప్లాస్టిక్ గాజులతో వంటదగ్గరకెళ్తే చుర్రున అంటుకుంటాయి ఆగాజులు కాలి ప్రమాదాలు సంభవించిన సంఘటనలు కూడా లేకపోలేదు

చవక గాజుల్లో కూడా కొద్దిగా ఖరీదైనవి లేకపోలేదు మెటల్ గాజుల్లో రాళ్ళు వేసినవి ఒక్కొక్కటి పదిరూపాయలు కూడా వుంటాయి అయితే, ఇవి ఒక చేతికిమాత్రమే వేసుకుంటారు

ఆడపిల్ల పుట్టిన వెంటనే ఆ చిట్టి చేతులకు గాజులు తొడగాలనుకుంటుంది తల్లి, అదే మగవాడైతే, ముచ్చటకైనా గాజులు వేయకూడదు వేస్తే నభా పిరికి అవుతాడని బెదిరిస్తారు సరదా కొద్దీ ఏవో మురుగుల్లాంటివి పెట్టుకోక ఊరుకోరులెండి

పొదుపుకు పెట్టిందిపేరు ఆడవారు పైగా వారిది కళాహృదయం అందుకే పగిలిపోయిన గాజు ముక్కలను నిప్పుదగ్గరపెట్టి ఒక దానిలో మరొకటి దూర్చి గొలుసు తయారు చేస్తారు పూర్తిగా పగిలిపోకుండా, చిట్లి, గాజు ఆకారంలోనేవున్న మట్టిగాజులను రిబ్బను మధ్యలో వరుసాగ్గా దూర్చి అందమైన గార్లెండ్ చేసుకోవచ్చు

ఆడవాళ్ళకు సీమంతం చేసేటప్పుడు గాజులు తొడగటం లాంచనం లాంఛనం పేరుతో వారి గాజుల వాంఛ ఆనాడు బాగా తీరుతుంది సాధారణంగా వితంతువులు గాజులు వేసుకోరు కాని వాళ్ళల్లో కూడా కొంతమంది ఒకటో, రెండో గాజులుకాని మురుగులుకాని వేసుకునేవాళ్ళు కనపడుతూనే వుంటారు

అందాన్ని ఆర్పించటం ఆడవారికి చేతనైనంత మగవారికి చేతకాదేమో! పూర్వం రాజులు ఆడవాళ్ళతో సమానంగా లోలక్కులు, గాజుల దగ్గరనుంచి వడ్డాణాలవరకు (కాకపోతే వాటికి మరో పేర్లు వున్నాయనుకోండి) అన్నీ ధరించేవారు వారి మాటలావుంచినా, పండితులు, హరిదాసులు మొదలైనవారి చేతికి సింహతలాటాలు తొడిగి సత్కరించటం వున్నదే పల్లెటూరి మగవాళ్ళు ఇప్పటికీ వెడల్పాటి మురుగులు వేసుకుంటూనే వుంటారు

గాజులు తొడుక్కోవటం పిరికితనానికి చిహ్నమన్నట్టు మగవారు మనస్సైనూటికి పాటికి మాట అంటూ వుంటారు 'ఆడదానిలా గాజులు తొడుక్కుని కూర్చో' అంటూ వారు లోకువైనవాడిని గేలిచేస్తూండటం పరిపాటి గేలిచేస్తున్నవారు వాటిజోలికి రాకుండా పోయారా, ఈ మధ్య వారి స్నేహితులు మంచి మంచి గాజుల డిజైన్లతో చెక్కించుకుని చేతులమీద కెక్కించుకుంటున్నారు. గాజులంటే మనకున్న మోజును మనం ఎన్నడూ దాచుకోలేదు మగవాళ్ళే ఆ మోజు ఎలా తీర్చుకోవాలా అంటూ తటపటాయించి బైటపడకుండా ఈ పన్నాగం పన్నారు ఎవరండీ పిరికివారు ?

గాజుల షాపులు, ఇంటికివచ్చే గాజుల ఒళ్ళు మనకు కావల్సినన్ని అందమైన గాజులు అందిస్తుంటాయి అవిగాక, ఇంటింటికి వచ్చే గాజుల బేహారిని మర్చిపోగలమా ? గాజుల బేహారికోసం ఆంధ్రవనిత ప్రతినిత్యం కళ్ళు పెద్దవిచేసుకుని చూస్తూనే వుంటుంది గాజుల గలగల ఆమె అందాన్ని ఇనుమడింపచేస్తుంది బస్సులో కండక్టరుచేయి తగులకుండా జాగ్రత్తపడతాంగాని చేతులు నొక్కే గాజుల బేహారికి మనంతట మనమే చేతులందిస్తాం ఆడవాళ్ళుకూడా గాజుల మలారాలతో వస్తూండటం లేకపోలేదుకాని బహు అరుదు.

గాజులంటే ఎంత మోజున్నా, దానికోసం విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టడం తగదు నాకు తెలిసిన ఒకావిడ చూసినదల్లా కొనుక్కుని గాజులవాడి నడిగి మలారాలు తెచ్చుకుని అందులో ఎక్కించటం మొదలుపెట్టింది నిమిషానికోసారి అవి వూడదీసి ఇవి, ఇవి వూడదీసి అవి వేసుకుంటుంది. అయినా ఇప్పటికీ ఆవిడ మోజు తీరలేదంటే నాకు ఆశ్చర్యంగా వుంటుంది

ఈ గాజులన్నీ ఒకెత్తు, కేసరి 'స్వర్ణ కంకణం' మరొకెత్తు ఆ కంకణం సాటి మరేదీ లేదు ఆ గాజు ధరించాలనే మోజు ప్రతి ఆంధ్ర వనితకు వుండాలి ఆ రోజుకు మనలో ప్రతి ఒక్కరు ఎదురు తెన్నులు చూడాలి ★

# శిరోజాలంకరణ



1. దీన్ని రింగు ఉపయోగించి వేసుకోవాలి. జుట్టును రింగులో దూర్చి, మెలిపెట్టి చుట్టూరా చుట్టుకు రావాలి.

మిగిలిన జుట్టును మెలిదిప్పి ఈ గుండ్రం చుట్టూ చుట్టి పిన్నులు దూర్చాలి. మధ్యభాగం ఎత్తుగా రావాలంటే, రింగు చుట్టూరా జుట్టును కనీసం రెండుసార్లయినా చుట్టాలి.

2. జారు ముడి వేసుకొనే విధంగా జుట్టును చేతిమీదుగా వేసుకొని ఆ గుండ్రంలోనుంచి చివరి కొనను ఇవతలకు లాగాలి. ఆ వచ్చిన ముడిలో ఒక ప్రక్కన ఉన్న జుట్టును మధ్యగా వచ్చేట్టు అణచాలి. తర్వాత మిగతా జుట్టును మామూలుగా మెలిదిప్పి రెండు వరుసలు చుట్టాలి.

3. మొదటి శిరోజాలంకరణలోని ప్రథమ భాగమే ఈ సిగ. దీనిమీద నెట్ వేసుకుంటే అందంగా ఉంటుంది. నెట్ మధ్యలో చెమ్కి బిళ్ళల పువ్వు ఉంటే ఇంకా బాగుంటుంది. కాక పోయినా రింగు లోపలి ఖాళీలో క్యాప్సిపువ్వు లేమైనా పెట్టుకుంటే అదో ఫాషనుగా ఉంటుంది.

★



బొమ్మలు:
దేవిక







కళ్ళు తిరిగినట్టయినయి. గుండె గభాలునకొట్టుకుంది, ఆ మాటవినేటప్పటికి—అంత హఠాత్తుగా. ఎంత కోపంగా అన్నాడామాట !

వాకిట్లో కిటికీ తలుపులు రపాలున మూసుకున్నాయి బయట చిన్నగా, గాలి సాగింది.

లక్ష్మీదేవిగారికి కొంచం కోపం కూడ వచ్చింది. నిన్నమట్టుకు నిన్నా ఇల్లాగే. తనేమంత తగనిమాట అన్నది గనుకను? నిన్నటి విషయాలు తలపు కొచ్చాయి. "పెద్దన్న మనకుక్క టైగరు గడ్డిమేటుఎక్కి దక్షిణపు వేపుగా తిరిగి అదేపనిగా ఏడ్చిందిరా. ఆవేపునించి వరద వచ్చేట్టుగా వుంది. గోనలేరు పొంగుతుందేమో. మనది అసలే పాత ఇల్లు. భయంగా ఉందిరా" అన్నది లక్ష్మీదేవిగారు. దానికి, వెంటనే "ఆ పిచ్చి కబుర్లన్నీ నా దగ్గర తీసెయ్యమ్మా. టైగరుకి పాలుపోసావా, లేదా? సాయంత్రం కావస్తోంది. షికారుకి తీసికెళ్ళాలి" అన్నాడు. ప్రసాదరావు. "ధర్మరాజుకి మల్లే ఆ కుక్క ఒకటేనీకు, వెంట ఎప్పుడు చూచినా, ఎక్కడి కెళ్ళినాసరే. సావకాశంగా మాట్లాడడానికి వీల్లేదు" అందిఆవిడ మామూలు ధోరణిలో. దాని కతను "మనుష్యులకంటే ఈ కుక్కే నన్ను బాగా అర్థం చేసుకుందనుకుంటాను" అన్నాడు, నోరు జారి. వెంటనే బాధ కలిగింది. మనస్సులో. ఆమాటఎవ్వరినన్నట్టూ? ఒకరిని ఉద్దేశించి అన్నమాటకాదది. అయినా అమ్మనే అన్నట్టుగాలేదూ? ఎంత తొందరపడ్డాను. అయ్యోయ్యో అనుకున్నాడు. తనమీద తనకి పట్టలేనంత కోపం వచ్చింది. కనుబొమ్మలు చిట్లించాడు. చటాలునలేచి గుమ్మంలోనించి వెళ్ళిపోయాడు. లక్ష్మీదేవిగారు నిర్ఘాంతపోయారు. అతని మనోబాధ లేమీ ఆ తల్లికి అర్థంకాలేదు.

గుమ్మం దిగగానే ప్రసాదరావుకి మనస్సునిర్మలమైంది. అమ్మని ఎంత బాధ పెట్టానా అనిపశ్చాత్తాప పడ్డాడు.

రాత్రిపడ్డతరువాత టైగరుముందూ, అతనువెనుకా ఇల్లు చేరారు. అల్లా వెళ్ళింది ఎందుకో, తిరిగి వచ్చింది ఎందుకోలక్ష్మీదేవిగారికి తెలియలేదు. అది నిన్న సాయంత్రం వరుస.

ఈ వేళకి ఈవేళ ఇల్లా. అయినా ఇంత విడ్డూరంగా ఇదివరకు ఎప్పుడు జరిగింది?

మొన్నమా అంతే. ఆనాడూ అల్లాగే అనవసరంగా కోపం తెచ్చుకున్నాడు. "ఉద్యోగం వెతుక్కోటానికి వెళ్ళాలమ్మా. ఉద్యోగం దొరకగానేనిన్ను తీసుకెళతాను" అన్నాడు, ప్రసాదం. దానికి, ఉద్యోగానికి ఏం తొందరరా. నేను ఒంటరిగా ఎల్లా వుండను? ఏదో ఒక ఇంటి వాడవయితే



# అసుర సంధ్య

కల్యాణ సుందరీ జగన్నాథ్

గాలి విసురికి తలుపులన్నీ కొట్టుకుంటున్నాయి. కాని తలుపులు మూయ బుద్ధికాలేదు లక్ష్మీదేవమ్మగారికి. తన బిడ్డ ఎక్కడో వస్తుంటే తన కెందుకీ భద్రత. ఆరోజు మధ్యాహ్నం....

నీ బాటికి నీవు ఎక్కడ తిరిగి వచ్చినా, నాకు ఇంట్లో తోడువుంటుంది.గదా!" అన్నది లక్ష్మీదేవిగారు. "నీకేమీ అర్థంకావటం లేదమ్మా" అన్నాడు విసుగ్గా. ఇందులో ఏముంది అసలు అర్థం కాకపోవడానికి. ఈమధ్య గ్రామానికి తిరిగి వచ్చినతరువాత విసుకు, కోపం ఎక్కువ అయినాయి వాడికి. ఏంచెప్పమా? లక్ష్మీదేవిగారు ఆలోచిస్తూనే ఉన్నారు.

కాని ఈవేళ అల్లాగాదే! అంతటితో తెమల లేదు విషయం. అతని ముఖం అంత బాధగా కోపంగా ఎప్పుడూలేదు. కనీసం అల్లా ఆవిడ ఎన్నడూ చూడలేదు. మనిషి అదోకమాదిరిగా అయిపోయాడు—పిచ్చివాడిలా. ఆ కళ్ళు బిత్తరిచూపులు! ఆ చేతులు వణకడం! "ఇక తిరిగిరాను" అని అంత ఖచ్చితంగా ఇదివరకు ఎప్పుడూ అనలేదే. ఎన్ని ఆశలు పెట్టుకుంది కొడుకుమీద! చదువుకుని వృద్ధిలోకివచ్చి, గొప్ప ఉద్యోగి అవుతాడని! వృద్ధాప్యంలో తనకి తోడుగా, నీడగా వుంటాడని! ఎన్ని కలలు కన్నది!

మనస్సులో ఆలోచనలు పొంగుకొచ్చినాయి. నా ఆశలు భగ్నమైతేపోనీ, వాడు సుఖపడితే చాలుగదా! నేను ఇన్ని సంవత్సరాలూ వాడి సుఖంకోసంకదూ పడిన యాతనఅంతా. పసుపు కుంకుమపోయిన తరువాత, వాడి ఒక్కడి ముఖంచూచి గుండె ఎంత నిబ్బరం చేసుకున్నాను! నా ఆశలూ, వాడి సుఖమూ అన్నీ, గంగలో కలిపాడు. అమ్మని వదిలేవాడుకాడే "అమ్మ, అమ్మ" అంటూ పలవరించేవాడు. ఇప్పుడింత నిర్లక్ష్యంచూపి వెళ్ళిపోయాడు! అమ్మ మీద అపేక్ష తగ్గిందా? లక్ష్మీదేవిగారికి ఆలోచనలు ఇంకా బరువెక్కినాయి.

వెనక, ఒకసారి, తన తమ్ముడు ఆదిశేషయ్యగారి ఇంట్లోనించీ ప్రసాదం దెబ్బలాడి వచ్చేసిన రోజు మాట! తండ్రి పోయాక, కొన్నాళ్ళు మావద్ద వుండనిమ్మని, మేనల్లుణ్ణి తీసుకెళ్ళారు, ఆదిశేషయ్యగారు. అక్కడ అడ్డమైన చాకిరీ చేయించారు. అష్టకష్టాలు పెట్టారు. జరిగినవన్నీ అమ్మకి తెలియనివ్వలేదు, ప్రసాదం. అసలే స్వయంపాకం. మితభాషిన్నీ మేనమామకూతురు దుర్గ చాలా ఎగతాళి చేసేది. ఒకసారి వాళ్ళ ఇరుగింటి ఇల్లాలు మేనత్తతో "మేనల్లుడికి, మీ అమ్మాయినిచ్చి పెళ్ళి చేసి ఇల్లరికం పెడతారా? చాలా బాగుంటుందమ్మా. మీకూ ఒక్కతే సంతాయిరి" అంటే "ఆ! అందగా అందగా ఈ దిక్కుమాలిన సంబంధమే అందాలా? వీళ్ళనాన్న, మా మామగారి నోర్లు కొట్టి మా ఆస్తంతా కట్నాలూ, కానుకలూ అందేడుగదా. ఏంకట్టుకుపోయాడేం? మా నెత్తిని వీళ్ళనిబడేసి మరీ వెళ్ళాడు" అంది ఈసడింపుగా. ప్రసాదం విన్నాడు. తరువాత ఒకనాడు "పొలంలోకి వెళ్ళిరావాలిరా" అన్నారు శేషయ్యగారు. "అల్లాగే మామయ్యా. ఆకలేస్తోంది. భోంచేసి వెళతాను" అన్నాడు ప్రసాదం. "ఒళ్ళు కరగనివ్వవేమిరా?" అన్నారాయన. "భోజనానికి ఏమీ లోటు లేదు" అంది ఆవిడ. ఇల్లాదినదినగండంగా అల్పమైన మాటలతో కాలం వెళ్ళబుచ్చుతూ వచ్చాడు ప్రసాదం. ఒకనాడు తాను భోం చేస్తూ, నెయ్యి గడుకి




ఒక ముద్ద కలిపి తన కంచం ప్రక్కగా పెట్టాడు. మేనత్తగారు చూచి తోక త్రొక్కిన త్రాచులా చరచర దగ్గర కొచ్చింది. "ఏమిట్రా ఇది. తల దూరకంతలేదు—మెడకొక డోలు అని, ఈ కుక్క ఒకటా, పైగా దండగ!" అని కసిరింది. ప్రసాదానికి కడుపు దేవినట్టయింది. కళ్ళనిండా నీళ్ళు క్రమ్మినయి. వెంటనే కంచం దగ్గర నించీ లేచాడు. "మళ్ళీ నా జన్మలో మీగడప త్రొక్కను లేఅమ్మా" అన్నాడు. గంపెడు ఆకలితో సరసరా తన ఇంటికి బయలు దేరాడు. టైగరుకి, ఏదీ సరిగ్గా అర్థం కాలేదు. అయినా, తినే ముద్ద వదిలి, చెవులు ఆడించుకుంటూ కూడా వచ్చేసింది.

మండు టెండలు. దారిలో నీడైనాలేదు. ఒక్కొక్కచోట మంచినీళ్ళులేవు దాహానికి. కాళ్ళు బొబ్బ లెక్కేటట్టూ తిండి తిర్థాలూ లేకుండా నడిచాడు. సగందూరం వచ్చేటప్పటికి ప్రక్క పల్లెటూరులో చెరువులో నల్లకలువలున్నాయని గుర్తొచ్చింది. అమ్మకి నల్ల కలువలు ఎంతో ఇష్టం. బాలకృష్ణుడు ఇదే నీలంరంగునే ఉండేవాడేమో అని కూడా అంటూ వుండేది. అవి చూస్తే అమ్మ మనస్సు ఎంత పొంగుతుందో! దారి పెడద్రొక్కాడు. చెరువులో ఈది పువ్వులుకోసి కలువ ఆకులో పెట్టి పై తువ్వాలులో మూటకట్టి అమ్మకి తెచ్చి ఇచ్చాడు. ఆ కొడుకేనా వీడు? ఈనాడు అమ్మని వదలి వెళ్ళిపోయాడే!

లక్ష్మీదేవిగారులేచి బయట కొచ్చారు. ప్రొద్దు బాగా వాటాలి పోతూంది. ఆకాశంమీద నల్లని మబ్బు పట్టింది. మబ్బు క్రిందగా ఓ ప్రక్కన నీటి పక్షులు, నిమ్మళంగా,గుంపుగా, చక్రాకారంగా ఎగురుతున్నాయి. ఇంకో ప్రక్కన ఇంకా క్రిందిగా, తూరీగలు గుంపులు గుంపులుగా ఎగురుతూ, ఆడుతున్నాయి. "టైగరు" టైగర్ అని గట్టిగా పిల్చింది. ఊహూఁ! ఎక్కడా కని చూపు మేర టైగరులేదు. వాడు చాలా విసురుగా వెళ్ళిపోయాడు. టైగరు ఎప్పటిలా వాడికూడానే వెళ్ళిపోయి ఉంటుంది.

లక్ష్మీదేవిగారికి కడుపులో ఏమో తిరిగినట్టయింది. మానసికబాధ భౌతికంగా కూడా ఉన్నట్టనిపించింది. వీధి అరుగుమీద కూలబడ్డది. దుఃఖము పొర్లుకొచ్చింది. చిన్నతనంలో వాడు చేసిన చేష్టలన్నీ జ్ఞాపకమొచ్చాయి.

ఒకసారి తండ్రి పోయిన క్రొత్తరోజుల్లో అది మేనమామగారి ఇంట్లోనించి కొడుకూ, తల్లీ తిరిగి వస్తున్నారు—వాళ్ళ ఇంటికి.ఆదిశేషయ్యగారి గేద దూడకి జబ్బు చేసింది. బ్రతకనిజబ్బే. బ్రతకదని అందరూ నిశ్చయించారు కూడాను. ప్రాణంపోక ముందే, వాళ్ళ చెప్పులుకుట్టే వెంకణ్ణి పిల్చి తీసి కెళ్ళిపొమ్మన్నారు, దూడని" దూడ ఇంకా కొన ఊపిరితో ఉందయ్యా" అన్నాడు ప్రసాదం కోపం మింగుతూ. "ఉంటేఏం, ఆ ప్రాణం వాడి దగ్గర యినా పోతుందిగా" అన్నాడాయన నిర్లక్ష్యంగా. ఇంకా చొక్క తెగవేస్తున్న దూడని కదిపి తీసు కెళ్తుంటే, ప్రసాదం నిలవలేకపోయాడు. తల్లిని ప్రయాణం కట్టించాడు స్వగ్రామానికి. కాని ఈ జరిగిన దంతా లక్ష్మీదేవిగారికి తెలియనివ్వలేదు, కొడుకు—తెలిస్తే ఆ జాలిగుండె బాధపడుతుందని. అసలు ఆ మాటకొస్తే, తన తమ్ముడు ఏమన్నా అన్నా లక్ష్మీదేవిగారు వెంటనే మరిచిపోయేవారు. ఆవిడ స్వభావం అది. ఇంతకీ వీళ్ళు బయలుదేరేటప్పుడు ఎవ్వరూ వెంట రామాలేదు. కనీసం వాళ్ళపాలేరునైనా కూడా పంపలేదు. కాలి నడకనే పోదామన్నాడు ప్రసాదం. ఏమిటో కీచులాట జరిగిందిగదా మామగారితో. అందుకని ఆవిడ సరే అంది. అప్పటికి ప్రసాదం చిన్నవాడు — చాలా ఊరు దగ్గరగా వచ్చేటప్పటికి పాలకోడు దాటవలసి వచ్చింది. అది పంట కాలువ. ఒక జానెడులోతు కూడా సరిగ్గాలేదు, నీళ్ళు, ప్రశాంతి, నీటిక్రింద గులకరాళ్ళు, ఇసక. చిన్న పిల్లలు సహితం నీళ్ళల్లో నడిచిపోతారు— బోదె కడ్డంబడి. ఆ పిల్ల కాలువ దగ్గరికి రాంగానే లక్ష్మీదేవిగార్కి ఒళ్ళంతా వణకిపోయింది—భయంతో. నీటికేసి తేరి చూసి కళ్ళు రెండూ గట్టిగా రెండు చేతులతో మూసేసుకుంది. నీళ్ళలోమాత్రం ప్రాణంపోయినా అడుగు పెట్టనంది. ప్రసాదం గాభరా పడ్డాడు. ఒంటరిగాడు—పైగా చిన్నతనం తల్లి, భయంచూచి జాలి పడ్డాడు. "ఏమిటమ్మా" అన్నాడు. "అమ్మో! ఎంత లోతుఉందో చూడరా. మునిగిపోతాం. నీలంగా ఎంత లోతు భయంగా వుందిరా" అంది. ప్రసాదం చూచాడు. పైని ఉన్న అనంత ఆకాశం, మబ్బులతో సహా ఆ జానెడు లోతు నీళ్ళలోనూ అగాధంగా ప్రతిబింబిస్తోంది. ప్రసాదానికి నవ్వాలో ఏడవాలో తెలియలేదు. కాని అమ్మని దాటించాలిగదా! ఇదివరకెన్నడూలేని బాధ్యత వచ్చింది. ధైర్యం చేసుకుని అమ్మ చెయ్యి పట్టుకుని నీళ్ళల్లోనించి నడిపించాడు. కాలువ దాటిన తరువాత ఆవిడ కళ్ళు తెరిచింది. ప్రసాదం, "అమ్మా" అన్నాడు గొంతు వణుకుతూ. "ఇక నేను లేకుండా, ఎప్పుడూ ఇల్లు బయలుదేరకు" అన్నాడు బాధ్యతాయుక్తంగా.

అటువంటి చిన్ని తండ్రికి ఈవేళ ఇంత కోపం ఎట్లా వచ్చిందో తల్లికి అర్థం కాలేదు. మేనమామ విషయంత ప్పేముంది ? అసలు మేనమామ మాట ఎప్పుడెత్తినా పసివాడికి కోపమేగదా! ఆ మాటకొస్తే కారణాలులేక పోనూ లేదు. ఒక్కొక్కటే లక్ష్మీదేవిగారికి జ్ఞాపకం వచ్చాయి. వాళ్ళ నాన్నగారుపోయిన సరిక్రొత్త రోజుల్లో పుట్టింటికి రమ్మని ఆదిశేషయ్యగారు పాలేరుతో కబురు పెట్టారు — లాంచనంగా. వాళ్ళ ఇంటికి వెళ్ళిన తరువాత, వాళ్ళు ఎక్కి వెళ్ళిన, ఒంటెద్దు బండి బాడుగ కూడా వాళ్ళివ్వలేదు. అప్పుడు లక్ష్మీదేవిగారు కొడుకులాగు జేబులో పాత డబ్బాలోవున్న క్రొత్త కానులూ, అణాలూ తీసి లెక్కపెట్టి బండి వాడి కిచ్చింది. వాళ్ళ నాన్న బ్రతికివున్న రోజుల్లో తన దగ్గర, ఎప్పుడు క్రొత్త కానిదొరికి నా కొడుకు కిచ్చేవాడు — ముద్దుగా. అవన్నీ ఒక డబ్బాలో పెట్టి దాచుకున్నాడు. ప్రసాదం అప్పటికి చిన్నవాడేమో అవి కాస్త తీసేసుకునేటప్పటికి భావుర్న ఏడ్చే వాడు.

బయట గాలి హెచ్చింది. మబ్బులు కొంచం దట్టమవుతున్నాయి.

లక్ష్మీదేవిగారు ఆదుర్దాగా బయలుదేరి, గ్రామంలో వాలుగు వీధులూ, పిచ్చి పట్టినట్టూ

కిటికీ వచ్చింది. తన బిడ్డ కనిపించలేదు. మళ్ళీ వీధి అరుగుమీదనే కూర్చొబడిపోయింది.

అప్రయత్నంగా కొడుకు బాల్యం జ్ఞాపకం వస్తోంది—వాడి చదువు సంధ్యలు, ఆట పాటలు ఆనాడు — రాఘవరావుగారిలోగిలిగుమ్మంలో దసరా పాటలు పాడిన రోజు! పంతులుగారు భద్రయ్యగారు ప్రక్కనే నించుని వున్నారు. లక్ష్మీదేవిగారు దేవుడి గుళ్ళోనించి ఆదారినే వస్తూంది. బడి పిల్లలందరూ పాట లాపేసారు. అది కూడా గమనించకుండ "కొడుకులు కోడండ్రు కోమరొప్పగానూ...." అంటూ, దీర్ఘం తీస్తున్నాడు ప్రసాదం ఎవ్వరూ గొంతు కూడా కలపకపోవ టప్పటికి, అతను తలవంచుకుని సిగ్గుగా నవ్వారు ఎదురంగా అరుగుమీద ఖల్ల పడకకుర్చీలో కూచున్న వృద్ధుడు రాఘవరావుగారు కూడా బోసినవ్వు నవ్వారు. లక్ష్మీదేవిగారు, అక్కడే కొడుకుని కావిలించుకుని, తల నిమిరి "సిగ్గు పడకురా నాయనా. అమ్మను, నేనున్నాను.గదా" అని ధైర్యం చెప్పి ముద్దులాడదామనుక్కుంది. అప్పుడే ఇంట్లో నించి బయట కొస్తున్న రాఘవరావుగారి కొడుకు, ఆమె చూపుచూచి "మీ అబ్బాయా అమ్మా?" అన్నారు. అతను బయటకు రాగానే అరుగుల క్రింద కూచునివున్న బిళ్ళా బంట్రోతులులేచి వినయంగా నిలబడ్డారు. ఏదో సభకి అధ్యక్షత వహించమని అడగడానికి బయటవూరునించి వచ్చిన పెద్ద మనుష్యులు వంగి నమస్కరించారు, ఆయనకి. ఆయన, కాలేజీలో పెద్ద చదువులు చదివి గొప్ప సర్కారు ఉద్యోగి అయ్యాడు. పండుగకి స్వగ్రామానికి, సపరివారంగా వచ్చాడు. పంతులుగారితో మాట్లాడారు. లక్ష్మీదేవిగారి కుటుంబం విషయంగా, ఆమె భర్తగారి రాచకీయ ప్రయత్నాలూ, ఆస్తి వ్యయం, వగైరా.

ఆనాడు పుట్టింది ఆవిడకి ఆ కోర్కె. తన ఒక్క కొడుకు కూడా అంతటి విద్యావంతుడవ్వాలి. అంత గొప్ప ఉద్యోగిఅయి, ఇంతటి హోదావాడు కూడా అనుభవించాలి. విద్యావంతుడై, అందరి మానమన్ననలకూ పాత్రుడవ్వాలి. అది ఒక్కటే ఆశ, తన జీవితంలో అంతకుమించిన కోర్కె లేదు.—వేరే ఏది ఎల్లాగైనాసరే వాడికి విద్య చెప్పించి తీరాలి. భగవంతుడిదేభారం. "తెలివైన వాడండీ కుర్రాడు, వృద్ధిలోకి వస్తాడమ్మా" అన్నారు భద్రయ్యగారు. ఆవిడతోనూ, రాఘవరావుగారి కొడుకుతోనూ......"మీ ఆశీర్వాదం" నాయనా అంది లక్ష్మీదేవి.

ఆ ఆశలవల్లనేగదా అల్లాంటి ఏర్పాట్లు చేసింది. లేకపోతే ఏమయిపోను! ఇప్పుడు అన్నీ సఫలమయ్యాక, ఈవిధంగా విడిచి వెళ్ళిపోడం ఏమిటి? వాళ్ళ మామ మాట తను ఎత్తకుండావున్నా బాగుండేదేమో. కాని ఎల్లా అప్రస్తావనే లేకుండా వుండడం? ఊఁ! బాగా ఆలోచిస్తే శేషయ్య మాత్రం ఏమంత క్లిష్టుడు. ధనాశపరుడే. వివరాలు మనస్సులో మెదిలాయి—కొన్ని. ఆ పడమటి ఆవుని గురించి తను చేసిందేమిటి? ఆవుని మేపమని లక్ష్మీదేవిగారిక్కి పంపారు—శేషయ్యగారు. వీళ్ళ ఇంటి కొచ్చాక చక్కని నందిలాంటి కోడెదూడ పుట్టింది, ఆవుకి. దూడకి 8 మాసాల వయస్సు వచ్చేటప్పటికి, రాఘవరావుగారు పోయారు. ఆయన పేరుతో ఆబోతుగా అచ్చు వెయ్యడానికి రాఘవరావుగారి ఇంట్లో వాళ్ళు ఈ కోడె దూడని కొన్నారు. వాళ్ళు కొన్నప్పుడు దూడ ఇంకా పాలైనా వదలలేదు. లక్ష్మీదేవిగారు ఆవుని దూడని వేరు చెయ్యనంది. అందువల్ల అచ్చువేసి దూడని తిరిగి వీళ్ళ ఇంట్లోనే కట్టేసారు. పాలు సొంతంవదిలిన తరువాతగాని, దూడని తిరిగి పంపలేదావిడ. ప్రస్తుతం తన కొడుక్కి తనకీ ఈ ఎడబాటు ఎవ్వరు చేసారో! ఆ మాటకి గుండె కల్లడిల్లింది.

అన్నట్టూ, మేనమామ, ఆవు మాట ఏమయింది? సరి. రెండోసారి ఆవు చూడితో వుండగా "శేషూ పిల్లవాడు చిక్కి పోతున్నాడు. పాలూ పెరుగూవాడికి అవసరం వస్తాయి. ఏదో ఒక ధరకట్టి ఆవుని నావద్దనే వుంచండిరా. తోలికెళ్ళవద్దు" అంది లక్ష్మీదేవిగారు. అందు కాయన "మొదటి దూడని 250 రూపాయలకు అమ్మాముగదా ఇప్పుడు చూడితోవుందిగదా. కడుపులోవున్న దూడకి 250 రూపాయలు ఆవుకి 400. అంతా 650 రూపాయలు ధర కట్టాడు.

పైగా ఆ రెండోసారి పుట్టిన కోడెదూడకి ప్రక్క టెముకలలో ఒకటి తక్కువ. ఇంటి కిష్టయం అన్నారు తెలిసిన వాళ్ళు. ఒక బీద బండివాడు విధిలేక కొనుక్కున్నాడు, ఆ దూడని. ఆవు కూడా ఆ తరువాత వల్ల కప్పువేసి క్షీణించుకొచ్చింది.

లైసెన్సు లేని సైకిల్ ఎక్కి వెడుతున్న కుర్రవాణ్ణి పట్టుకొని కేసు వ్రాసుకొంటున్నాడు పోలీసు.

"పేరు"

"అవధానం శంకరయ్య"

"అడ్రసు?"

"నెం. 37, మైన్ రోడ్.

"వయస్సు?"

"దాదాపు 50 సంవత్సరాలు"

"ఇదిగో అబ్బాయ్, తమాషాగా ఉన్నదా? నీకు 50 ఏళ్ళేమిటి?"

"నాకు కాదండి. నే చెప్పిన వివరాలన్నీ ఈ సైకిల్ యజమానివి. నేను ఎరువు తెచ్చుకుని తొక్కుతున్నానండి."

టి. సుధాకర్ (వెంకటగిరి)

అటువంటివాడు ఆదిశేషయ్యగారు. ఎంతవరకూ తన ఆయుష్యు తన ఆరోగ్యమేగాని మేనమామ ఎటువంటి వాడయినా తల్లికనేం చేసింది? తనమీద ఎందుకీకోపం? ఒక్కటే ఒక్క కొడుకు వైధవ్యంలో వార్ధక్యం సమీపిస్తుండగా ఇల్లా ఒంటరిగా వదిలి వెళ్ళడం ఎవ్వరు భరిస్తారు! ఎంత ఆపుకున్నా లక్ష్మీదేవిగారికి దుఃఖము ఆగలేదు.

లేచి వీధిలోకివచ్చి వెర్రిగా చూసింది. "భగవంతుడా, చేతిలో ఊతకి ఒక కర్ర ఇచ్చావు. తిరిగి లాగుకున్నావా?" అంది ఏడుస్తూ. చేతులు జోడించి పైకి ఆకాశంకేసి చూసింది.—భక్తితో. ఆ చూపులో వెయ్యి పూజలున్నాయి.

బయట గాలి పెద్దదయింది. గాలిలో ఉధృతం వేగం హెచ్చినాయి. చినుకులు ఆరంభమైనాయి.

కన్న కొడుకు. లేకలేక దేవుడికి మొక్కులు మొక్కి కనినవాడు—ఏమైపోతున్నాడో! దుఃఖం తోనే ఇంట్లోకి వెళ్ళింది. గాలి విసురికి తలుపులన్నీ కొట్టుకుంటున్నాయి. కాని తలుపులు మూయ బుద్ధి కాలేదు. తన బిడ్డ ఎక్కడో తడుస్తున్నాడు తనకెందుకీ భద్రత.

కిటికీలోంచి వాడి మేజా మీదికి జల్లుకొడుతూంది. వాడి కాలేజీ పుస్తకాలన్నీ తడిసిపోతున్నాయి. వెళ్ళి ఆ కిటికీ మట్టుకు మూసింది.

ఎంతెంత ఆశలతో ఈ కాలేజీ చదువులు చదివించింది. ఏడవ క్లాసులో మార్కులు బాగా వచ్చాయి. భద్రయ్యపంతులుగారు "కుర్రాణ్ణి పైకి చదివించండమ్మా" అన్నారు. ఎల్లాగో స్కూలు ఫైనల్వరకూ గట్టెక్కించింది. మొదటగా పాస అయ్యాడు. "ప్రసాదం యోగ్యుడమ్మా పైకి చదివించాలి" అన్నారు భద్రయ్యగారు పట్టలేని తృప్తితో—లక్ష్మీదేవిగారింటికొచ్చి. లక్ష్మీదేవిగారి హృదయం పొంగిపోయింది. కాని మరుక్షణం "డబ్బు" అంది. "మా ఇరుగుబాటు మీకు తెలుసుగదా?" అంది తిరిగి. "బుద్ధిమంతుడమ్మా డబ్బుకి ఏదో ఏర్పాటు చెయ్యాలి మరి" అన్నారాయన లేచి వెళ్ళిపోతూ "పోనీ ఆదిశేషయ్యగారేమీ చెయ్యలేరా?" అన్నారు తిరిగి, ఆయన మాట స్ఫురించి లక్ష్మీదేవిగారు తల చెయ్యి అడ్డంగా వూపారు. "అబ్బెబ్బె! అది బ్రహ్మకలంకి! వాడికీ వీడికీ ఒకళ్ళపొడ అంటే ఒకళ్ళకి గిట్టదు—ఉప్పుకి నిప్పు. మా తమ్ముడు అండా, ఆదరణా వీడు ఒప్పుకోడు గదాండీ" అంది నిరాశగా. ఆ! చిన్న తప్పు పట్టుదలలులెండి. వాటికేంగాని. అయినా డబ్బుకి ఎల్లా సర్దుబాటు చేసినా వాడికి తెలియవల్సిందేముంది? ఇన్నాళ్ళూ మీరెల్లా కష్టపడింది ఎల్లా చదివించింది వాడికి తెలుసునా ఏమన్నానా? చెపితే వాడికేమి అర్థమవుతాయి? పసివాడు. అయినా ఈ ఆలోచనలన్నీ వాడికి పెట్టకండి. వాడు వృద్ధిలోకివస్తే సంతోషిస్తాను. డబ్బు విషయం ఏదో ఏర్పాటు చేదాం. చేసి తీరాలి" అని వెళ్ళిపోయారు పంతులుగారు.

ఆ సంవత్సరం విశ్వవిద్యాలయం ఉన్న పట్టణంలో కళాశాలలో చేరాడు—ప్రసాదం. హాస్టలులో సీటు దొరకలేదు— లక్ష్మీదేవిగారు కొడుకుని వదలి

ఉండలేకపోయింది. అదీ ఒంటరిగా. దగ్గరవేఉండి కొడుకికి అన్నీ పాలనా చూస్తూ స్వయంగా వంట చేసి పెడదామని బస్తీలో చిన్న కాపరం పెట్టింది, అవిడ

ఆ కాపురపు రోజుల్ని చిన్నటిలాగు అనిపించింది, ఆ పాత ఇంట్లో కూలబడివున్న లక్ష్మికి.

ఆ బస్తీలో తెలిసినవాళ్లెవరూ లేరు, లక్ష్మి దేవిగారికి. ఒక విధమైన భయం కూడాను. అసలు వచ్చేటప్పుడే—గోదావరిమీదకి రైలు రాంగానే "అబ్బాయి, గంగమ్మ గోదావరికి అప్పగారుటరా. ఆగంగనీళ్ళు అందుకని ఈ గోదావరి నీళ్ళకి చూపిస్తే పొంగుతాయిటరా" అంది. కాలేజీలో చదువడానికి, ఆ బండి

# అనురసంధ్య

లోనే ప్రయాణం చేస్తున్న ఆడపిల్ల ఒకతె ఫక్కున నవ్వింది. లక్ష్మీదేవిగారు నొచ్చుకుంది.

ఇంటికి తిరిగి వచ్చేస్తూ, "భగవంతుడు నాకు ఆడ పిల్లల్ని ఇవ్వలేదురా. నా అదృష్టం. నాకు ఒక్క పిల్ల గనక ఉన్నట్టయితే మీ నాన్న దాన్ని కూడా ఇల్లాగే, కాలేజీలో చదివించేవారు, ఇచ్చి తంగా. దాంతో అదీ ఇలాగే తయ్యారయ్యేదిసుమా! నాకు నువ్వు ఒక్క మొక్క చాలురా" అంది ప్రసాద రావుతో.

ప్రసాదానికి మాత్రం, కాలేజీకి వచ్చినప్పటి నుంచి ఆలోచనలు పెంపైనాయి. తన ఉపాధ్యాయులతో పరిచయాలు వృద్ధిచేసుకున్నాడు. అనేక పుస్తకాలు, విమర్శలూ చదువుతూ వచ్చాడు. కొన్ని నిశ్చయాభిప్రాయాలకి వచ్చాడు. కొడుకులో వచ్చిన ఈ మానసిక పరిణామము అమ్మకి తెలియదు.

ఋతువులు గడుస్తున్నాయి. ఒకనాటి సాయంత్రం "గుళ్లో హరికథ ఉందట, వెళ్తాను" అంది లక్ష్మిదేవిగారు. "నాకూ ఏమీ తోచటంలేదు. వైగ

(46 వ పేజి చూడండి)

ఆకుండి శారదారామశర్మ

# సమష్టి కుటుంబాలు

ఒక సమష్టి కుటుంబము ఒక చిన్న సాంఘిక వ్యవస్థ. మనలో చాలామంది వ్యష్టిగా బ్రతకడం కంటే సమష్టిగా జీవించడానికే ఎక్కువగా ఇష్టపడతారు. ఆ మాటకొస్తే వాస్తవానికి సమష్టి జీవనంలో ఉన్న సంతృప్తి, సౌఖ్యము వ్యష్టి జీవనంలో లభ్యం కావు. సమాజంతో సంబంధం లేకుండా మన మెలాగ జీవితాలు వెళ్ళబుచ్చలేమో అలాగే మన కాత్మీయులైన కుటుంబంలోని వ్యక్తులతో సన్నిహిత సంబంధము లేకుండా ఎవరికి వారే యమునాతీరే అన్నట్టు కాలం గడపటం కష్టసాధ్యమే. నేడు ప్రపంచంలోని దేశాలతోపాటే మారిపోతున్న పరిస్థితుల మధ్య మన మున్నాము. బహుముఖంగా వారికెన్ని విభిన్న దృక్పథాలున్నప్పటికీ వారు సహజీవన సిద్ధాంతాల కనుగుణంగా నడుచుకోడానికే సర్వవిధాలా ప్రయత్నిస్తున్నారు. అట్లాంటి పరిస్థితులలో అతిచిన్న సాంఘిక వ్యవస్థయైన ఒక సమిష్టి కుటుంబములోని సభ్యులు కలిసికట్టుగా సహజీవనం చెయ్యలేకపోతున్నారు. దానికి కారణం ముఖ్యంగా వారిలో సహనశీలత్వం లోపించడమే నన్నమాట

ఏకరక్తం పంచుకొని ఒకేచోట పుట్టి పెరిగి పెద్దవారయేసరికి, పిల్లా పాపా కలిగేసరికి సమష్టి కుటుంబంలోంచి విడిపోయి వ్యష్టిగా బ్రతుకుదామనే కోరిక మనలో చాలామందికి కల్గుతోంది. అలాగ మన ధోరణి మారడానికి అనేక కారణాలు ఉంటున్నాయి. ముఖ్యమైనది ఆర్థిక కారణం. నలుగురిలో సమష్టిగా ఉన్నప్పుడు కొంతవరకు వ్యక్తి ఆర్థిక స్వాతంత్ర్యమునకు భంగము కలుగక తప్పదు. మన దేశంలో హిందువులలోనే సాధారణంగా యీ సమష్టి కుటుంబ ఆచారాన్ని ఎక్కువగా పాటిస్తారు. అనాదినుండి ఒక సంప్రదాయంలాగ నెలకొల్పబడింది. సంఘర్షణలు లేకుండా సమిష్టి కుటుంబ సభ్యులు సంతృప్తి, సౌఖ్యములతో సహజీవనం చేయగల్గిననాడు అది స్వర్గతుల్యమే. పరస్పరం ఈర్ష్యలు, కక్షలు కావేషాలతో కుటుంబంలోని సభ్యులు సమిష్టి జీవనం చేయడం నరకప్రాయమే.

ఒక కుటుంబములోని వ్యక్తులకు వచ్చే రాబడులలో తారతమ్యాలు వారివారి విద్యా యోగ్యతలను బట్టి, ఉద్యోగస్థాయీలను బట్టి ఉండడం అతి సహజం. ఎన్ని వ్యత్యాసా లున్నప్పటికి సమిష్టి కుటుంబ జీవనానికి సమ్మతించిన సందర్భంలో సభ్యు లందరికి అనుభవంలో మట్టుకు సమాన స్థాయియే ఉంటుంది. ఎక్కువ ఆర్జించి అవిధంగానే సంసార నిర్వహణకు అధికంగానే యిచ్చి తాము ఎక్కువ సౌఖ్యాలను, సౌకర్యాలను అదనంగా పొందాలని ఆశించడం జరుగుతుంది. కాని అది సమిష్టి కుటుంబాలలో సాధ్యంకాని విషయము. తమ కడుపున పుట్టిన సంతానమంతా తమ వద్ద సమష్టిగా ఉన్నప్పుడు ఏ తల్లిదండ్రులైనా వారందరికీ సమానంగానే జరపడానికే చూస్తారు తప్ప ఇంకొక విధంగా భావించలేరు. ఉదాహరణకు ఏ తల్లి తన బిడ్డలకు వారివారి ఉద్యోగ స్థాయీలను బట్టి ఒకరికి పెరుగు, ఒకరికి మజ్జిగ, ఒకరికి నీళ్ళు పోసి భోజనం పెట్టగలుగుతుంది. ఆమె మాతృహృదయము ఎంతమాత్రము ఒప్పుకోదు.

సమాజంలో ఆర్థికంగా నున్న హెచ్చు తగ్గుల వల్ల ఏర్పడిన వర్గ సంఘర్షణే కుటుంబ వ్యవస్థలోని సంఘటిత శక్తులను చీలదీస్తుంది. తత్ఫలితంగా సమష్టి కుటుంబాలు వ్యష్టి కుటుంబాలుగా మారుతాయి. ఆ పరిణామానికి కూడా కారణము పురుషుడి జీవితంలో స్త్రీ భాగస్వామ్యం పంచుకొన్న తర్వాతనే. సమిష్టి కుటుంబంలోని సభ్యులంతా ఏకరక్తం పంచుకొని పుట్టిన వారే కాకుండా విభిన్న ప్రదేశాల నుండి, విభిన్న వాతావరణముల నుండి, వివిధ అంతస్థుల నుండి విభిన్న స్వభావాలు గల వ్యక్తులు (వైవాహిక సంబంధము వలన కొత్తగా వచ్చి చేరినవారు) ఆ కుటుంబంలోవచ్చి చేరడం జరుగుతుంది. అలాగ చేరినవారందరు ఆ కుటుంబ పరిస్థితులకు, వాతావరణమునకు, అభిరుచులకు తలొగ్గి అలవాటుపడి ఆ సమిష్టి కుటుంబంలో సహజీవనానికి సంతోషపూర్వకముగా సమ్మతించిననాడు సమిష్టి కుటుంబాలలో సమస్య లనేవి వుండవు. ఎప్పుడైతే వారిలో సహనశక్తి సన్నగిల్లుతుందో అప్పుడే సమిష్టి కుటుంబంలో సంఘర్షణ ప్రారంభమై పచ్చని సంసారాలలో చిచ్చు రగిల్చేందుకు అవి ఇంధనము లవుతాయి.

ఇటు అష్టకష్టాలు పడి కని పెంచి విద్యాబుద్ధులు చెప్పించి తామింతవారినిగా చేసిన తల్లిదండ్రులనూ, అటు తమ జీవితాంతము కష్టసుఖాలలో భాగస్వామ్యం పంచుకొనేందుకు తన సర్వస్వము ధారపోసేందుకు సిద్ధపడి తమను కట్టుకున్న ఇల్లాలిని — ఉభయుల్ని అదుపులో పెట్టుకొని గాని, మందలించి గాని అశక్తుడై మథనపడే మగవాని మనస్థితి పరిస్థితి ఆడకత్తెరలోని పోకచెక్క వంటిది మాత్రమే కాగలదు. ఏ ఒక్కరిపైన సానుభూతి చూపించినా రెండో వారు సహించలేరు. కొన్ని సందర్భాలలో కుటుంబ పరిస్థితు లింకా విషమించిననాడు మగవానికి పలాయనమే శరణ్యము. ఆ మార్గము ఎంతమాత్రము అనుసరణీయము కాదు. సమిష్టి కుటుంబంలో వ్యతిరేకశక్తులు విజృంభించినప్పుడు వానిని కూలగట్టడానికి ప్రయత్నించడం కంటె ఆ శక్తులను విడదీసి స్వేచ్ఛ నిచ్చి కుటుంబంలో ప్రశాంతత నెలకొల్పడం శ్రేయస్కరం. బలవంతంగా సంఘర్షణను ఏదో తాత్కాలికంగా అణచిపెట్టినప్పటికి దాని అసలు స్వరూప మెప్పుడో ఒకనాడు బయట పడక తప్పదు.

సంఘర్షణలు లేకుండా ప్రశాంత వాతావరణం అలుముకొనిఉన్న సమిష్టి కుటుంబాలు బహు అరుదనే చెప్పాలి. అసహనం, అసంతృప్తి, అభిజాత్యం వంటి దుర్గుణ జాడ్యాలు సమిష్టి కుటుంబాలలోని సభ్యులను పీల్చి పీడించగా ఈ ఆ సమిష్టి కుటుంబము సహజీవన సూత్రాలకు కట్టుబడలేక నిత్య నూతన సంగ్రామరంగముగా మారుతుంది. సమిష్టిగా ఉంటూ ప్రతినిత్యం సభ్యులంతా బలాబలాలు పరీక్షించుకొంటూ సమిష్టి గౌరవాన్ని పరిరక్షించుకొనే కంటే వ్యష్టిగా బ్రతకడమే శతవిధాల యెల్లరికి ఆమోదనీయము, ఆచరణయోగ్యము. ఎన్ని యిబ్బందులున్నా, సంఘర్షణ లున్నా సమిష్టి కుటుంబంలోనే కలిసి మెలిసి జీవితాంతం అశాంతితో సతమత మవాలనే శాసనం లేదు. నాగరికత బాగా వ్యాపించియున్న విదేశాలలో సమిష్టి కుటుంబ వ్యవస్థ మచ్చుకైనా కానరాదు. ఆ కారణం వల్లనే ఆయా దేశాల్లో మన దేశంలో సర్వ సాధారణంగా అత్తా కోడళ్ళ మధ్య ఉండే మనస్పర్థలు వైషమ్యాలు తలెత్తడానికి అవకాశ ముండదు. కొన్ని సందర్భాలలో సమిష్టిగా ఉన్నప్పుడు కంటె వ్యష్టిగా వెళ్ళిపోయిన తరువాత కలిగిన ఎడబాటు వల్ల ఒకరిపై ఒకరికి పరస్పరం ఆప్యాయత కల్గుతుంది. తత్ఫలితంగా కుటుంబ సభ్యులలో ఒకరియెడ ఒకరు సద్భావం పెంపొందించుకొని సమష్టి సహజీవనం లేకపోయినా కనీసం పరస్పరం సత్సంబంధాలు నెలకొల్పుకో గల్గుతారు.

సమిష్టి జీవనానికి ప్రధానంగా కావలసినవి— సహనం, సహృదయత, సంతృప్తి—యీ మూడు సుగుణాలు ప్రతీ ఒక్కరిలో ఉంటే సమిష్టి కుటుంబాల వలన ఎట్టి సమస్య లుత్పన్నము కాలేవు. ఎన్ని వైరుధ్యాలున్నా, ఎన్ని యిబ్బందులున్నా సర్దుబాటు చేసుకొనే మనస్తత్వ ధోరణితో నెట్టుకొని వస్తే సమిష్టి కుటుంబాలలో సహజీవన సిద్ధాంతము రాణింపుకు వస్తుంది. సంఘర్షణ ఉంటేనే తప్ప ఆ సిద్ధాంతము రాద్ధాంతముగా మారే అవకాశము లేదు. భిన్నత్వంలో ఏకత్వం — ఇది అనాదినుండి వస్తూన్న భారతీయ నాగరికతలోని ప్రత్యేకత. వివిధ మతములకు, వివిధ భాషలకు, వివిధ సంప్రదాయములకు చెందిన కోట్లకొలది ప్రజలు ఒకే పతాకము క్రింద ఒకేజాతివార మనే విశాల భావాన్ని ప్రకటిస్తూన్న నేటి పరిస్థితులలో సమిష్టి జీవనం కన్న వ్యష్టి జీవనమే ఎన్నో విధాల ప్రయోజనదాయకమని అనడం సంకుచితంగానే కన్పిస్తుంది. ★




# రాశిఫలాలు

దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**14-6-1961 బుధవారము మొదలు**
**20-6-1961 మంగళవారము వరకు**

**మేషం :**

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

మీ పనులు మీరు చూచుకొనటానికే అవకాశం తక్కువ. ఇందులో ఇతరులకు సహాయం చేయవలసి రావటంవల్ల చికాకు కలుగుతుంది. నౌకరులమీద ఆధారపడిన పనులు చివర వరకూ సక్రమంగా జరుగవు. బంధువర్గంలో మంచి పేరు సంపాదిస్తారు. ఆదాయం కూడా బాగా పెరగగల అవకాశాలున్నవి. వ్యవహార రంగంలో క్రొత్త భారం పైనపడుతుంది. కాని, ఇంతకుముందు మీతో పోటీ చేస్తున్న మనుష్యులు ఈ సమయంలో మిమ్ములను అనుసరిస్తారు. దేహసౌఖ్యం బాగుండకపోవచ్చు. మీ మీదకురానున్న అపవాదులను జాగ్రత్తగా తప్పించుకొనగలుగుతారు. విలాస వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు. అయితే వృధా ఖర్చులు కాగల సమయం. 14, 15 తేదులలో అశాంతి, వస్తు నష్టము, బంధు మిత్రుల మూలంగా చిక్కులు.

* * *

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

ముందు రాబోవు చిక్కులను తెలుసుకుని జాగ్రత్తపడ గలుగుతారు. మీ మాటతీరు అవతలి వారికి కొంచెం బాధ కలిగించవచ్చు. కాని సకాలంలో మీ పనులు అనుకూలిస్తవి. కుటుంబంలో శుభ కార్యాలనిమిత్తం ఖర్చులు పెరుగుతవి. బాహ్య విషయాలలో గౌరవము, ఆడంబరము బాగుంటవి వృత్తిలో అభివృద్ధి నిమిత్తం మీరు చేసే ప్రయత్నాలు అనుకూలమార్గంలో ఉంటవి. పుణ్య కార్యములయందు ఆసక్తి మాత్రం ఉంటుంది. కాని అవకాశం లభించటం కష్టం. నీడలతో కలహాలు రావటంవల్ల అశాంతి కలుగవచ్చు. ఎప్పుడో లాభిస్తుందనే భావంతో ప్రస్తుతం డబ్బు పెట్టుబడిపెట్టవలసి వస్తుంది. పడమర దిక్కునుంచి శుభ వార్తలు వింటారు. 19, 20 తేదులలో కష్ట వార్తలు, ధన సంబంధమైన చిక్కులు రావచ్చును.

* * *

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

ఎవరు ఏ విధంగా భావించినా మీ శక్తితో మీరు నిలబడటానికి ప్రయత్నించటం మంచిది. దుబారా

> **గ్రహస్థితి**
>
> మేషంలో శుక్రుడు, వృషభ మిథునాలలో సూర్యుడు. మిథునంలో బుధుడు, కటక సింహాలలో అంగారకుడు. సింహంలో రాహువు, మకరంలో గురు శనులు, కుంభంలో కేతువు, మిథున కటక సింహాలలో చంద్రుడు.

ఖర్చులు అధికమవుతాయి. పిల్లల ఆరోగ్యం బాగుండదు. హోదా నిమిత్తం కార్యభారం పైనవేసుకొనతగిన సమయంకాదు. వృత్తి ఉద్యోగాలలో సాధారణంగా శ్రమ ఉన్నా, కార్యసిద్ధి, ఆదాయము, గౌరవము వీటికి లోపంరాదు. కుటుంబంలో ఇంతకు ముందున్నటువంటి అశాంతి కొంతవరకు తగ్గుతుంది. ప్రయాణాలు సుఖంగా జరుగుతవి. క్రొత్త మనుష్యులతో సంప్రదించవలసిన సందర్భంలో ముందు ఆందోళన కలుగుతుంది. కాని బుద్ధిబలంతో జాగ్రత్తగా నిర్వహించుకోగలుగుతారు. వారాంతంలో ఆరోగ్యం తగ్గుతుంది. 15, 16 తేదులలో ధనలాభము, స్నేహితులవద్దనుంచి శుభవార్తలు.

* * *

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

ఈవారం అంతా పోటీ ఎదుర్కొంటూ మీరు ముందుకు పోవలసివస్తుంది. అధికారులవల్ల మాటరాగల సమయం జాగ్రత్తగా ఉండండి. అకస్మాత్తుగా డబ్బుకాని, వస్తువులుగాని పోయే అవకాశాలున్నవి. అంతరంగంలో ఎన్ని బాధలున్నా పైకి నిబ్బరంగా కనపడుతూ ఉండటంవల్ల మిమ్ములను సహాయంకోరేవారు ఉంటారు. సాధ్యమైనంతవరకు ఖర్చులను తగ్గించుకొనటం మంచిది. కుటుంబంలోని వారి ఆరోగ్యం సరిగా ఉండదు. ఇతరులకు మంచి చేయబోతారు. కాని, మాట దక్కటం కష్టం. లోగడ మీకు సహాయం చేస్తామని చెప్పినవారు కూడా ఈ సమయంలో తప్పుకొనటానికి చూస్తారు. సుబ్రహ్మణ్య సహస్రనామ పారాయణం చేసుకొనటం అన్ని విధాలా మంచిది. 19,20 తేదీలలో కుటుంబంలో అశాంతి, శ్రమతో ధనలాభం.

* * *

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

సాహసంతో చిక్కులను తొలగించుకొని, పదిమందిలో గౌరవం నిలుపుకోగలుగుతారు. వ్యవహార రంగంలో ఇంతకుముందున్న సందేహాలు తొలగిపోయి ఉత్సాహం లభిస్తుంది. వృత్తిలో శ్రమ ఉన్నా సంతృప్తికరంగా ఫలితం లభిస్తుంది. పండితులతో స్నేహంలభిస్తుంది. ఇంతకుముందు ఆశలు వదులుకుని విరమించుకున్న ప్రయత్నాలు తిరిగి కొనసాగుతవి. దూరపు బంధువులవద్దనుంచి శుభవార్తలు వింటారు. వ్యాపార వ్యవహారాలలో ఇతరులకు సలహా చెప్పి సహాయం చేయవలసివస్తుంది. దండుగ ఖర్చులు చాలావరకు తగ్గిపోతవి. ఈ సమయంలో స్థిరాస్థి వృద్ధి ప్రయత్నాలుగాని, యంత్రాలు మొదలయినవికొనే ప్రయత్నాలుగాని అనుకూలించకపోవచ్చు. 14, 15 తేదులలో ఆదాయము, ఖర్చులు కూడా అధికం. శుభ వార్తలు.

* * *

**కన్య :**

(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

చేయవలసిన శ్రమ అంతాచేసి అవకాశం నిమిత్తం ఎదురు చూడవలసిన సమయం. ఎప్పటికప్పుడు కార్యసిద్ధి అయ్యేటట్లు కనుపిస్తుంది. కాని, స్వల్ప కారణంతో నిలచిపోతూ ఉంటుంది. సంఘంలో గౌరవం బాగుంటుంది. రకరకాల మనుష్యులతో స్నేహము, అనుభవము లభిస్తుంది. గ్రంథ పఠనము, దైవ కార్యములయందు పాల్గొనడము మొదలయిన వాటితో కాలం జరుగుతుంది. ఎదురుగా మిమ్ములను స్తోత్రం చేయుటం మాత్రమేగాని, యథార్థంగా సహాయం చేసేవారు ప్రస్తుతం లభించరు. విలువగల వస్తువులు కొంటారు. ఇతరులవద్దనుంచి రావలసిన ధనం వారాంతంలో కొద్దిగా లభిస్తుంది. 16, 17 తేదీలలో కలహ ప్రసంగాలు, శుభ కార్య ప్రయత్నాలు, ఖర్చులు.

* * *

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

ఇంతకుముందుకన్నా ధనాదాయం బాగుంటుంది. ఒకరిద్దరు మంచిమనుష్యులు మీకు అన్ని విధాలా సహాయం చేస్తారు. వృత్తి వ్యాపారాలలో నిష్కర్షగాఉండి కార్యం సాధించుకోగలుగువారు. కుటుంబంలో తలవని తలంపుగా కలహ ప్రసంగాలు రాగల అవకాశాలున్నవి. అనేక సమయాలలో మతిమరుపువల్ల లభించనున్న ఫలితం తప్పిపోతుంది. చిప్పట అధికంగా ఉంటుంది మీ మాటను కాదని వెళ్ళినవారే తిరిగి మీ సలహా నిమిత్తం వస్తారు. అకస్మాద్ధనలాభం ఉంటుంది సభా గౌరవం లభిస్తుంది. దైవ కార్యాలు సకాలంలో జరుగుతవి. ప్రయోగాలు అనుకున్న ప్రకారం జరుగవు. అందువల్ల ముందుముందు మీ కే మేలు కలుగుతుంది. 19, 20 తేదులలో అపవాదులు, శ్రమతో కార్యసిద్ధి.

* * *

## వృశ్చికం :

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఎన్ని మాటలు చెప్పినా కార్య నిర్వహణ శ్రమగా తోస్తుంది. ఈ సమయంలో బంధు మిత్రులు అందరు మిమ్ములను ముందుకుపెట్టి తాము తప్పుకొనటానికి చూస్తారు. ముఖ్యంగా మీ శక్తి, ధన సంబంధమైన పరిస్థితులు సంతృప్తిగా కనిపించవు. వృత్తిలో ఆడంబరం మాత్రం పెరుగుతుంది. కుటుంబంలో మీ మాటకు విలువ లభిస్తుంది. కాని ఖర్చులు, శ్రమ అధికంగా ఉంటవి. ఈ సమయంలో విశేషంగా ఆదాయం వస్తుంది. ఖర్చు అవుతూ ఉంటుంది కాని ముఖ్యమైన పనులు మాత్రం అలాగే నిలచి ఉంటవి. వ్యవహార విషయాలలో చిక్కులు క్రమంగా తొలగుతవి. ప్రసంగాలలో తొందర పడవద్దు. పిల్లల మూలంగా శాంతి, సుఖము లభిస్తవి. 14,15 తేదులలో దుర్వార్తలు, అధికారులతో ప్రసంగాలు, ఆందోళన.

* * *

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

వ్యవహారాలు తీరిపోయినట్లుకనుపించినా అందుకుసంబంధించిన ఆందోళన, శ్రమ మాత్రం ఇంకా ఉంటవి. వృత్తికి సంబంధించిన కార్యకలాపాలు వినుగుదలను కలిగిస్తవి. చేసిన పని తిరిగి చేయవలసి వస్తుంది. విలువగల వస్తువులు కొంటారు. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది. సాధారణంగా తక్కువ అంతస్తులో ఉండే మనుష్యులతో స్నేహము, వారివల్ల సహాయము లభిస్తవి. మీరు ఎదురుచూస్తున్న వార్తలు ప్రస్తుతం అందకపోవచ్చు. సంఘంలో గౌరవం పొందగలుగుతారు. మీ పని పూర్తి కాకుండా ఇతరులను నమ్మి డబ్బు పోగొట్టుకోవద్దు. ధైర్య సాహసాలతో కష్టతరమైన పనులను నిర్వహించగలుగుతారు. ఆదాయం మీరు అనుకున్నంతగా పెరగదు. కాని లోపం ఉండదు. 14, 15 తేదులలో అధికారులతో కలతలు, అసంతృప్తికరమైన వార్తలు.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం ధనిష్ఠ 1, 2 పా)

మనస్సులో అనేక ఆలోచనలు, ప్రతి పని యందు ఆసక్తి కలుగుతూ ఉంటుంది. అయితే ఏ పనీ సంపూర్ణంగా చేయలేకపోతారు. అందరూ సలహా చెబుతారు. కాని సహాయం చేయటానికి మాత్రం ముందుకురారు. ఆదాయం బాగానే ఉంటుంది. కాని ప్రస్తుతం మీ అవసరాలకు చాలక పోవచ్చు. దూరమందున్న బంధు మిత్రుల సహాయంతో మీ స్థితి మెరుగుఅవుతుంది. చాలా కాలంముందు ఆశ వదలుకొన్న పనులు క్రమంగా అనుకూలిస్తవి. బంధువులవద్దనుంచి శుభవార్తలు తెలుస్తవి. ముఖ్యమైన వస్తువులుగాని, వ్యవహార సంబంధమైన కాగితాలుగాని పోయే అవకాశమున్నవి. జాగ్రత్తగా ఉండండి. క్రొత్త మనుష్యులతో చనువుగా ప్రవర్తించటంవల్ల అనవసరమైన బాధ్యతలు పైన పడగల సమయం. 19, 20 తేదులలో శ్రమతో కార్యసిద్ధి, స్వల్ప ఆదాయం, మిత్రలాభం.

* * *

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

మిమ్ములను మీరు సమర్థించుకుంటూ తోటి వారికిన్ని సహాయం చేయవలసి వస్తుంది. అయితే దైవబలంవల్ల మాట దక్కించుకొంటారు. ధనాదాయం పెరుగుతుంది. కుటుంబంలో మన శ్శాంతి లభిస్తుంది. అనుకున్న పనులు సులభంగా నెరవేరగల సమయం. కోర్టు కచేరీలలో ఖర్చులు, శ్రమ అధికంగా ఉండవచ్చు. కాని గౌరవం దక్కుతుంది. మీతో కూడా ఉండేవారే ఒకానొక సందర్భంలో మీ మాటను వ్యతిరేకిస్తారు. విపరీతమైన ఆలోచనలు, కార్యభారము పీటివల్ల మీ దేహ సౌఖ్యం తగ్గుతుంది. ఖర్చులు కూడా అధికంగా కనుపించగల సమయం. పడమరదిక్కునుంచి లాభవార్తలు తెలుస్తవి. వారం రెండవభాగంలో తలవని తలంపుగా ధనలాభం ఉంటుంది. శుభ కార్యాలలో పాల్గొంటారు. 15, 16, 17 తేదులలో కలహ సూచనలు, సంఘ కార్యాలు, దేహశ్రమ అధికం.

* * *

## మీనం :

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

చీకు చింతలు తొలగిపోయి ముందు జరుగతగు పనులను గురించి ఒక నిర్ణయానికి రాగలుగుతారు. ధనాదాయానికి సంబంధించిన ప్రతిబంధకాలు తొలగుతవి. బంధు మిత్రులతో పేరు ప్రతిష్ఠలు లభిస్తవి. ప్రతి విషయంలోను స్వశక్తితో ముందుకు పోగలుగుతారు. అధికారులవద్దనుంచి అనుకూల వార్తలు తెలుస్తవి. తలవని తలంపుగా ఖర్చులు రావటంవల్ల తాత్కాలికంగా శ్రమ తోచినా, తిరిగి వెంటనే సహాయం లభిస్తుంది. వాహనాలు మొదలయినవికొనే ప్రయత్నాలు అనుకూలిస్తవి. దూరపు ప్రయాణాలు చేయవలసి వట్లు కనుపించినా ప్రస్తుతానికి నిలుపుకోవలసి వస్తుంది. హాస్య ప్రసంగాలలో జాగ్రత్తగా ఉండటం అవసరం. తొందరపడవద్దు. 19, 20 గౌరవభంగం వస్తుందేమోనని ఆందోళన, కష్ట వార్తలు. వృత్తిలోసాటివారి సహాయంలభిస్తుంది. ★

## ఈవారము ధరలు

ఈవారంలో బంగారు ధర కొద్దిగా తగ్గవచ్చు. వెండిధర కొద్ది తేజీ వచ్చి తగ్గుతుంది. పసుపు ధరలో తేజీ వస్తుంది. నూలు ధర క్రమంగా పెరిగి వారాంతంలో తగ్గుతుంది. వేరుశనగనూనె ధర తగ్గి వారాంతంలో పెరుగుతుంది. వేరుశనగపప్పు ధర నిలకడగా ఉంటుంది. నువ్వుల నూనె ధర కొంచెం మందివచ్చి పెరుగుతుంది. మినుముల ధర పెరుగుతుంది. కందుల ధరలో కొద్ది మంది కనుపిస్తుంది. మిర్చిధర కొద్దిగా తగ్గే అవకాశాలున్నవి.





"సైనికసమాచార్" పత్రిక స్వర్ణోత్సవ సంచికలో ఈ కథకు ద్వితీయబహుమతి లభించింది. ఆ పత్రిక సంపాదకుల అనుమతితో ఇక్కడ ప్రచురిస్తున్నాం.

"ప్రియతమా,

నీతో అత్యవసరమైన పనివుండి నేను మంగళవారం రాత్రి మెయిలుకు విజయవాడ వస్తున్నాను. నన్ను స్టేషనులో కలుసుకోవలసినది. మర్చిపోవు కదూ.

ఇట్లు,
నీ సీత"

సుందరానికి ఈ ఉత్తరం చూడగానే ఆశ్చర్యం వేసింది. ఎప్పటి సీత, ఏనాటి సీత. ఆమె అతన్ని ప్రియతమా అని సంబోధించడం, నీ సీత అని చేవ్రాలు చేయడం, ఇదంతా అయోమయంగా తోచింది. సీత సుందరం జీవితంలో ఒక కలగా వచ్చి కలగానే మాయమయిన వ్యక్తి. ఆమెకూ తనకూ ఏనాడో తెగతెంపులు జరిగాయి. ఇప్పుడు ఆమె దగ్గర్నుంచి ఈ ఉత్తరం ఏమిటి ? సుందరానికి తన గతించిన మిలటరీ జీవితం స్మృతి పథంలో ఒక్కసారి మెరిసింది.

తను మిలిటరీ కొలువులో వుండగా ! పాటు పూనాలో ఉండవలసి వచ్చినది. ఒ వారం తనూ, తన మిత్రులు కొందరూ ఎలక్ట్రిక్ సామానులు తయారుచేసే ఒక ఫాక్టరీని చూడ్డానికి వెళ్ళారు. ఫాక్టరీ య ఆనందరావుగారు. పాపం మిలిటరీ కు ఎంతో కుతూహలపడి వచ్చారని ఆయన స్వ ఫాక్టరీనంతా వాళ్ళకు చూపించి, ఏఏ న్నలో ఏయే పనిముట్లు తయారుచేస్తా రించి చెప్పాడు. అఖరున అందరకూ టీ ఇచ్చి వారంతా కులాసాగా టీ త్రా ఉండగా వారు భారతదేశంలో ఏయేప్రాం చెందినవారో ఒక్కొక్కర్నీ అడిగి తెలుసు న్నాడు. సుందరం వంతు వచ్చేసరికి తను



ఇందుపల్లి సత్యవర్ధనరావు

ప్రాంతానికి చెందినవాడ నన్నాడు. ఆనందరావు గారి ముఖం ఒక్కసారి వికసించింది. 'మీరు తెలుగువారా ?' అని తెలుగులోనే అడిగేశాడు. 'ఆ? మీరూ తెలుగువారేనా ?' అని సుందరం ఆశ్చర్యంగా తెలుగులో అడిగాడు. 'ఎంతకాలానికి మళ్లీ ఒక తెలుగుముఖాన్ని చూశాను. మీరు మా యింటికి ఒకపర్యాయం దయచేయాలి' అని ఆనందరావుగారన్నారు. 'అలాగే నండి. వచ్చే ఆదివారం వస్తాను' అని సుందరం, తన స్నేహితులతోపాటు ఆనంద రావుగారివద్దనుంచి సెలవు పుచ్చుకున్నాడు.

మరుసటి ఆదివారం సుందరం ఆనందరావుగారింటికి వెళ్లాడు. అప్పుడే మొట్టమొదటిసారి సీతతో తనకు పరిచయం ఏర్పడింది. సీత ఆనంద రావుగారి ఏకైక సంతానం. ఆయనకున్న ఇరవై లక్షల రూపాయల ఆస్తికీ వారసురాలు. ఇరవై, ఇరవైరెండేండ్ల మిసిమియవ్వవపు ప్రాయంలో అప్సరసలాగుంటుంది. సుందరం ఆనందరావుగారింటికి తరచు వస్తూ పోతూ వుండడంలో వీరి మధ్య ఏర్పడిన పరిచయం కొస్త నెమ్మదిగా ప్రేమగా తయారయికూర్చుంది. ఆనందరావుగారిది గమనించకపోలేదు. కూతుర్ని మొదట్లో గారాబంగానే మందలిస్తూ వచ్చాడు. 'మిలటరీ వాడితోటి వ్యవహారమంటే జీవితంతో చెలగాటమే సుమా' అని హెచ్చరించాడు కూతుర్ని. 'వాడు ఇవాళ ఇక్కడ ఉంటాడు. రేపు రంగూనులో ఉంటాడు. ఎల్లుండి చచ్చాడని యింటికి చక్కా ఒక కబురు వెళుతుంది. అటువంటివాడితో జీవితం ముడిపెట్టుకోవడం అంటే ఏమిటో ఆలోచించుకో' అని చాలాదూరం చెప్పి చూశాడు.

సీతకు ఈ కబుర్లేమీ వచ్చలేదు. "మిలటరీ వాళ్లంతా పెండ్లిచేసుకోకుండా ఉన్నారా ?' అని సమర్థించుకొంది. తండ్రి పెండ్లికి ఒప్పుకొనేటట్టు లేడని తేలిపోయిన తరువాత ఒక మంచి రోజు చూచుకొని సీత సుందరాన్ని వెంటపెట్టుకొని రిజిస్ట్రారు ఆఫీసుకు వెళ్లి చట్టప్రకారం అతన్ని పెండ్లిచేసుకొంది.

తన సలహా లేకుండా, తండ్రి అయిన తన అనుమతికూడా పొందకుండా పూరగా పెరగా లని ఒక 'మిల్టరీ వెధవని' పెండ్లి చేసుకొన్నందుకు కూతుర్ని తన యింటికి రావద్దని కసరి కొట్టాడు ఆనంద రావుగారు. మరీ మంచిదనుకొంది సీత, అప్పట్లో

వెంటనే సుందరానికి ఢిల్లీ ట్రాన్సుఫరు వచ్చింది. భార్యను తీసుకొని వెళ్లాడు. ఢిల్లీ పిలి

టరీ క్వార్టర్సులో కాపురం పెట్టాడు. సీతకు తన పుట్టింటివద్ద బ్రతికిన బ్రతుక్కూ, సుందర రంతో కాపురంచేసే బ్రతుక్కూ ఎంతో వ్యత్యాసం కనుపించింది. సుందరం చాలా మంచి వాడే. గుణవంతుడు. ఏ దురభ్యాసాలూ లేవు. చివరకు సిగరెట్లయినా కాల్చడు. సీతంటే పంచ ప్రాణాలు. ఆమె మాట ఏ విషయంలోనూ జవ దాటడు. అంతటి అనుకూలుడైన భర్త లభించా డంటే అది తన అదృష్టమే అనుకొంది.

కాని, పరిస్థితులకు సరిపడినట్లుగా తన దృక్ప థాన్ని అలవర్చుకోలేకపోయింది. తన పుట్టింటివద్ద ఉన్న సౌఖ్యాలు సుందరంవద్ద ఎలా ఉంటాయి ? తను మునుపటిలాగా యిప్పుడు హాయిగా సాయం కాలంవేళ కారులో షికారుకు వెళ్లగలదా ? తను నిద్రలేచేసరికి రాజభోజనం అమర్చిపెట్టే నౌక ర్లేరి ? తను వందరూపాయలకు తక్కువ చీరె ఎప్పుడైనా కట్టి ఎరుగునా ? మరి ఇప్పుడో ? సుందరం మహా తెస్తే పాతిక రూపాయల చీరె మాత్రం తెస్తాడు. విసిరి అవతల పారేయ బుద్ధవుతుంది. 'ఎక్కడికక్కడే సరిపెట్టుకోవాలి. స్థితిగతులను బట్టి బ్రతకడం నేర్చుకోవాలి' అని సుందరం ఎంత బోధించినా అది ఆమెచేత కాలేదు. చివరకు ఒకసారి 'నిన్ను చేసుకోవడం నా ఖర్మ' అని కూడా అనేసింది. దానికి సుందరం చాలా నొచ్చుకున్నాడు. కానీ తనేమయినా తిరిగి అంటే ఆమె సుకుమార హృదయంలో గాయపడు తుందేమో అని ఊరుకొన్నాడు.

ఆమె ప్రొద్దెక్కి ఏడుగంటలకు గాని నిద్ర లేవదు. కాని సుందరం ఆరుగంటలకే పెరేడ్ గ్రవుండులో హాజరు కావాలి. అంచేతనే ఏ మూడు గంటలకో లేచి టీ కాచి ఆమెకు బెడ్ టీ యిచ్చి తను యూనిఫారమూ అదీ సరిచేసుకుని హడావుడిగా పెరేడ్‌కు వెళ్లేవాడు. ఆమెకు వంట చేతగాదు. ఎప్పుడైనా వండితే అది తినడానికి యోగ్యంగా ఉండదు. పాపం సుందరం మాత్రం ఎన్నాళ్లు సహించగలడు ? ఎప్పుడయినా 'ఆడదై పుట్టింతర్వాత కనీసం వంటచేయడం అయినా రాకపోతే ఎలా' అని అనేవాడు. అందుకు ఆమె భగ్గున మండి తాడి ప్రమాణం లేచేది. 'వంట చేయవలసిన ఖర్మ నా కేమీ పట్టలేదు. కావలిస్తే వొకర్నను పెట్టుకో' అని తిరస్కారంగా అనేది. 'నీవు శ్రీమంతులబిడ్డవయితే అది వేరే సంగతి. ప్రస్తుతం నీవు నా భార్య వన్న సంగతి గుర్తించు కొని మాట్లాడు' అనేవాడు సుందరం. ఇలా మన స్పర్థలు ప్రారంభం అయ్యాయి. సుందరానికి ఆమెతో సంసారం నరకప్రాయమే అయింది.

ఈ కలతలు ఇలా ఉండగానే వారి సంసా రంలో ఇంకో అవాంతరం వచ్చిపడింది. సీతకు దగ్గు, జ్వరం అని హాస్పిటలులో చేర్పిస్తే, కొన్నాళ్ళు గడిచినతరువాత డాక్టర్లు అది క్షయ అని నిర్ధారణ చేశారు. మిలిటరీ డాక్టర్లంటే అసా మాన్య మేధావులు. వారు హోరాహోరీని ఆ రోగంతో పోరాడారు. సుందరం తన జీతం అంతా వెచ్చించి ఆమెకు పళ్లూ వగైరాలు అవి ఎంత ఖరీదువైనా సరే తెచ్చి ఇస్తున్నాడు సీతపరిస్థితి మాత్రం ఏమీ మెరుగుపించడం లేదు. నానాటికి ఆమె ఆరోగ్యం మరీ అధ్వాన్నమయిపోతున్నది ఇక ఆమె జీవితం రోజుల్లోమాత్రమేనా అన్నట్టయింది. సుందరానికి ఏమీ తోచక వెంటనే ఆనందరావు గారికి టెలిగ్రాం ఇచ్చాడు. ఆయన వచ్చి కూతుర్ని చూచుకొని బావురుమన్నాడు. 'నీ స్థితి యింతవరకు వచ్చిందాకా నాకెందుకు తెలియ పర్చలేదు. తల్లీ' అని ఏడ్చాడు. సుందరంవైపు తిరిగి 'తుచ్ఛుడా, నా తల్లిని నీ పొట్టను పెట్టు కున్నావుగదరా, దరిద్రుడా' అని ఉరిమాడు. సుందరానికి ఆనందరావుగారిపై పట్టరాని కోపం వచ్చింది. కానీ అంతకోపమూ లోలోపలే దిగ మ్రింగి ఏమీ అనలేదు. సీత కలిపించుకొంది.

"పొరబడుతున్నావు నాన్నా. ఆయనన్నేమీ అనకు.

ఒక కవిగారు తనశక్తి సామర్థ్యాలనుగురించి చాటు కుంటూ ఉన్నాడు. పదిహేను మంది దాకా చుట్టూ చేరి ఓపి కగా వింటున్నారు.

"నేను శ్రీనాథుడు రాసి నంత గొప్ప కావ్యాలు కూడా వ్రాయగలను. వ్రాయగల నండి! బుద్ధిపుట్టాలే కాని"

వెనకనుంచి ఎవరో అతని మీద జాలిపడ్డారు. "అవును పాపం! అటువంటి బుద్ధిలేక పోయింది."

వి. శివరామయ్య (బాపట్ల)

నా కీజబ్బు ప్రవేశించినప్పట్నుంచీ పాపం, నిద్రా హారాలు మాని సతమతమవుతున్నారు."

"ఏడ్వలేక పోయాడూ దరిద్రుడు" అన్నాడు ఆనందరావుగారు.

ఆస్పత్రినుంచి కూతుర్ని విడుదల చేయించి తన ఇంటికి పూనా తీసుకువెళ్లడానికి పర్మిషన్ పొందాడు ఆనందరావుగారు. స్టేషనుకు వెళ్లేం దుకు టాక్సీ మాట్లాడుకురావడానికి ఆయన బయటికి వెళ్లాడు. సీత బెడ్‌వద్ద సుందరం ఒక్కడే ఉన్నాడు. సీత నెమ్మదిగా మాట్లాడింది.

"సుందర్, ఇక నేను అట్టేకాలం బ్రతకను. చూస్తున్నావుగా, రోజుల్లోనే ఉన్నాను. నా తప్పులు క్షమించు". సుందరం ఏదో చెప్పి అను కొన్నాడు గాని తన హృదయం బరువెక్కింది. తన నోటివెంట మాట రావడంలేదు.

సీత అతని తల నిమురుతూ అంది :

"నేను నిన్ను సుఖపెట్టలేకపోయాను. చాలా శ్రమపెట్టాను. పాపాత్మురాలిని. నీ జీవితంలోకి నేనొక పీడకలగా వచ్చాను. కలగానే మాయమై పోతాను. జరిగిపోయిందేమో జరిగిపోయింది. మళ్లీ నువ్వు పెండ్లిచేసుకొని సుఖంగా పదికాలాల పాటు జీవించు. నీ తాహతుకు తగినట్టిది, అను కూలవతి, అనురాగవతి, చక్కనిది అయిన పిల్లను చూచుకొని చేసుకో. ఇదే నా ఆఖరు కోరిక."

ఈ మాటలు అంటుంటే సుందరం జలజలా కన్నీళ్లు కార్చాడు.

"నువ్వు తప్పక మళ్లీ పెళ్లిచేసుకో. జీవితం వృధాచేసుకోకు. ఏదీ మళ్లీ పెళ్లిచేసుకుంటా నని నాచేతిలో చేయి వేయి" అని సీత తన చేయి చాచింది.

కేవలం ఆమెను సంతోషపర్చడానికే ఆమె చేతిలో చేయి ఉంచాడు.

"చట్టసంబంధమైన చిక్కులేవీ నిన్ను బాధించకుండా ఉండేందుకు ఇదిగో విడాకుల పత్రం" అని తన తలగడక్రింద దాచిఉన్న కాగితం తీసి మడిచి అతని జేబులో ఉంచింది.

"సీతా ! మనకు విడాకులా !" అని నెమ్మ దిగా అనగలిగాడు సుందరం.

"కాదు సుందర్. ఇది లోకం కోసం. నీ క్షేమం కోసం యిస్తున్నాను. ఉండనీ."

తర్వాత సీత తండ్రివెంట వెళ్లిపోయింది. ఆమె ఆరోగ్యం విషయం నాలుగైదు ఉత్తరాలు ఆనంద రావుగారికి వ్రాశాడు సుందరం. జవాబు రాలేదు.

*　　　*　　　*

యుద్ధం అయిపోయి ఇంటికి వచ్చిన సుంద రానికి విజయవాడలో ఒక మోటారుకారుల కంపెనీలో ఎంప్లాయిమెంటు ఎక్స్ఛేంజివారు ఉద్యోగం చూపించారు. జీతం నెలకు వంద రూపాయలు. తను ఒంటరిగా ఉన్నన్నాళ్లూ ఆ జీతం ఎక్కీతక్కీ. కానీ, యీమధ్య తను మళ్లీ పెండ్లి చేసుకొన్నాడు. ఒక కొడుకుకూడా కలి గాడు టవునులో వందరూపాయలు ఏమూలా. కాని, తనభార్య సుశీల లేదనకుండా సంసారం అలాగే నడుపుతూ ఉంది గుట్టుగా.

కథ ఇల్లా ఉండగా అకస్మాత్తుగా యీ ఉత్తరం వచ్చింది. సుందరం సీతను ఎప్పుడో మర్చిపోయాడు. అసలామె చచ్చిపోయిందనే అను కొన్నాడుగాని ఆమధ్య ఎప్పుడో వార్తాపత్రికల్లో చూశాడు. ఆనందరావుగారు తనకుమార్తెను చికిత్సనిమిత్తం స్విట్జర్లాండు తీసుకువెళ్లారనీ, అక్కడ ఆమెకు చెడిపోయిన వూపిరితిత్తి బదులు కృత్రిమ ఊపిరితిత్తి వేశారనీ, యిప్పు డామె సంపూర్ణ ఆరోగ్యవంతురాలనీ .... పోనీలే పాపం ఎలాగో బ్రతికిందిలే అనుకొన్నాడు. అంతే, ఆమె వెంటనే తన స్మృతిపథంనుంచి అదృశ్యమయింది.

తనకిప్పు డొక మధురాతి మధురమైన సంసార రము ఉంది. తన ప్రాణానికి ప్రాణమైన తన సుశీల, ముద్దులు కురిపించే తన కుమారుడు. తన కింకేం కావాలి. మరి యిప్పు డీఉత్తరం మాటే మిటి ? సీత ఎందుకు వస్తున్నట్టు ? కొంపతీసి సుశీలతో పూర్వవృత్తాంతం చెప్పదుకదా ? చెప్పితే సుశీల యేడుస్తుంది. తనభర్త కింకో భార్య ఉందంటే ఏ స్త్రీ సహిస్తుంది. అయినా

సీత తన యింటి కెందుకు వస్తుంది. ఏదో స్వాంతవని ఉండి విజయవాడ వస్తూవుంది. అంతే. మనసు కొంత సర్దుకున్నాడు.

మంగళవారం రానే వచ్చింది. రాత్రి మెయిలుకు ఆమెను స్టేషనులో కలుసుకోవాలి అని అనుకొంటూ ఉండగా కంపెనీయజమాని తన్ను అర్జంటుగా రాజమండ్రిలో ఆయన్ను కలుసుకోవలసినదిగా టెలిగ్రాం యిచ్చాడు. సుందరంకు రాజమండ్రి వెళ్లక తప్పిందికాదు. అక్కడ యజమాని కొన్ని లారీలు కొంటున్నాడు. వాటిని తను పరీక్షించాలి. ఆపని పూర్తిచేసుకొనేసరికి మూడు రోజులు అయింది. ఈ మూడ్రోజులూ అతనికి మనసులో మనసు లేదు. సీత విజయవాడ వచ్చే ఉంటుంది. తను స్టేషనులో లేకపోయేసరికి పాపం ఏమనుకొందో. ఎంత యిబ్బంది పడిందో. ఇల్లు తెలుసుకొని అక్కడకుగాని వెళ్లి ఉంటుందేమో అని ఒక భయం. నాలుగోరోజు రాజమండ్రినుంచి బెజవాడ సరాసరి కంపెనీకి వచ్చేసరికి ఎవరో తన కోసం నవభారత్ హోటలులో మకాంవేసి ఉన్నారనీ, తను ఎప్పుడు వస్తే అప్పుడు అక్కడకు వచ్చి వారిని కలుసుకోవలసిందనీ చెప్పారు సుందరం నవభారత్ హోటలుకు వెళ్లాడు

గదిలో ఒంటరిగా కుర్చీలో కూర్చున్న సీత సుందరం రావడంతోటే లేచి నిల్చుంది. ఆ కుర్చీలో సుందరం కూర్చొన్నాడు. రెండు మూడు నిముషాల వరకూ ఎవ్వరూ మాట్లాడలేదు.

ముందుగా సీత మాట్లాడింది

'చిక్కిపోయావు సుందర్. ఆరోగ్యం సరిగా ఉండటంలేదా ?'

'ఏమీలేదు చాలాదూరం ప్రయాణం చేసి యిప్పుడే రైలు దిగాను. బడలికవల్ల అలా కనిపిస్తున్నానేమో.'

'నేను వ్రాసిన ఉత్తరం అందిందా ?'

'అందింది. నీ కోసం స్టేషనుకు రావాలనుకొంటూ ఉండగా ......'

'మీ కంపెనీవాళ్లు చెప్పారులే.'

మళ్లీ రెండు నిమిషాలు మౌనం.

'సుందర్. నేను చచ్చిపోయాననుకున్నావు కదూ ?' సీత అడిగింది.

'మొదట్లో అలాగే అనుకొన్నాను. తర్వాత పత్రికల్లో చూశాను నీ స్విట్జర్లాండు ట్రీట్‌మెంట్ విషయం. ఎలాగో బ్రతికి బయటపడ్డావని ఆనందించాను. అన్నట్టు— ఇప్పుడు ఆ చిప్పు లేవుకదా ?'

'లేవు. ఇప్పుడు ఒంట్లో చాలా బాగుంది.'

'మునుపటి కంటె కూడా యిప్పుడే చాలా బాగున్నావు. మరి మీ నాన్నగారు క్షేమమా ?'

'క్షేమమే. ఈ మధ్యే కొంచెం సుస్తీపడ్డారు.'

'ఇప్పుడు విజయవాడవచ్చిన పని ....''

'వచ్చిన పనా ? నా యింటికి నేను వచ్చేశాను.'

'నీ ఇల్లా.'

'అవును. నా భర్త ఇల్లు నాదికాదూ ? నే నిక శాశ్వతంగా నా భర్త దగ్గర ఉండిపోవడానికి వచ్చాను.'

సుందరానికి ఆశ్చర్యం వేసింది.

'నీ భర్తా ?'

'అవును సుందర్. ఏమి టలా కంగారుగా చూస్తావు. నేను నీ దగ్గరే ఉండిపోవడానికి వచ్చాను.'

సుందరానికి ప్రపంచం యావత్తూ గిర్రున తిరుగుతున్నట్లయింది. 'సీతా, నాతో పరిహాస మాడుతున్నావుకదూ. పేదవాళ్లంటే తిరస్కార భావం నీ కింకా పోలేదు'

సీత కళ్ళు చెమర్చాయి. ఆమె గద్గదస్వరంతో అంది.

'సుందర్, నాతప్పు క్షమించు. అప్పుడు కేవలం చిన్నతనంచేత, నా ఐశ్వర్యం చూచి నిన్ను చులకనగా చూశాను. కాని నీవు దగ్గర లేనిదే సమస్త ఐశ్వర్యమూ వ్యర్థంగా కనుపిస్తుంది యిప్పుడు. నన్ను క్షమించి స్వీకరించు'

సుందరం మౌనంగా ఉన్నాడు

'ఏమిటీ ఆలోచిస్తున్నావు ?'

'నేను తిరిగి పెండ్లిచేసుకోకుండా ఉంటే బావుండును. నీ కోర్కెప్రకారం మళ్ళీ నేను వివాహం చేసుకొన్నాను. ఒక కుమారుడు కూడా కలిగాడు. ఇట్టి స్థితిలో ......'

'నువ్వంటున్నది నా కర్థమైంది సుందర్. మీ భార్యాభర్తల మధ్య నేను అడ్డుగా నిలువను. కేవలం నీ భార్యగా నీ చెంత బ్రతకనీయమని కోరుతున్నాను. అంతే'

'నా కిదివరకే ఒక పెళ్లయిందన్న సంగతి నా సుశీలకు తెలియదు. ఇప్పుడు తెలిస్తే ....'

'ఏం తెలిస్తే. ఆమెకు నాయందు ఎట్టి ఈర్ష్య లేకుండా నేను చూచుకొంటానుగా.'

'వద్దు సీతా వద్దు. నా సుశీల వట్టి అమాయకురాలు నా ప్రేమానురాగాలకు యింకొకరు భాగస్వాములని ఆమెకు తెలియడం నే నెంతమాత్రమూ ఒప్పుకోను. ఇది ఆమెకు దుఃఖకారణం. నన్ను క్షమించు సీతా.'

'సుందర్. నేను నీ భార్యను కానా. నీ ప్రేమానురాగాలకు నేను నోచుకోలేదా ?'

సుందరం మాట్లాడలేదు.

సీత అతని పాదాలవద్ద కూర్చొని ప్రాధేయపూర్వకంగా అర్థించింది.

'భర్త తిరస్కరిస్తే ఆ స్త్రీకి లోకంలో మరి చోటెక్కడుంటుంది సుందర్. నన్నూ, నా ధనమును స్వీకరించు. నువ్వింక యీ గడచిగడవని పేదరికపు జీవితంతో యాతన పడక్కరలేదు.'

'నువ్వు పొరబడుతున్నావు సీతా. ఎక్కణ్ణుంచో కొన్ని లక్షలు వచ్చి పడుతున్నాయని నన్ను నమ్మిన నా భార్యను నొప్పించలేను. లోకంలోని యావత్తు ఐశ్వర్యంకంటె ఆమే నాకు విలువైంది.'

'సుందర్ నేనంటే ఎంత ప్రేమగా ఉండేవాడివి. ఇంత కాఠిన్యం నాయెడల నీకు రావచ్చా. పోనీలే - ఇది నీకు ధర్మమా ?'

సుందరం మాట్లాడలేదు.

సుందరం తిరిగి యింటికి వచ్చేశాడు. కంపెనీకి వెళ్తున్నాడు. వస్తున్నాడు.

ఒక సాయంత్రం సుందరం మామూలుగా యింటికి వచ్చేసరికి మాసిపోయిన చీరెతో, అతుకుల రవికెతో పిక్కాటూ ఒక దాసీదాని వేషంలో సీత తన యింటి ఆవరణలో ప్రత్యక్షమైంది. ఆ ప్రక్కను సుశీల మంచంమీద కూర్చొని ఉంది. ఈ సన్నివేశం చూచి సుందరానికి మూర్ఛవచ్చినంత పనయింది. మతిపోయినవాడిలాగా విత్తరి చూపులు చూస్తున్న సుందరంతో సుశీల అన్నది:

"ఏమిటలా చూస్తారు. ఈ అమ్మాయిది ప్రక్క పల్లెటూరట. పనిమనిషి దొరకకుండేమోనని బస్తీకి వచ్చిందట ముప్పొద్దులా యిన్ని కారం కొట్టించుకున్నాను."

"ఓహో" అనగలిగాడు సుందరం.

"మరేం చెయ్యనూ ? వారం రోజులనుండి మీతో మొత్తుకుంటూనే ఉన్నాను కారం కొట్టి పెట్టడానికి ఎవర్నన్నా చూడమని. మీరా చూడరాయె. నేనా ఈ లేవలేనిస్థితిలో స్వయంగా కొట్టుకోలేకపోతిని. పాపం, యీ అమ్మాయి సమయానికి రాకపోతే ఎంత యిబ్బంది పడేవాళ్లం ?" సుశీల చెప్పుకుపోతున్నది. సుందరానికి యిదంతా అయోమయంగా ఉంది. సుశీల సీతవేపు తిరిగి.

"ఇదిగో అమ్మాయ్. రేపొకసారి వస్తావా ? ఇల్లు బాగా మాసివుంది. కాస్త కడిగి పెడుదువుగాని. ఇల్లు చిన్నదే. చూశావుగా. నాల్గు గిన్నెలు కూడా పట్టవు. ఏ మివ్వమంటావు ?" అన్నది.

"మీ దయవచ్చినంత యివ్వండమ్మా" సీత అన్నది.

"సరే. రేపు ప్రొద్దున్న రా."

"ఇప్పటికే సాయంకాలమయింది. ప్రొద్దు కూకేలోగా మా పల్లెకు పోలేను. బస్తీముఖం ఎన్నడూ ఎరగనిదాన్ని. ఈ మహాపట్నంలో ఎక్కడ ఉండను ? ఒక చాపముక్క యిస్తే యిక్కడే మీ వాకిట్లోనే పడుకొని తెల్లారి మీ పని చేసి వెళ్తాను" సీత అన్నది

సుశీల అంగీకరించింది.

ఇంతలో ఆనంద్ పలక చేత్తోపట్టుకొని వచ్చాడు. ఆనంద్ నాలుగేండ్లవాడు. సుందరం సుశీలల ముద్దుబిడ్డ. సుశీల వానిని చూడగానే "మధ్యాహ్నమేకదరా స్నానం చేయించి బడికి పంపాను. ఇంతలోనే యింత దుమ్ము కొట్టుకొని వచ్చావా ? అస్తమానమూ నీకు స్నానం చేయించే ఓపిక నాకు లేదు" అంటూ కసురుకొంది

సీత కల్పించుకొంది.

"కోప్పడకండమ్మా బాబును. నేను స్నానం చేయిస్తాను. రా బాబు రా. స్నానం చేద్దువుగాని. సబ్బుబిళ్ల యిప్పించండమ్మా."

"కిటికీలో ఉంది తీసుకోమ్మా. పాపం నీకు శ్రమయిస్తున్నాను."

సీత ఆనంద్‌కు స్నానం చేయించి, ఉతికిన బట్టలు వేసి, తల దువ్వి చక్కా పౌడరు ముఖానికి అద్దింది. పిల్లవా డావేళ దంపతులకు ఎంతో ముద్దువచ్చాడు.

ఆ రాత్రి సీత అక్కడే భోజనం చేసి వాకిట్లో పడుకొంది తెల్లారుజామున లేచి అంట్లు బయటేసి శుభ్రంగా తోమి, యిల్లూ, వాకిలీ ఊడ్చి పొయిరాజేసి, కాఫీకి నీళ్ళు పెట్టి సుశీల మంచం దగ్గరకు వచ్చింది. సుశీల అప్పుడే నిద్ర లేచింది. సీత అన్నది :

"అమ్మగారూ ! కాఫీ డబ్బా, పంచదారా ఎక్క

(43 వ పేజీ చూడుడు)



# జూల్స్ వెర్న్ నవల
# 80 రోజులలో భూప్రదక్షిణం

పాస్పార్టుతో కలిపి మొత్తం ముగ్గురు ప్రయాణీకులు గల్లంతయిపోయినట్లు తేలింది. ఈ ముగ్గురూ ఏమై వుంటారు. కొట్లాటలో చనిపోయి వుంటారా? లేకపోతే సియోలు వీళ్ళని బందీలుగా పట్టి తీసుకుపోయారా? అదా తేలడం కష్టమే

యుద్ధంలో గాయపడ్డవారు చాలమంది ఉన్నారు. అయితే మరీ ప్రాణానికి ముప్పువాటిల్లే టంతగా దెబ్బతిన్నవారెవరూ లేరు. అందరికన్న తీవ్రంగా గాయపడ్డవాడు కర్నల్ ప్రాక్టర్. ధాటీగా ధైర్యంగా పోరాడాడు. చివరకి గజ్జలలో గుండు దెబ్బతిని కూలిపోయాడు. అతనినీ, దాదాపు అంతగా గాయపడినవారినీ, వెంటనే చికిత్స చేయడం కోసం స్టేషనుకు మోసుకు తీసుకు వెళ్ళారు.

అయూడాకు గాయాలేవీ తగలలేదు. ఆమె క్షేమంగానేఉంది. ఒళ్ళు దాచుకోకుండా, ప్రాణాన్ని ఖాతరుచెయ్యకుండా ముందంజవేసి పోరాడిన ఫిలియాస్‌ఫాగ్ కూడా గాయపడలేదు. చెక్కు చెదరకుండా నిలిచాడు. ఫిక్స్‌కు చేతిమీద గాయం అయిందికాని, ఏమంత పెద్దదికాదు. పాస్పార్టు మాత్రం వత్తాలేకుండా పోయాడు. ఉన్నాడో లేడోకూడా తెలియదు. అతన్ని తలుచుకుని అయూడా కంటతడిపెట్టింది. ప్రయాణీకులంతా రైలు దిగారు. రైలుచక్రాలన్నీ, రక్తసిక్తంగా భీకరంగా ఉన్నాయి. ఇరుసులకీ, కమ్మీలకీ తెగిన కాళ్లూ చేతులూ మాంసఖండాలూ వ్రేలాడుతున్నాయి తెల్లటి ఆ మైదానంలో రైలు మార్గం పొడుగునా కనుచూపు మేర "రక్తపథం" కళ్ళు చెదిరేలా గుండెలదిరేలా కనిపిస్తోంది. దూరంగా, అడవులలోకి మాయమౌతున్న ఇండియన్‌లు లీలగా కనిపిస్తున్నారు.

అచలుడు ఫిలియాస్‌ఫాగ్ చేతులు కట్టుకుని, శిలాప్రతిమలా నిలబడిపోయాడు. అచలుడై విలచినా, నిశ్చలంగా కనుపించినా అతను తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. కొద్ది క్షణాలలో కర్తవ్యం ఆలోచించి. పెద్ద నిర్ణయం చెయ్యవలసిఉంది. అయూడాపక్కన నిలబడి రెప్పలార్పకుండా, మాటలాడకుండా, అతనివేపే చూస్తోంది. ఫాగ్ ఆమెకేసి చూశాడు. ఆ చూపుల తాత్పర్యం అతనికి అవగతమైంది. తన నౌకరు బందీ అయితే, అతనిని ఇండియన్‌ల బారినుండి విడిపించడం తన

## ఎస్. పార్థసారథి

ధర్మంకాదా? అందుకోసం అతడు తన సర్వస్వం అర్పించడం అవసరంకాదా?

"అతనిని వెతికి పట్టుకుంటాను—సజీవుడుగా ఉన్నా, చనిపోయినా జాడ కనుక్కుతీరుతాను" అన్నాడు ఫాగ్ ముక్తసరిగా.

"అయ్యయ్యో!" అంటూ అయూడా ఒక్కసారిగా ఫాగ్‌చేతులలో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. ఆమె కన్నీటితో అతని చేతులు తడిసిపోయాయి.

"ఇంకొక్క నిముషంకూడా ఆలస్యం చెయ్యకుండా వెళ్తే ప్రాణాలతోనే మనకి దక్కవచ్చు" అన్నాడు ఫాగ్.

ఈ ఒక్క ముక్కలో—ఈ నిర్ణయంతో ఫిలియాస్‌ఫాగ్ సర్వస్వం త్యాగంచేసివేశాడు. అక్షరాలా సర్వనాశనానికి, అపజయానికి నాంది పలికాడు. ఇప్పుడు ఒక్కరోజు ఆలస్యం అయినా చాలు—న్యూయార్కులో ఓడ తప్పిపోతుంది. అదిపోతే ఇంక అతడు పందెం గెలుచుకోవడం కల్ల. అంతా పోయినట్టే. అయినా సరే. "ఇది నాకు విధాయకం" అని తీర్మానించుకున్నాడు.

ఫోర్టుకియర్నీలో సైనికదళం అధిపతి దగ్గరలోనే కనిపించాడు. సైనికులు దాదాపు వందమంది, యుద్ధసన్నద్ధులై ఆ యా స్థలాలలో నిల్చున్నారు. ఇండియన్‌లు తిరిగి దండెత్తివస్తే ఎదుర్కొనడానికి కోటని రక్షించుకొనడానికి సిద్ధంగా ఉన్నారు.

ఫిలియాస్‌ఫాగ్, కెప్టెన్‌దగ్గరకు వెళ్ళాడు. "ముగ్గురు ప్రయాణీకులు మాయమైపోయారు" అన్నాడు.

"చనిపోయారా?"

"తెలీదు. చనిపోయారో, బందీలుగా పోయారో తెలీదు. అదే తేలాలి. మీ రేం చెయ్యదలచుకున్నారు. ఇండియన్‌లని వెంటతరుముతారా?"

"ఇది చాల గడ్డుసమస్య. ఇండియన్‌లు ఆర్కాన్సాస్ దాటికూడా పోవచ్చును వాళ్ళవెంటబడిపోయి, ఇటు ఈ కోటని కాపు లేకుండా వదలడం నావల్లకాదు" అన్నాడు కెప్టెన్.

"ముగ్గురు మనుషుల నిండుప్రాణాలు అతదలో ఉన్నాయిగదా?"

"నిజమే. కాని ముగ్గురికోసం యాభైమంది ప్రాణాలను ఒడ్డడం ఎలా వీలవుతుంది చెప్పండి?"

"అయ్యా వీలూ సాలూ నాకు తెలియవు. కాని ఆ పరిస్థితినిబట్టి ఒడ్డడం మీకు విధాయకం."

"నాకు విధాయకం ఏదో, ధర్మం ఏదో చెప్పే అధికారం ఇక్కడెవరికీ లేదు" అన్నాడు కెప్టెన్ కోపంగా.

"సరే. అలాగే కానివ్వండి. నేను ఒక్కడినే వెళ్తాను" అన్నాడు ఫిలియాస్‌ఫాగ్.

ఫిక్స్ పరుగున వచ్చాడు. "మీరా! మీరు ఒక్కరూ ఆ దండుని వెంటాడతారా" అన్నాడు కంగారుగా.

"కాకపోతే? మన అందరి ప్రాణాలూ కాపాడడానికి తన ప్రాణం ఒడ్డిన వాడిని చస్తే చావనిమ్మని వదిలేసి వూరుకోనా?"

**హఠాత్తుగా కెప్టెన్ బెట్టు సడలిపోయింది.** "అక్కర్లేదు. మీరు ఒంటరిగా వెళ్ళనక్కరలేదు మీది చాలా దిటవైన గుండె. సాహసులు" అన్నాడు. వెంటనే తన సైనికులకేసి తిరిగి "30 మంది వాలంటీర్లు కావాలి" అని కేకవేశాడు.

ఒక్కసారిగా ఉన్న వందమందీ ముందుకువచ్చారు కెప్టెన్ వారిలోంచి 30 మందిని ఎన్నిక చేశాడు కొంచెం పెద్దకారు సర్జెంటును నాయకుడుగా వేశాడు.

"థాంక్స్ కెప్టెన్" అన్నాడు ఫాగ్.

"నేను కూడా మీతో రావచ్చునా?" అన్నాడు డిటెక్టివ్ ఫిక్స్.

"మీ యిష్టం. కాని, నాకు చిన్న ఉపకారం కావాలి అభ్యంతరం లేకపోతే, మీరు ఇక్కడే ఆయూ దాకు తోడుగా ఉండండి. ఒక వేళ నాకు ఏదైనా ఆపద వాటిల్లి—"

ఫిక్స్ తెల్లబోయాడు. ఇంతకాలం ఇంతదూరం నానా అవస్థలూపడి వెంబడించి కనిపెట్టుకుని ఉన్నాక, ఇప్పుడు ఇతగాడిని వదలిపెట్టడం ఎలాగ? ప్రాణం ఉసూరుమనిపించింది. ఎడారిలో వదిలితే ఎటుపోతాడో. ఫిక్స్ తలఎత్తి ఫిలియాస్ ఫాగ్ ముఖంలోకి, కళ్ళలోకి చూశాడు; చూడలేకపోయాడు. కల్లా కపటం లేకుండా సూటిగా తేటగాఉన్న ఆ కళ్ళను, ఆ చూపును క్షణంకన్న ఎక్కువసేపు పరీక్షించలేకపోయాడు. లోలోపల ఇంకా సందేహాలు ఏమున్నా, లేకపోయినా "సరే ఉంటాను" అనేశాడు.

ఇంకో క్షణం తరవాత ఫిలియాస్ ఫాగ్ అయూదా హస్తాలను మృదువుగా అదిమి ధైర్యం చెప్పి, 'విలువైన' తన తివాచీగుడ్డ సంచిని ఆమెకు ఒప్ప గించి సైనికబృందంతో కలసి బయులుదేరాడు పాస్పార్తును వెదకడానికి.

బయులుదేరేముందు సైనికులకు ఒక చిన్న హెచ్చరిక చెప్పాడు—"ఖైదీలను రక్షించి తీసుకు రాగలిగితే మీకు ఐదువేల డాలర్ల బహుమతి" అని.

పన్నెండు గంటలు దాటి కొద్ది నిముషాలు అయింది.

అయూదా, స్టేషనులోకివెళ్ళి విశ్రాంతి గదిలో కూర్చుంది — ఫిలియాస్ ఫాగ్ గురించి ఆలోచిస్తూ. అతని ఔదార్యం — దానికి తగ్గట్టు ఎక్కడా ఆడం బరం ఆర్భాటం లేకపోవడం—అతని ధైర్య శౌర్యాలు—త్యాగనిరతి ఆమెను ముగ్ధురాలిని చేశాయి. విధ్యుక్త ధర్మం పేరిట అతడు తన ఆస్తి సర్వస్వాన్ని ధారపోస్తున్నాడు. ఇప్పుడు ప్రాణాన్ని కూడా అర్పించ డానికి ఉద్యమించాడు. తటపటాయించకుండా మనసారా ఈ పని చేస్తున్నాడు. ఫాగ్ నిజంగా పురుషోత్తముడు అనుకుంది అయూదా.

డిటెక్టివ్ ఫిక్స్ ఆలోచనలు ఇంత ఉదాత్తంగా ఉన్నాయని చెప్పడానికి వీలులేదు. అతని ధోరణి వేరుగా ఉంది. ఫాగ్‌ముఖంచూసి ఒక్క క్షణం సేపు ముగ్ధుడై, మూఢుడై అతనిని వదలి పెట్టాడు. ఇప్పుడు ఆ బుద్ధితక్కువ పనికి నాలిక్క రచుకుంటూ ప్లాట్‌ఫారం పొడుగునా పచార్లు చేస్తున్నాడు. ఖండాలూ, అఖండ సముద్రాలూ దాటి వెంబడిస్తూవచ్చి, తీరా ఇక్కడ తన బందీని వదలుకున్నాడు. తన మంచితనం తనను వంచించి బుద్ధిని గడ్డికరిపించింది. అతనిమీద అతనికే కొప్పురావంత కోపం వచ్చింది. దొంగ చేతిలో టోకరా తిన్న పోలీసును, పై అధికారి చివాట్లుపెట్టి నట్టుగా తనను తనే తిట్టి పోసుకున్నాడు.

"పాస్పార్తు వీడికి (ఫాగ్‌కు) చెప్తేవుంటాడు నే నెవరినో. ఇపుడు వీడు తప్పించుకున్నాడు. ఇంక రాడు. ఎన్నటికీరాడు. అరెస్టు చెయ్యడానికి జేబులో వారంటు పెట్టుకుని చూస్తూ చూస్తూ వదలి పెట్టాను. ఎంత బుద్ధితక్కువవాని. నేను ఉట్టి గాడిదని" అని పరిపరివిధాల ఆడిపోసుకున్నాడు.

గంటలు జరిగిపోతున్నకొద్దీ డిటెక్టివ్ ఫిక్స్ గాభరా పెరిగిపోతూంది. ఏం చేయాలో పాలు పోవటంలేదు. అసలు సంగతి అంతా అయూదాకు చెప్పివేస్తే బాగుండు ననుకున్నాడు. కాని అది ఇంకా తెలివితక్కువ తనం. ఆమె నమ్మదు మండిపడు తుంది....మరి ఏం చెయ్యాలి? సముద్రంలా అంతూ దరీ తెలీకుండాఉన్న ఈ బయళ్ళ కడ్డపడి పరు గెత్తి ఫాగ్‌ను వెతికితే? వెళ్ళిన ఈ దండు అడుగు జాడలు మంచుమీద ఇంకా బాగానే కనిపిస్తు న్నాయి. కాని కొంతసేపటికి ఇంకా మంచుకురిస్తే ఇవన్నీ పూడిపోతాయి. దారి కనబడదు.

ఫిక్స్‌కు ప్రాణం చాలొచ్చింది. వీళ్ళని వీళ్ళ దారిన వదలి తనదారిన తాను పోవాలనిపించింది. పోవడానికి వసతి కూడా మాటలో తటస్థపడింది.

మధ్యాహ్నం రెండుగంటలవేళ, తూర్పు దిశ నుండి ఇంజను కూతలాటిది వినబడింది. దట్టంగా కురుస్తున్న మంచుతెరమీద సుదూరంలో కాంతి పుంజం ఒకటి ఉదయించింది. దాని వెనుకనే పెద్ద నీడలాటిది నిలచింది. అద్భుతమైన ఆ సన్నివేశం కియర్నీవేపే వస్తున్నట్టు కనబడింది. తూర్పు నించి బండి వస్తుందని ఎవరూ అనుకోవటంలేదు. టెలిగ్రాఫుద్వారా కబురు వెళ్ళినా, రైలు ఇంత లోనే రావడం సాధ్యం"కాదు. ఒమాహానించి శాన్ ఫ్రాన్సిస్కో పోయేబండి, మర్నాటి వరకూ రాదు. మరి ఇదేమిటైనట్టు?

కొద్ది నిమిషాలలోనే సంగతి తెలిసింది. ధాటీగా కూత కూస్తూ, నెమ్మదిగా వస్తున్న ఆ యింజను, ఇంతక్రితం ఇక్కడి రైలును వదలిపోయినదే అందులో ఇంజనీరు, ఫైర్మన్ స్పృహతప్పి పడిపోయినందువల్ల దానిని ఆపడం జరుగలేదు విపరీతమైన వేగంతో అది ముందుకు సాగిపోయింది. అలా ఆవిరిదమ్ము చాలినంతవరకూ కొన్ని మైళ్ళ దూరం పరుగెత్తింది. చివరకి ఇంజనులో మంట చల్లారిపోయింది. ఆవిరి సన్న గిలింది. క్రమంగా వేగం తగ్గింది. ఒక గంట తరవాత, కియర్నీ, స్టేషనుకు 20 మైళ్ళ దూరంలో ఆ ఇంజను ఆగిపోయింది.

ఇంజనీరూ, ఫైర్మన్ మరికొంతసేపటికి కోలుకున్నారు. ఇంజను ఆగడం, ఆ వెనక రైలు లేకపోవడం చూడగానే ఇంజనీరుకు జరిగిన కథ బోధపడింది ఎలా జరిగిందో తెలియకపోయినా, మొత్తానికి రైలు వెనకబడిందని ఆపదలోఉండి ఉండవచ్చుననీ తోచింది తను తిన్నగా ఒమాహాకి వెళ్ళి తిరుగురైలు తీసుకురావడం మంచి పద్ధతి. అలాకాక, వెనక్కి వెళ్ళడం ప్రమాదాన్ని వెతుక్కు వెళ్ళడమే. బహుశా ఇండియన్‌లు ఆ రైలును ముట్టడించి దోచుకుంటూ ఉంటారు. ఏమైనా, తిన్నగా రైలు దగ్గరకు పోవడమే కర్తవ్యం అనితోచింది. వెంటనే ఇంజనులో బొగ్గుకర్రలు వేశాడు. ఆవిరి పుంజుకోగానే వెనక్కి బయులుదేరి కియర్నీ స్టేషనుకు వచ్చాడు

ఇంజను చూడగానే ఇంజనీరు దానిని రైలుకు తగిలించగానే ప్రయాణికులందరికీ ప్రాణంలేచి వచ్చినట్టయింది.

అయూదా తిన్నగా రైలు కండక్టరు దగ్గరకు వెళ్ళి, "రైలు బయల్దేరబోతుందా?" అంది.

"అవునమ్మా. తక్షణం బయల్దేరుతున్నాం."

"మరి ఆ బందీలుగా పోయిన వాళ్ళ సంగతో. వాళ్ళ గతేమిటి?"

"అబ్బే. ఇంక ఆపడానికి వీలులేదు. ఇప్పటికే బండి మూడు గంటలు ఆలస్యంగా నడుస్తోంది" అన్నాడు కండక్టరు.

"శాన్ ఫ్రాన్సిస్కోనుంచి, తరవాతి బండి ఎప్పు డొస్తుంది?"

### జరిగిన కథ

80 రోజులలో భూప్రదక్షిణం సాధ్యమని 20 వేల పౌన్లు పందెంవేసి సేవకుడు పాస్పార్తుతో బయులుదేరు తాడు ఫిలియాస్ ఫాగ్. బాంకు దొంగ ఫాగ్ దొరికాడని, అరెస్టుకు బొంబా యికి వారంటు పంపమనీ లండన్‌కు టెలిగ్రామ్ పంపి, ఫాగ్ వెంట సూయజునుంచి బొంబాయికి చేర తాడు డిటెక్టివ్ ఫిక్స్. కాని వారంటు చేరలేదు. బొంబాయినుంచి కలకత్తాకు రైలుబండిలో ప్రయాణం అవుతాడు ఫాగ్. దారిలో అయూదాను రక్షించి ఆమెతో కల కత్తా చేరుకొంటాడు. అక్కడ వారిని నిలపడానికిఫిక్స్ చేసిన యత్నం నిఫలమైంది. ఫాగ్ ప్రభృతులు 'రంగూన్' ఓడలో పయనం ప్రారం భించారు. ఆ ఓడలోనే ఉన్నాడు ఫిక్స్. ఫాగ్ ను అరెస్టుచేయడానికి తోడ్పాటు సేకరించాలని పాస్పార్తును చేరదీశాడు. కాని అంతు చిక్కలేదు. లండన్‌విడి దినలెగరోజులకు హాంకాంగ్ చేరుకొని, అయూదాతో యొకహామా ప్రయాణమవుతాడు. కాని ఆఓడ తప్పి పోయింది. దానిని షాంగ్‌హైలో అందుకునేందుకు ఫాగ్ ఒక పడవను కుదుర్చుకొని బయులుదేరాడు. పాస్పార్తూ 'కర్నాటిక్'లో అంతకు మును పేఎక్కి యొకహామా వెడతాడు. ఫాగ్, అయూదా సురక్షితంగాయొక హామాచేరుతారు. అక్కడ వారికి పాస్పార్తూ కనిపిస్తాడు. ముగ్గురు శాన్ ఫ్రాన్సిస్కోకు బయులుదేరుతారు. ముగ్గురుశాన్‌ఫ్రాన్సిస్కోకు వడతారు. అక్కడనుంచి వారు న్యూయార్కు పోతూ, అగ్డెన్ సందర్శించి ప్రయాణం ప్రారంభిస్తారు. దారిలో వారి రైలును రెడ్ ఇండియన్‌లు ముట్టడిస్తారు. ఈ గోలలో పాస్పార్తూ మాయమౌతాడు.

# 80 రోజులలో భూ ప్రదక్షిణం

"రేపు సాయంకాలం"

"రేపు సాయంత్రమా......అబ్బే. కుదరదు. చాలా ఆలస్యం అవుతోంది. మనం కాస్త ఆగాలి" అంది అయూదా.

"లాభం లేదండి. ఆగడం కుదరదు. రాదలుచుకుంటే మీరు వెంటనే బండి ఎక్కండి"

"నేను రాను" అంది అయూదా.

ఫిక్స్ ఈ సంభాషణ వింటూ నిల్చున్నాడు. కొంచెంసేపుక్రితం ఇక్కడనుండిపోయేందుకు దారి వసతి లేదని బాధపడ్డాడు. దొరికితే వెళ్ళిపోదామనుకున్నాడు. తీరా ఇప్పుడు రైలు సిద్ధంగాఉంది. పొదలచుకుంటే, ఎక్కి కూర్చోవడమే తరువాయి. అయినా ఎందుకో అడుగుతీసి అడుగువెయ్యబుద్ధికావటంలేదు. ఏదో తనకే తెలియని శక్తి అతన్ని అక్కడ కుదేసినట్టుంది. అలాగని ప్లాటుఫారంమీద ఉండబుద్ధికావటంలేదు. అయినా వదలిపోబుద్ధి కావటమూలేదు. ఈ సంఘర్షణతో ఫిక్స్ చాలా సేపు మథనపడ్డాడు. ఇంతదూరం వచ్చినా అనుకున్న పని కాకపోవడంతో క్షోభ దుర్భరంగా ఉంది....ఏమైనాసరే ఇది కడతేరా చూడవలసిందే.

చివరికి ఫిక్స్ కూడా దిగబడిపోయాడు.

కొన్ని గంటలు గడిచాయి. గాలి రివ్వున వీస్తోంది. చలి రంపంలా కోస్తోంది. ఫిక్స్ ఒక బెంచిమీద గడ్డకట్టిపోయినట్టు కూర్చున్నాడు. చూసేవారికి కునుకుతీస్తున్నాడేమో అనిపించేలా కళ్ళు మూసుకూర్చున్నాడు.

అయూదా అంత స్థిమితంగాలేదు. గాలి హోరుమని వీస్తున్నా, నిముషనిముషానికి గదివదలి ఇవతలకి వస్తుంది. ప్లాట్‌ఫారం చివరిదాకావెళ్ళి దూరానికి చూపు సారించి ఫాగ్‌బృందంకోసం ఎదురు తెన్నులు చూస్తూ నిలబడుతూంది. మంచుతెరలను ఛేదించి వెతుకుతున్నాయి ఆమె చూపులు. నన్నటి అడుగుల సవ్వడికోసం రిక్కించుకున్నాయి చెవులు. కాని ఏమీ కనబడలేదు. ఏదీ వినబడదు. చలికి కొయ్యబారిపోతుంది దేహం. ఉండలేక లోపలికి పరిగెడుతుంది అయూదా. మళ్ళీ ఒక్క నిముషంలో ఇవతలికి పరుగెత్తుకు వస్తుంది.

సాయంకాలం అయింది. ఫాగ్ బృందం ఇంకా తిరిగి రాలేదు. ఎక్కడున్నట్టూ? ఏమైనట్టూ? ఇండియన్‌ల దండు అంది ఉంటుందా? పోరాటం జరిగి వుంటుందా? కాకపోతే వీళ్ళు మంచులో గాలిలో దారితప్పి దిక్కుతోచక తిరుగుతున్నారా? ఫోర్ట్ కియర్నీ కెప్టెన్—కంగారు పడుటకి కనబడనివ్వకపోయినా, చాలా ఆందోళనపడసాగాడు.

అయూదా రాత్రి తెల్లవార్లూ ఆ మైదానం సరిహద్దులలోనే తిరుగుతుంది. భయంతో, ఆందోళనతో ఆమె మనసు ఆలోచనలు పరి పరి విధాల పరుగులు పెడుతున్నాయి. ఎన్నో రకాల ప్రమాదాలను, ఉపద్రవాలను ఊహిస్తున్నాయి.

ఫిక్స్ కదలకుండా కూర్చున్నాడుకాని, నిద్రపోలేదు. అతను పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు. ఒక రాత్రివేళ ఎవరోవచ్చి ఏదో అడుగుతున్నారు. కా
[illegible]

తెల్లవారింది. పొగమంచు తెరల వెనక వల్చటి సూర్యబింబం ఉదయించింది. అపాటి వెల్తురులో చూసినా కనుచూపుమేర రెండు మైళ్ళు మించదు. ఫిలియాస్‌ఫాగ్‌బృందం దక్షిణ దిశగా పోయింది. ఆ దిశ అంతా నిర్జీవంగా కనిపిస్తోంది.

కెప్టెన్‌కు ఏమీ పాలుపోలేదు. ఇప్పుడు పోయిన దళాన్ని వెదకడానికి ఇంకో దళాన్ని పంపాలా? ఈ పాటికి బహుశా చనిపోయివుండేవాళ్ళని వెదకడంకోసం మరి కొందరిని సాగనంపాలా?..... కెప్టెన్ ఆట్టేసేపు ఆలోచించలేదు. ఆలోచించలేక పోయాడు.తన లూటినెంట్(లెఫ్టినెంట్)నుపిలిచి,అన్వేషణకై కొంతమందిని పంపమని ఉత్తరువు వేశాడు. అంతలో దూరాన తుపాకులు పేలిన చప్పుడు వినబడింది. అది సూచనా? దేనికి? ఎవరు గెలిచినట్టు? ఎవరు వస్తున్నట్టు? సైనికులు కొందరు ముందుకు పరుగెత్తారు. అరమైలు దూరంలో ఒక దళం కనబడింది. అందులో జనం అంతా ఒక క్రమపద్ధతిలో వరుసగా నడచివస్తున్నారు.

ముందువరుసలో ఫిలియాస్‌ఫాగ్ ఉన్నాడు. అతనివెంట, ఇండియన్‌ల బారినుండి కాపాడి దక్కించుకున్న పాస్పార్టు, మిగతా ప్రయాణికులిద్దరూ వస్తున్నారు.

ఫోర్ట్ కియర్నీకి దక్షిణాన పది మైళ్ళ దూరంలో యుద్ధం జరిగింది. పాస్పార్టు, మిగతా ప్రయాణీకులిద్దరూ అప్పటికే కాయ శక్తులా పోరాడుతున్నారు. తప్పించుకుందికి. పాస్పార్టు ముగ్గురు ఇండియన్‌లను ముష్టి ఘాతాలతో పడగొట్టాడు. అంతలో ఫిలియాస్‌ఫాగ్, సైనిక బృందంవచ్చి ఆదుకోవడం జరిగింది.

స్టేషనులో వున్నవారంతా ఆనందోత్సాహాలతో స్వాగతం చెప్పారు. ఫిలియాస్‌ఫాగ్, తన మాట ప్రకారం ఐదువేల డాలర్లుతీసి సైనికులందరికీ పంచిపెట్టారు.

"నా మూలంగా ఈయనకి ఖర్చు తడిసి మోపెడవుతోంది" అని బాధ పడ్డాడు పాస్పార్టు.

డిటెక్టివ్ ఫిక్స్ చేష్టలుదక్కి, ఫిలియాస్ ఫాగ్‌ను చూస్తూ నిలబడిపోయాడు. ఫాగ్ తిరిగి రావడంతో అతనిలో కలిగిన సంచలనం, బాధ, సిగ్గు వర్ణనాతీతమైనవి. అయూదాకు నోట మాట రాలేదు ఆనందంతో ఫిలియాస్‌ఫాగ్ చేతిని తనచేతులలోకి తీసుకుని ప్రగాఢంగా అదిమింది. అదే ఆమె ఆనందోద్వేగాలను తెలియజెప్పింది.

ఈ లోపల పాస్పార్టు రైలుకోసం వెదకబోయాడు. తాము వచ్చేసరికి రైలు సిద్ధంగా ఉంటుందని, ఎలాగో అలా అయిన ఆలస్యాన్ని కమ్ముకోవచ్చునని ఆశపెట్టుకున్నాడు పాస్పార్టు. కాని రైలు అక్కడలేదు.

"రైలేది? రైలేది?" అని గావుకేకలుపెట్టాడు కంగారుగా.

"వెళ్ళిపోయింది" అన్నాడు ఫిక్స్.

"తరవాత రైలు ఎప్పుడు వస్తుంది?" అన్నాడు ఫిలియాస్ ఫాగ్.

"సాయంకాలంగాని రాదు"

"ఓహో" అన్నాడు ఫాగ్ ముక్తసరిగా.

(ఇంకా ఉంది)



# నక్కబావ-పావురము

-వి. నాగరాజు-

**అ**నగా అనగా ఒక అడివిలో నక్క-బావ, పావురము కలిసి చాల స్నేహంగా జీవిస్తూ యుండేవి. అందల్లో ఒకదానికొకటి సహాయము చేసుకుంటూ, దొరికిన ఆహారాన్ని సమానంగా పంచుకుంటూ, అవి చాలా స్నేహంగా వుండి ఇతర జంతువులకు ఆదర్శప్రాయంగా వుంటూండేవి.

ఇలా వుండగా, ఒకసారి నక్కబావగారికి పావురము స్నేహాన్ని పరీక్ష చేయాలనిపించింది. అందుకని చాలరోజులనుండి బాగా ఆలోచించి నాలుగు కోరికలు పావురాన్ని అడగటానికి నిశ్చయించుకొంది.

ఒకరోజు నక్కబావగారు తన ప్రియమిత్రుడైన పావురము వద్దకు వెళ్ళి, "మిత్రమా! మనిద్దరము చాల రోజులనుండి స్నేహంగా వుంటున్నాము. నాకు నాలుగు తీరని కోరికలున్నాయి. అవి నీవు తప్పకుండా తీరుస్తావని నమ్మి నీ దగ్గరికి వచ్చాను. నీవు కనుక నా నాలుగు కోరికలు తీర్చినట్లయితే మన

స్నేహము ఇంకా అభివృద్ధి అయినట్లు తలుస్తాను. నీకు సమ్మతమైతే నా కోరికలు తీరుస్తానని వాగ్దానము చెయ్యాలి. నా నాలుగు కోరికలేమంటే, మొదటిది నన్ను కడుపుబ్బ నవ్వించాలి; రెండు-కడుపార ఆహారము ఇవ్వాలి; మూడు-కసితీరా నన్ను ఏడ్పించాలి; నాలుగు-ప్రాణాపాయాన్నుంచి నన్ను కాపాడాలి" అని చెప్పింది.

ఈ మాటలు విన్న పావురము, క్షణం మాలోచించి, చివరకు తన స్నేహితునికి అలాగే వాగ్దానము చేసింది. రెండురోజులు గడిచాయి. ఒకరోజు పావురము, నక్కబావతో తన వాగ్దానము నాదినము తీరుస్తానని చెప్పి, నక్కబావ వెంటరాగా అడివి బయట బాటమీద బయల్దేరింది. బాటమీద నడుస్తున్నదన్న మాటేగాని, పావురము మనస్సంతా తన స్నేహితుని కోరికలు తీర్చుటకు కల వుపాయాల మీదే వుంది.

ఇంతలో వారిని దాటి ఇద్దరు మధ్యవయస్కులు ముందుకు వెళ్ళిపోతున్నారు. వారిలో ముందుపోయే వాడు ఒకకర్ర భుజము మీద పెట్టుకొని నడుస్తున్నాడు. కర్రకు పైకొనన సద్దియన్నము మూట కట్టి వుంది. వెనుక ఒకడు చినిగిన చెప్పులు చేత పట్టుకొని నడుస్తున్నాడు.

వీరిని చూడగానే పావురానికి ఒక వుపాయము తట్టింది. నక్కను కొంత దూరములో నడుస్తుండమని చెప్పి తను రివ్వున ఎగిరి ముందుపోయే వాని భుజము మీది కర్రకొనని కూర్చుంది. వెనుకవానిదృష్టి ఆ పావురము మీద పడింది. బాగా పుష్టిదీన పావురాన్ని తన కందుబాటులో చూడగనే వానికి ఒక బుద్ధి పుట్టింది. ఆ పావురమును చంపితే తన కారోజు ఆహారంగానైన పనికొస్తుందనుకొని, తనచేతనున్న చెప్పును బలంగా దానిపైపు విసిరాడు. ఈ సంగతి గమనిస్తున్న పావురము వెంటనే కర్రమీద నుండి లేచి ఎగిరిపోయింది. అంత ఆ చెప్పు విసురుగా పోయి ముందరపోయే వాని తలవెనుక గట్టిగా తగిలింది. వెంటనే వాడు వెనుకకు తిరిగి వెనుక వాని చేతలోని రెండవ చెప్పుచూచి వానిచెంప చెళ్లుమనిపించాడు. అంత ఇద్దరు కింద మీద పడి కొట్టుకోవడము మొదలు పెట్టారు.

ఇదంతా వెనుక నుండి చూసిన నక్కబావకు నవ్వాగింది కాదు. కడుపుబ్బ నవ్వడము మొదలు పెట్టింది. పావురము తన స్నేహితుని మొదటి కోరిక తీర్చినట్లేగా. నక్కబావ, పావురాన్ని చాలపొగిడి ఇక రెండవ కోరిక తీర్చమంది.

నక్కబావ, పావురము కలిసి తిరిగి ఆ బాటవెంట ప్రయాణము సాగిస్తున్నాయి.

కొంతదూరము పోయాక వారికి సమీపములో ఒకచెట్టు క్రింద ఇద్దరు స్త్రీలు కనిపించారు. వారి ప్రక్కనే చద్ది అన్నము మూటలు రెండు వున్నాయి. వారినే దూరము నుండే చూచిన పావురము తక్కున ఆగిపోయి గట్టిగా మాట్లాడవద్దని నక్కబావకు సైగచేసింది. నక్కబావకిదేమీ అర్థము కాలేదు. పావురము, నక్కబావకు దూరానవున్న ఆస్త్రీలను చూపించి, నేను వారిని దూరంగా పిల్చుకొని పోతాను. వెంటనే నీవు వచ్చి ఆ మూటల్లోని అన్నమంతా తినేయి అని చెప్పింది. నక్క సరేయంది.

పావురము ఆ స్త్రీలకు దగ్గరగా పోయి కాలికి దెబ్బతగిలి బాధతో ఎగరలేనట్లు నటించసాగింది. అది ఆ స్త్రీలు చూచారు. ఆ పావురాన్ని సులువుగా పట్టుకొని వండుకొని తినొచ్చని, చెరోకపైపునుండి దానిని పట్టుకోబోయారు. కాని పావురము వారి చేతికిచిక్కతేగా! అది చేతికిఅందీ అందనట్లు ఎగురుతూ వారినివుడికించి కొన్ని ఫర్లాంగుల దూరమువరకు పిల్చుకొని పోయింది. ఈ లోపుగా నక్కబావ మూటల్లోని అన్నము, రొట్టెలుతిని త్రేవుమని తేన్చుకుంటూ పొదలో కూర్చొని వారిఅవస్థ చూస్తూవుంది. పావురాన్ని పట్టుకోలేక విసుగుచెంది, ఆస్త్రీలిద్దరు చెట్టుక్రిందకివచ్చి చూచేటప్పటికేముంది! అంతా ఖాళీ! అన్నముకట్టిన గుడ్డపేలికలు తప్ప అక్కడ ఇంకేమీ లేదు;

పావురాన్ని నక్కబావ చాల మెచ్చుకొని తన మూడవకోరిక తీర్చమంది. మూడవకోరిక ప్రకారము నక్కబావను పావురము కసిదీరా ఏడ్పించాలి.

ఈ సారేమో పావురము నక్కబావను వెంటబెట్టుకొని వెనుకకు తిరిగి అడివికేసి బయల్దేరింది. అడవి దరిదాపులకు వస్తూనే వేటకుక్కలొస్తున్నట్లు దూరమునుండి అరుపులు చప్పుళ్ళు వినపడినవి. పావురము నక్కబావను ఒక పొదలో దాగుకోమని చెప్పింది. నక్కబవ అట్లే దగ్గరున్న ఒకపొదలో దాగుంది. అంత పావురము ఆపొదపైన అటు ఇటు ఎగరసాగింది. దూరమునుండి ఇది చూచిన వేటకుక్కలు అక్కడేదో జంతు వుందనుకొని పొదవైపుకు రాసాగాయి. ఇది పొద సందుల్లోనుండి చూచిన నక్కబావకు పై ప్రాణాలు పైకిపోయినట్లనిపించింది. వేటకుక్కలొచ్చి

# తల్లి తలంపులు

అలపర్తి వెంకట సుబ్బారావు

చిన్ని పాపాయికి ఏమి కావాలి?
చిన్నారి పొన్నారి బొమ్మ కావాలి!
చేతులకు చిన్ని గాజుల్లు కావాలి!!

చిట్టి పాపాయికి ఏమి కావాలి?
పట్టుచొక్కాయిలూ రెండు కావాలి!
బొట్టుకై తిలకమొక బుడ్డి కావాలి!!

బుల్లి పాపాయికి ఏమి కావాలి?
మెళ్లోకి బంగారు గొలుసు కావాలి!
కాళ్ళకూ వెండి పట్టాలు కావాలి!!

ముద్దు పాపాయిని ఏమి కోరాలి?
ముసిముసీ నవ్వుల్లు నవ్వకోరాలి!
ముచ్చటగ ముద్దుల్లు ఇవ్వకోరాలి!!

## నక్కబావ - పావురము

నాయంటే తనవని ఆఖరైనట్లే! అప్పుడు నక్కబావకు పావురము మీద బలేకోపము వచ్చింది. కాని ఏం చేస్తుంది! తన మూడవకోరిక తనను ఏడ్పించమనేగా! వేటకుక్కలు పొదకు కొద్ది దూరంలో నుండగానే పావురము క్రిందికి కాలుతూ, నక్కబావతో రహస్యంగా మిత్రమా నీవు వూపిరి బిగపట్ట చచ్చినట్లు పడుకో. అప్పుడు వేటకుక్కలొచ్చి నిన్ను వాసన చూచి చచ్చిన జంతువనుకొని తిరిగి వెళ్ళిపోతాయి. అని వుపాయము చెప్పింది. పావురము చెప్పినట్లు నక్కబావ చేసింది.

కొంత సేపటికి వేటకుక్కలుపొద సమీపానికి వచ్చి, నక్కబావ కాలు పట్టుకొనిబయటికీడ్చి, వాసనచూచి తిరిగి వెళ్ళిపోయాయి. ఆ కుక్కలట్లు ప్రక్కకు పోతూనే మన నక్కబావకు కొంచెం ప్రాణము కుదుట పడింది. నక్కబావ పావురముతో - సరే! నీవు నా మూడు కోరికలు నాకు తృప్తికలిగేటట్లు తీర్చావు. ఇక నా కడపటి కోరిక తీరుస్తే గాని నీ వాగ్దానము పూర్తిగాదు. అని అంది.

అన్నిటికి సిద్ధమైన పావురము నక్కబావను వెంటబెట్టుకొని అడివి లోనికి ప్రవేశించింది. కొంతదూరము పోయేసరికి వారికి ఒక చిన్ననది అడ్డమువచ్చింది. పావురమేమో నది దాటిపోగలదు కాని నక్కబావ దాటలేదు! అందుకు నక్కబావ ఒక వుపాయము చెప్పింది. ఆనదిలో నివసిస్తూ వున్న తన చిన్ననాటి స్నేహితుడైన ఒక మొసలిని బయటికి పిలిచి తమ నెలాగైన ఒడ్డుకు చేర్చమంది. నదిలోనుండి బయటికి వచ్చేటప్పుడు మొసలి ఎందుకో దిగులుగావుంది. కాని నక్కబావను చూడగనే మిక్కిలి సంతోషముతో వారిని ఆవలిఒడ్డుకు చేర్చుటకు ఒప్పుకుంది. నక్కబావ పావురము కలిసి మొసలి వీపుమీద కూర్చొని ప్రయాణము సాగిస్తున్నాయి. నీటి మధ్యకురాగానే, మొసలి ముందుకు పోకుండా ఆగింది. "ఎందుకాగావు మిత్రమా!" అని పావురము మొసలిని అడిగింది, అప్పుడు మొసలి, కన్నీరుకారుస్తూ "నాభార్యకు చాల జబ్బుగావుంది. వైదులకు చూపిస్తే నక్క గుండెకాయ తింటే ఆజబ్బు పోతుందన్నారు. అందుకని మీనక్కనుచంపి గుండెకాయ తీసి కొనేందుకు ఆగాను." అని చెప్పింది. ఈమాటలు విన్న నక్కబావకు నెత్తిన పిడుగు పడినట్లయింది. మొసలి ఇంత మిత్రద్రోహి అని నక్కబావ కలలోకూడ అనుకోలేదు. తన బ్రతుకుకు అది ఆఖరు క్షణమనుకొంది. కాని ఉపాయశాలియైన పావురము వెంటనే మొసలితో, "అయ్యో! మిత్రమా! ఎంత పని జరిగింది. ఈమాట నీవుముందుగానే చెప్పివుంటే ఎంత బాగుండేది. ఇప్పుడే మాస్నేహితుడు తన గుండెకాయను ఒడ్డుపైన చెట్లఆకుల్లో దాచివస్తున్నాడు. నీవు ముందుగానే చెప్పివుంటేమేముదానినితీసి కొనివచ్చి వుండేవారము" అని చెప్పింది. ఈ మాటలు నిజమనినమ్మి ఆమూర్ఖ మొసలివారిని తిరిగి వెనుకకు పిల్చుకొనిపోయి ఒడ్డుకు చేర్చింది. ఒడ్డుకు చేరిన నక్కబావ పావురము మొసలిని బాగాతిట్టి అవమానించి పంపేశాయి.

తన నాలుగు కోరికలను అతి నేర్పుతో తీర్చినందుకు నక్కబావ తన స్నేహితుడైన పావురముకు గొప్ప విందుచేసింది. విందు తరువాత నక్కబావ పావురమును గొప్పగా పొగిడి, ఇద్దరు ఆ జన్మాంతము ప్రాణస్నేహితులుగా వుండే టట్లువాగ్దానాలు చేసుకున్నాయి.★

దున్నాయి. కాఫీకి నీళ్ళు పొయిమీద పెట్టాను."

సుశీల లేచి వంటింట్లోకి వచ్చింది. అంట్లన్నీ తోమి ఉన్నాయి. ఇల్లూ వాకిలీ శుభ్రంగా వూడ్చి ఉన్నాయి. కృతజ్ఞతతో ఒకసారి సీతవంక చూచింది సుశీల.

"అయ్యో పిచ్చితల్లీ. ఎందు కింత శ్రమ పడ్డావమ్మా."

"ఫర్వాలేదు లెండి. మీ రెలా చేసుకుంటారు పాపం. నెలలు నిండా యనుకొంటాను."

"తప్పుతుందా తల్లీ. నాకు పుట్టింటి నుంచి గాని, అత్తవారింటినుంచిగాని వచ్చి చేసిపెట్టేవా రెవరూ లేరు. నేనే చేసుకోవాలి. కాస్త పనిపిల్లను చూచిపెట్టండి అంటే వారు ఇదుగో అదుగో అంటున్నారు. అల్లాగే బాధపడుతున్నాను."

"అయ్యయ్యో పాపం. అయ్యగారికి పనిపిల్లే దొరక్కపోయిందా యింత బస్తీలో. మీరు ప్రస వించేవరకూ నే నుండి చేసి పెడతానమ్మా. అయ్య గారితో చెప్పండి."

"అంతకంటేనా తల్లీ. తప్పకుండా అయ్యగారితో చెప్పి నిన్ను ఉంచేసుకుంటాను. మరి నీ కెలా గిట్టుబాటవుతుందో చెప్పు."

"మీ దయమ్మా. మీతోబాటు ఒక ముద్ద అన్నం పెట్టించండి. ఏమన్నా యివ్వాలని దేవుడు మీకు బుద్ధిపుట్టిస్తే ఏదో ఒకటి యిద్దురు గాని."

సుందరం కాలకృత్యాలు తీర్చుకొని వసారాలో కూర్చున్నాడు. సీత కాఫీ గ్లాసు తీసుకొని వచ్చి బల్లమీద పెట్టింది. ఇద్దరూ ఒకర్నొకరు చూసు కొన్నారు. విజయం ఎవరిది ? నీదా, నాదా అన్నట్లు. సీత తిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయింది సుందరం కంపెనీకి వెళ్ళడానికి డ్రెస్ వేసుకు సిద్ధంగా ఉన్నాడు. సుశీల అతనివద్దకు వచ్చింది

"చూడండి, నేను ప్రసవించేవరకూ ఈ అమ్మా యిని మనింట్లోనే ఉంచుకొందాం. తనుకూడా ఉంటా నంటున్నది. మనం ఎలాగూ ఒక పని పిల్లను పెట్టుకోవాలనుకుంటున్నాముగా !"

సుందరం చిత్తరపోయి చూస్తున్నాడు.

"ఏమిటలా చూస్తారు ?"

"తనే ఉంటానంటుందా ?"

'అవును'

'ఎందుకో ?'

'ఎందుకేమిటి ? వరధ్యానంగా ఉన్నారా ? కంపెనీ కొత్తమయిందిలా ఉంది. మీరు వెళ్ళండి. నేను సీతమ్మను అట్టేపెట్టుకొంటానులెండి. పాపం మంచి అమ్మాయే. ఆమె సంగతంతా తెలుసు కొన్నాను.'

'ఏమి టావిడ సంగతి.'

ఇంతలో సీతకూడా అక్కడకు వచ్చి నిల్చుంది. సుశీల అన్నది :

'పాపం పెనిమిటి మిలటరీకి వెళ్ళాట్ట. నాలు గైదేండ్లనుంచి ఉత్తరాలు వ్రాయడంలేదట. ఎక్కడున్నాడోకూడా తెలియదట. గవర్నమెంటు ఆఫీసుల్లో అడిగితే అతని ఆచూకీ ఏమయినా తెలుస్తుందేమోనని బస్తీకి వచ్చిందట.'

'చచ్చిపోయాడేమో' సుందరం అన్నాడు.

'హాహా ఊరుకోండి. మీ నోటివెంట అలాటి

# సిపాయి పెండ్లి

(36వ పేజీ తరువాయి)

మాట రావచ్చా. అయ్యగారి మాటకు నువ్వేమీ నొచ్చుకోకు సీతమ్మా. తెలిక అన్నారు. అన్నట్టు ఏమండీ. మీరుకూడా మిలటరీకి వెళ్ళొచ్చారుగా. మిలటరీకి వెళ్లినవారి కుటుంబాల బాగోగులు చూచే ఆఫీసు ఈ వూళ్ళో ఉందిగా. అక్కడ ఈ అమ్మాయికి ఏమన్నా ఉపకారం కలుగుతుందేమో కనుక్కోండి. పాపం పెనిమిటి కోసం అలమ టించి పోతుంది."

'అవునవును. అలాగే ఒకరోజు తీరుబడి చేసు కొని వెళ్ళి కనుక్కొంటాలే.'

'సీతమ్మా, నీ భర్తపేరూ, ఇంకా యితర వివరాలూ చెప్పమ్మా వారికి.'

'తర్వాత చెబుతుందిలే. ఇప్పు డెందుకు. నేనా ఆఫీసుకు వెళ్ళేముందు అన్నీ వివరంగా తెలుసుకు మరీ వెళ్తానుగా.'

సుందరం కంపెనీకి వెళ్ళాడు.

రోజులు గడుస్తున్నై. సుశీలను కాలు క్రింద పెట్టనీయకుండా సీత పని అంతా చేసుకుపోతు న్నది. సుశీల అప్పుడప్పుడూ అంటూ ఉండేది. 'నువ్వు ఏ జన్మలోనో నా తల్లివమ్మా. లేకపోతే యింత చాకిరీ నువ్వు నాకు చేయడానికి నేను ఎవర్ని.'

సుశీలకు ఆమెయందు ప్రేమ, గౌరవమూ ఎక్కువయాయి. ఆమెను తన అత్యంత ఆప్తు రాలుగా భావిస్తున్నది. ఆనంద్ సీతకు పూర్తిగా మాలిమై పోయాడు. సీత స్నానం చేయిస్తేనే స్నానం చేస్తాడు. ఆమే అన్నం తినిపించాలి. రాత్రులు ఆమె ప్రక్కలోనే పడుకొని ఆమె చెప్పే కథలు వూకొడుతూ నిద్రపోతాడు.

సుందరానికి యిదంతా ఏమీ అర్థం గావడం లేదు. ఇదంతా నాటకమా, జీవితమా అన్న సంశయం కలుగుతున్నది. తన యింట్లో, తన సంసారంలో తన కళ్ళముందు ఏమిటీ వ్యవహారం. దీని పర్యవసానం ఏమవుతుంది. నా నీ విషయంలో మెదలకుండా కూర్చోవడమే మంచిదా. లేక బైట పడి సుశీలకు సంగతి చెప్పేస్తే మంచిదా అని ఆలోచిస్తూ ఉండగానే రోజులు గడిచిపోతున్నాయి.

ఓరోజు పేరంటానికి వెళ్ళాలని ఉబలాట పడి, తగిన చీరలేదని సుశీల మథనపడు తున్నది. ఈ బాధ గ్రహించింది సీత. కూరలకని బజారుకు వెళ్ళి వస్తూ నాల్గు మంచి వాయిల్ చీరెలు కొనితెచ్చింది.

'అయ్యగారు బజార్లో కనుపించారమ్మా. యిఁక మావి బోనసు యిచ్చారట. చీరలు కొని పంపారు' అంది.

సుశీల కళ్ళు మిల మిల మెరిసాయి. నాలుగు చీరెలు! ఒక్కసారి నాలుగు చీరెలు ! నాలుగూ తనకు నచ్చినవే ! తన జీవితంలో ఇంత అదృష్టం ఎన్నడూ ఎరుగదు.

'కావి, సీతమ్మక్కా. ఇవి నిజంగా వారే కొన్నారా. వారి కసలు బట్టలు కొనడం తెలీదు. జీతం గాని

బోనసుగాని తెచ్చి నా కివ్వడమే. నేనే అందరికీ బట్టలు కొనేదాన్ని' అన్నది సుశీల

సంతోషంగా పేరంటానికి వెళ్ళి తిరిగి వచ్చింది. సుందరం సాయంత్రం ఇంటికి వచ్చేసరికి క్రొత్త చీరె కట్టుకొని వున్న సుశీలను చూశాడు.

'ఏమండీ ! ఒక్కసారే నాలుగు చీరెలు కొనాలా ?' సుశీల అడిగింది.

సుందరానికి అర్థంగాక అలాగే నిల్చుండి పోయాడు.

'తాయారమ్మగారు పేరంటానికి పిల్చారు. సరైన చీర లేదు. ఎలాగా అనుకొంటూ ఉండగా సీతమ్మక్కచేత నాలుగు చీరెలు పంపించారు మీరు' అన్నది సుశీల.

సుందరం సీతవైపు చూశాడు.

సీత అతనివేపు అర్థపూరితంగా చూసింది. సుందరం ఒక్క చిరునవ్వు నవ్వి ఊరుకొన్నాడు.

ఒకరోజు సాయంత్రం ప్రక్కింటివాళ్ళ రేడియో పాడుతూఉంటే బడినుంచి వస్తున్న ఆనంద్ అక్కడే నిల్చుండిపోయాడు. సీత అతన్ని యింటికి తీసుకొని వచ్చి, సుందరంకూ, సుశీలకూ బాబు ఎక్కడ రేడియో పాడుతూ ఉంటే అక్కడే నిల్చుండిపోతున్నాడని చెప్పింది.

'ఒక రేడియో కొంటే ఎంతవుతుందండీ' అని సుశీల సుందరాన్ని అడిగింది.

సుందరానికి కోపం వచ్చింది.

'నీకేమయినా మతి పోయిందా ఏమిటి ? ప్రక్కింటివాళ్లబ్బాయి కార్లో ఎక్కి తిరుగుతూ వుంటే నీ కొడుక్కుకూడా ఒక కారు కొంటావా ఏమిటి ?' అని ఉరిమాడు.

'కారుమాత్రం ఎందుకు కొనగూడదూ. బాబుకు తప్పకుండా కార్లో తిరిగే యోగముంది. లక్షరూపాయల కార్లో దర్జాగా తిరుగుతాడు బాబు' అంది సీత కల్పించుకుంటూ.

సుందర్ ఆమెవేపు తీక్షణంగా చూసి అన్నాడు.

'అవునవును. నీవు వాడికి కారుకూడా కొని పెడ్తావు.' అని లోపలికి వెళ్ళిపోయాడు. సుశీలకు ఆమాట అర్థంగాక సీతవేపు చూసింది.

ఒకరోజున సీతను అర్జంటుగా కంపెనీకి రమ్మని యింటికి కబురు చేశాడు సుందరం. సీత వెళ్ళింది. తిరిగి ఇంటికి రాలేదు. ఆ వేళ వార్తాపత్రికల్లో 'ఆనందరావుగారు చనిపోయినట్లు వార్త ఉంది. ఆ విషయం ఆమెతో చెప్పి ఆమెను పూనాకు పంపించివేశాడు సుందరం. సీత, వాళ్ళ ఊళ్ళో ఎవరికో జబ్బుచేసినట్లు కబురు వస్తే ఆమెను కంపెనీనుంచి నేరుగా వాళ్ళ ఊరికి పంపించివేశానని సుశీలతో చెప్పాడు.

పాపం సీత ఇప్పుడు తండ్రిలేనిది. భర్త ఉండి కూడా లేనట్టే. నిస్సహాయురాలు. ఇటు వంటి సమయంలో సీతను ఎలాగైనా ఆదుకో వలయునన్న ఆదుర్దా సుందరానికి కలిగింది. సీత పట్ల సుశీలకు మంచి అభిప్రాయం ఏర్పడింది. సీత వెళ్ళినప్పట్నుంచి సుశీలకు ఆమె ప్రస్తావనే. ఆమె ఎవరో దేవత. పొరబాటున భూలోకంలో మనిషిగా పుట్టింది అంటూ వుంటుంది. ఇటు వంటి తలంపులతో ఉన్న సుశీలకు అసలు విషయం చెప్పితే బాగుంటుందేమో అని ఆలో




# సిపాయి పెండ్లి

చించాడు సుందరం. కానీ, స్త్రీప్రవృత్తి వేరు. ఒక స్త్రీ మరో స్త్రీపట్ల ఎంత సద్భావంతో ఉన్నా ఆ స్త్రీ తన భర్తను కాంక్షిస్తూ ఉందని తెలిస్తే అంత సద్భావమూ ఒక్కసారి పటాపంచలైపోతుంది. ఆ స్త్రీని త్రాచుపాములా చూస్తుంది.

నెలరోజులు గడిచిపోయాయి. ఒకరోజున సుందరం హఠాత్తుగా కంపెనీ నుంచి వచ్చి తాను అర్జంటుగా పూనా వెళ్లాలనీ, రైలుకు గంట కంటే ఎక్కువ టైములేదుగనుక బట్టలు వెంటనే సర్దిపెట్టమని సుశీలతో చెప్పాడు 'కంపెనీ పనిమీద వెళ్తున్నారా' అంది సుశీల గుడ్డలు సర్దుతూ. సుందరం 'వూ' అన్నాడు. కాని తను ఎందుకు అబద్ధం ఆడాలి అనుకొన్నాడు.

"కంపెనీపని కాదు. స్వంతపని." సుశీల ఆశ్చర్యపడింది. సుందరం మళ్ళీ అన్నాడు.

"స్వంతపనే. సుశీలా నిబ్బరంగా విను. ఇన్నాళ్లూ నేను నిన్ను మోసం చేశాను. తద్వారా నన్ను నేనే మోసం చేసుకొన్నాను. ఫలితంగా ఇప్పుడొక నిండు ప్రాణి బలైపోతూవుంది" సుందరం కళ్లల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి. సుశీల కంగారుపడింది.

సుందరం అడిగాడు.

"సీత ఎవరనుకొన్నావు ?"

"ఎవరు" సుశీల అమాయకంగా తిరిగి ప్రశ్నించింది.

"ఆమె నా భార్య."

"మీ భార్యా ?" సుశీల ఆశ్చర్యంగా అడిగింది.

"అవును నా భార్య. నా మొదటి భార్య. నీవు నా రెండో భార్యవు."

"ఆ"

"ఉన్న యదార్థం చెబుతున్నాను. తర్వాత నా తప్పు క్షమించమని ప్రార్థించుచున్నాను" అని జరిగిన సంగతంతా చెప్పాడు సుందరం.

"ఆమె ఇరవై లక్షల రూపాయల ఆస్తికి యజమానురాలై ఉండి నీకు చాకిరీచేసి, నిన్ను మెప్పించి నీ అనుమతితో తాను కూడా నా భార్యగా జీవించుదామని ఇన్నాళ్లూ నీకు దాసీపని చేసి .... పాపం .... " ఇక సుందరం మాట్లాడలేక పోయాడు.

"ఏమయిందండీ. ఏమయింది" సుశీల ఆతురతతో అడిగింది.

"బరువుపనులు చేయవద్దని డాక్టర్లు చెప్పారట. మన ఇంట్లో తగని చాకిరీ చేసినందువల్ల ఆ జబ్బు మరల తిరగబెట్టిందట. చాలా ప్రమాద స్థితిలో ఉంది. నన్ను ఒక్కసారి వచ్చి చూచి పొమ్మని టెలిగ్రాం వచ్చింది."

సుశీల పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొంటూ "ఎంతపని చేశారండీ. నేనంత క్రూరురాల ననుకొన్నారా. ఆ మహాసాధ్వికి నాచేత ఎంత అపచారం చేయించారండీ. ఈ సంగతి నాకు ముందుగానే చెప్పినట్లయితే నే నామెను పువ్వులలోపెట్టి పూజిస్తూ ఆమె పాదాలచెంత బ్రతకడానికి అనుజ్ఞ వేడుకొనేదాన్నే."

"సుశీలా నీలో ఆ సుగుణం ఉందా. నీ మనస్సు నొచ్చుకుంటుందేమో అనుకొన్నాను."

"అయ్యో ఎంత పిచ్చివారండీ. ఇంతకాలంగా నాతో సంసారం చేస్తూ ఈమాత్రం నన్ను అర్థం చేసుకోలేక, ఒక నిండుజీవిని, ఒక మహాసాధ్విని .... " ఇక మాట్లాడలేక పోయింది సుశీల.

సుందరంవెంట పిల్లవాడిని తీసుకొని తనూ బయల్దేరింది పూనాకు.

పూనాలో సీతస్థితి ఆశాజనకంగా లేదు. డాక్టర్లు అప్పటికే ఆశ వదులుకొన్నారు కేవలం సుందరంకోసమే బ్రతికిఉందా అన్నట్టు కళ్లల్లో ప్రాణాలు నిలుపుకొని అతని రాకకోసం కనిపెట్టుకుంది. ఇంతలో సుందరం రానే వచ్చాడు. అతని వెంట ఆనంద్‌ని ఎత్తుకొని సుశీల వుంది.

"సుందర్ వచ్చావా ? నీకోసమే క్షణ క్షణమూ ఆయువును పొడిగించుకొంటూ వేచి ఉన్నాను. ఓః సుశీలమ్మా, బాబుకూడా వచ్చారా."

సుశీల గావురుమంది.

"ఇప్పుడే నాకు నీ విషయం చెప్పారు వీరు. అయ్యో ఈ సంగతి రవ్వంత నువ్వయినా ముందు నాకు చెప్పివుంటే నిన్ను పువ్వులలోపెట్టి పూజించుకొనేదాన్ని కాదా అక్కా. నీకు సేవ చేస్తూ నీ పాదాల దగ్గర బ్రతకడానికి నేనే నిన్ను అనుమతి వేడుకొనేదాన్నే. ఈ పేదరాలి దయ కోసం నీ జీవితాన్ని ధ్వంసంచేసుకొన్నావా అమ్మా. నేనెంత పాపిష్టిరాల్ని. నీచేత చాకిరీచేయించుకొన్నాను. నన్ను క్షమించు. నన్ను క్షమించు తల్లీ క్షమించు." అని ఏడ్చి, భర్తవైపు తిరిగి "చూస్తారేమండీ. డాక్టర్లను పిలుచుకురండీ" అని హెచ్చరించింది. సీత అవసరం లేదన్నట్టుగా చేయి ఊపి నెమ్మదిగా హీనస్వరంతో అన్నది.

"అక్కరలేదమ్మా. డాక్టర్లు ఎప్పుడో ఆశ వదులుకొన్నారు."

సుందరంవైపుకు తిరిగి. "సుందర్ .... ఇప్పటికైనా నన్ను స్వీకరిస్తున్నావా .... "

సుందరం పొరలివచ్చే దుఃఖాన్ని దిగమింగుతూ,

"సీతా ! ఇప్పటికీ, త్రికరణశుద్ధిగా స్వీకరిస్తున్నాను. నువ్వు ఎప్పటికీ నా భార్యవే. నేను నీకు చేసిన అపరాధం క్షమించు" అన్నాడు. సీత అతని రెండుచేతులూ తనచేత్తో పట్టుకొని గుండెలమీద పెట్టుకొంటూ 'సుందర్, ధనాన్నీ, సుఖాన్నీ, తృణప్రాయంగా చూచి ధర్మానికి కట్టుబడిన పురుషుడవు నువ్వు ! నీ భార్యనని సించుకున్నాను. నా కంతే చాలు. నేను జీవిత పోరాటం .... గెలిచాను. .... అమ్మ .... ఆయాసం .. బాబూ ఆనంద్ .... నేను వెళ్లిపోతున్నాను .... అమ్మను విసిగించకేం ! .... సుశీలమ్మా. వెళ్తున్నాను. బాబు జాగ్రత్త. బాగా చదివించు. సుందర్ .... ఇదిగో నా వీలునామా ఇదిగో, నా తండ్రివల్ల నాకు సంక్రమించిన ఆస్తి....నీకు దఖలు పర్చాను. ... శలవు .... సుందర్ .... !'

సీత కన్ను మూసింది. ★

# అలజడి

(20 వ పేజీ తరవాయి)

తింది తను. ఎలాగోలా ప్రయత్నించి మధూ శేఖరులను ఏకంచేస్తే తప్ప మధు ఈ జన్మలో తనని క్షమించదు. ముఖం చూడదు....

గేటుముందు కారాగిన చప్పుడైంది. పంజరంలోని మైనా "వచ్చారా బాబాయ్" అంటూ పలకరించింది. వినోద చప్పున వంటింట్లోకి పరుగెత్తి వంటవాడి దగ్గర్నుండి కాఫీ, టిఫిన్ పట్టుకొని ప్రకాశరావుగారి ఆఫీసురూంలోకి దౌడు తీసింది.

వెలవెలబోతూన్న మొహంతో వినోద చెప్పినదంతా విన్న ప్రకాశరావుగారు చిన్నగా నవ్వారు.

'మమ్మల్ని క్షమించండి బాబాయ్. ఈ సమస్యని మీరు పరిష్కరించుతారనే నా ఆశ. లేకపోతే—లేకపోతే—మధు నన్ను ఈ జన్మలో క్షమించదు.' విచారంతో తల వంచుకు కూర్చున్న వినోద తలమీద చేయి వేశారు ప్రకాశరావుగారు.

"నీవేమీ దిగులుపడకు తల్లీ—అంతా నేను చూచుకుంటాను. నీ విక ఇంటికి వెళ్లు" అంటూ ఆమెను బుజ్జగించారు. వినోద వెళ్లిపోయింది.

చదువుకుంటున్నారన్న మాటేగాని ఈ ఆడపిల్లలకు తొందర, ఆవేశాలూ ఎక్కువ. ఎట్లా బ్రతుకుతారో ఏమో .... ప్రకాశరావుగారు వెడుతూన్న వినోదనీ, మధునీ తలుచుకుంటూ అనుకున్నారు. ఆ తర్వాత కాగితంమీద ఏదో వ్రాసి వీరాయ్ కిచ్చి డ్రస్సు మార్చుకుని మధును పలకరించనైనా పలకరించకుండా క్లబ్బుకు వెళ్లిపోయారు

* * *

ఆవేళతో కాలేజీలు మూసివేస్తారు. శేఖర్ వెళ్లిపోతున్నాడు. ఇక మళ్లా తనకి కనిపించమన్నా కనిపించడు. తనిప్పుడేం చేయాలి. తాను చేసిన పొరపాటు క్షమించరానిది. శేఖర్, నాన్నగారూ కూడా తనను క్షమించరు. తన కుమార్తెలో ఇంతటి చపలత్వ ముందేమని ఆయన ఎంతో బాధపడతారు. తా నది భరించలేదు. తను చేసిన అపరాధానికి శిక్ష అనుభవించక తప్పదు. అంతకు మించి గత్యంతరం లేదు.... ఈ ఆలోచనలు మెదడును తొలిచివేస్తుండగా మైథిలి బాగా చీకటి అయ్యేవరకూ గదిలోనే గడిపివేసింది. మళ్లా వినోద దగ్గరకు వెళ్లా లనుకుంది. కాని ఇప్పుడు ఎవరూ ఏమి చేయలేరు. అంతా మించిపోయింది.... తోటలో చల్లనిగాలి ప్రశాంతంగా వీస్తోంది... మౌనంగా తోటలోకి నడచిపోతున్న మధును చూసి మైనా 'అక్కాయ్' అంటూ పలకరించింది. మధు జవాబీయలేదు... ప్రకాశరావుగా రింకా ఇంటికి రాలేదు. తండ్రిగారు రాగానే ఆయన భుజం మీద తలవాల్చి గట్టిగా ఏడవా లనిపిస్తోంది, ఆమెకి .... కుర్చీమీద కూర్చుని ఎదురుగా ఉన్న టేబిల్‌మీద తలవాల్చి తండ్రి రాకకోసమే నిరీక్షిస్తోంది మధు.

[illegible] స్థితి చూసి నవ్వుకుంటూన్నట్లు ఊగులాడ సాగేయి....అవతలి తోట్లో నుండి, వీరాయ్, వంటవాడూ కేకలాడుకుంటున్న చప్పుడు కొద్ది కొద్దిగా వినవస్తోంది. మైథిలి మనస్సు ఎక్కడో పరిభ్రమిస్తోంది. గేటు కిర్రుమంది. మధు తల ఎత్తలేదు. అలాగే నీరసంగా తలవాల్చి బల్లమీద ఒరిగిపోయి ఉంది.

వీరాయ్ ద్వారా ప్రకాశరావుగారు పంపిన లేఖని చదువుకొని ఆయన కోరిక కాదనలేక వచ్చిన శేఖరం గేటు తెరచుకు లోపలికివచ్చాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. పంజరంలో మైనా ముడుచుకు నిద్రపోతోంది. తోటలో ఎవరూ లేరు..,

అటూ యిటూ చూసి...వీరాయ్! అంటూ పిలిచాడు.

ఆ క్షణంలోనే అతనికి తోటలో ఓమూల తెల్లని చీరతో వనదేవతలా బల్లమీద తలవాల్చి పడుకున్న మైథిలి కనుపించింది. వెనక్కి తిరగబోయాడు. అదే సమయంలో మైథిలి అతన్ని చూసి తెల్లబోయింది. ఒక్క క్షణంపాటు నాలుగు కళ్లూ కలుసుకున్నాయి. మౌనంగా కొన్ని క్షణాలు గడిచాయి.

'క్షమించండి. మీ నాన్నగారు ఎందుకో రమ్మంటే ....' అంటూనే శేఖర్ వెనుదిరిగాడు.

మధు తన్ను తాను మరిచిపోయింది. ఇది అమూల్యమైన క్షణం. ఈ క్షణాన్ని తను పాడు చేసుకుంటే .... ఈ జన్మలో తనకి శాంతి అనేది ఉండదు....

'వెళ్లిపోకండి ...., నా కోసం ....' అంతే ! ఇక మాట్లాడలేక చేతులతో మొహాన్ని కప్పివేసుకుంది. శేఖరం ఆశ్చర్యపోతూ ఆమెవంక చూశాడు. మధు నిశ్శబ్దంగా ఏడుస్తోంది. శేఖర్ గాంభీర్యమంతా మంచులా కరిగిపోయింది. తన్ను తాను మరచిపోయాడు....

'మధూ ! అంటూ ఆమెకి దగ్గరగా వచ్చాడు. చొరవ తీసుకొని ఆమె ముఖంమీద చేతులు తొలగించాడు అశ్రువులతో మలినమయిన ఆమె మొహాన్ని చూచి ఎంతో బాధపడ్డాడు..

"మధూ ! ఏమిటిది ! ఎందు కిలా దుఃఖిస్తున్నావు..."

"నన్ను క్షమించండి. తొందరపడి మిమ్మల్ని బాధించాను. అవమాన పరిచాను' .... మధు నెమ్మదిగా అంది.

శేఖర్ హృదయం తేలిక పడింది. అమ్మయ్య ! అనుకున్నాడు. మొహాన చిరునవ్వు వెలిగిపోతూండగా మధుకి మరింత చేరువగా వచ్చాడు.

ఆమె ముఖాన్ని మునివేళ్లతో పైకెత్తి ఆమె కళ్లల్లోకి ప్రేమగా చూశాడు.

'మధూ' తీయగా పిలిచాడు.

మైథిలి అతని గుండెల్లో తలదాచుకుంది.

'ఎందు కిలా చేశావు మధూ?' అసలు కారణం ఏమిటి ?' అని అడగా లనిపించింది శేఖర్‌కి. కాని జరిగిపోయినసంగతు లన్నీ మళ్లా, మళ్లా అడుగుతూ ఆమెని బాధ పెట్టటం ఇష్టంలేకపోయిందతనికి. తర్వాత—తర్వాత మధే చెబుతుంది తనకి అన్ని సంగతులూ ......

రుని తీసుకుని నేనూ అల్లా వెళ్ళి తిరిగి వస్తాను" అన్నాడు ప్రసాదరావు

అప్రయత్నంగా లెక్చరర్ నారాయణగారి ఇంటి వేపు మళ్ళినాయి కాళ్ళు. ఆయన టెన్నిస్ ఆడుకోడానికి క్లబ్బుకి వెళ్ళారుట. చదువుకుంటూ పడక కుర్చీలో కూచునివున్న శ్యామల చెప్పింది. శ్యామల నారాయణగారి చెల్లెలు. ప్రసాదం సహాధ్యాయిన్నీ. ఆ రోజు దేవుడూ, వేదాంతం విషయం తర్కం వచ్చింది. దేవుడు సర్వే సర్వత్ర ఒక్కడే అని నిశ్చయాని కొచ్చారు, శ్యామలా, ప్రసాదమున్నూ.

తిరిగి ఇంటి కొచ్చేటప్పటికి లక్ష్మిదేవిగారు కూడా వచ్చేశారు. "ఒరే! ఈవేళ కథ వినడానికి గరుత్మంతుడు కూడా వచ్చి గుడి స్తంభంమీదకూచున్నాడురా. అల్లా రెక్క విదిపాడు. ఇన్ని నీళ్ళు క్రిందబడ్డాయి. స్నానంచేసి కూడా వచ్చాడల్లే వుంది. ఎంతో భక్తి అనిపించింది నాకు" అంది అమ్మ ఆశ్చర్యంగా, గడ్డం క్రింద చెయ్యి ముడుచుకుని.

వెర్రి అమ్మ అమాయకురాలు. పాపం. అనుకున్నాడు. ప్రసాదం—జాలిగా "ఏం పిచ్చమ్మా! ఇంకా నీకు ఈ పిచ్చి నమ్మకాలు పోలేదు. ఆ గద్ద ఎక్కడో తడిసివచ్చి ఉంటుంది" అన్నాడు పైకి.

"దేవుడి విషయం ఇంత నిర్లక్ష్యంగా మాట్లాడతాడేమిటి?" అనుకుంది బాధగా, మనస్సులో, లక్ష్మిదేవిగారు.

ప్రసాదానికి పాఠాలు గడచినకొద్దీ శ్యామలతో పరిచయం హెచ్చవుతూ వచ్చింది. కష్టం సుఖమూ ఆమెతో ముచ్చటిస్తుండేవాడు. శ్యామల అర్థం చేసుకుని ఆదరణ చూపింది.

ఆఏడు వీళ్ళ బస్తీ కాపురం ఎలాగుందో చూడ్డానికి ఆదిశేషయ్యగారు వచ్చి మకాం వేశారు. వచ్చినప్పటినుంచీ ప్రసాదాన్ని ఒక కంట కనిపెడుతూనే వున్నారు — అసలే చుక్కెదురాయె. "కాఫీలు, టీలూ జబ్బు వస్తువులు. వాట్లల్లో ఉన్న బలం అంతా పంచదారా పాలూనూ" అంటూ కాఫీలో రెట్టింపు పాలు చక్కెర కలిపించేవారు. ప్రసాదానికి ఆకాఫీ హాలాహలంలాగనిపించేది" ఇది కాఫీయా? ఇందులో కొంచం నుగ్గు బియ్యం వెయ్యక పోయావూ. పాయసమన్నా అవునుగా" ఛ, ఛ కాఫీ వాసనేలేదు. ఎల్లా త్రాగడం?" అని విసుక్కునేవాడు. ఆఖరుకి ఈ పానీయాలు త్రాగలేక హోటలుకి వెళ్ళిపోయేవాడు కాఫీలకు. అది ఏ మాత్రమూ బాగువడే లక్షణంగా కనిపించలేదు, శేషయ్యగారికి. వ్యాయామం, శరీరానికి అత్యంవసరంఅని, తెల్లవారు జామున ప్రసాదాన్ని లేపేసి, దండాలూ బస్కీలు తియ్యమన్నారు. రాత్రి పొద్దుపోయే వరకూ నిద్ర లేకుండా చదివి, సాయంత్రం ఆటలాడివచ్చిన ప్రసాదానికి లేవడం కంటకంగా వుండేది. శేషయ్యగారికి ఆ బద్ధకం పనికరాదు ప్రసాదం కాలేజీ లెక్చరు నోట్సు అతి తీవ్రంగా తిరగేసుకుంటూంటే సృష్టి అంతా 7 అక్షరాలలో వుందిరా. సరి గమ పదని,అని సంగీతమూ ఉపన్యాసమూ మొదలెట్టేవాడు.

కాని,ఆదిశేషయ్యగారి జాలుము, ప్రసాదం అంతగా పట్టించుకోలేదు—మనస్సులో.

పగలు ఏదో వేళలో శ్యామల కనిపిస్తూండేది. అతన్ని చూడంగానే వెలిగిన శ్యామల ముఖం

# అసురసంధ్య

(28 వ పేజీ తరువాయి)

హృదయపూర్వకంగా శ్యామల పలుకరించిన మైత్రి, గురుసన్నిధిలో అతనివేపు చూసిన పిరికి చూపులు తన స్వగృహంలో అన్నగారితో సహా అతనితో వాదించిన బుద్ధి కుశలత—ఏమేమో జ్ఞాపకాలు వచ్చేవి నిద్ర వేళలకి. ఆ మధుర స్మృతుల పరిమళాలలో తృప్తిగా నిద్ర పట్టేది—ప్రసాదరావుకి

అది కాలేజీలో మూడవ సంవత్సరం. పరిక్షలూ, పాఠాలూ, క్రీడలూ, చర్చలూ వగైరా కళాశాల వాతావరణపు కార్యక్రమాలతో ప్రసాదానికి రోజులు గడుస్తున్నాయి. అతనికి, విశ్వమంతా సౌందర్యమయంగా కనిపించింది. తీర్చి చెప్పలేని మాధుర్యం హృదయాన్ని ఆవరించింది. తన శ్యామలని చూడనంతసేపూ మనస్సు బాధగా వుండేది. పరిచయం ప్రేమగా పరిణమించింది.

ఉద్యోగం దొరికిన తరువాత అమ్మకి శ్యామల విషయం చెప్పవచ్చు. ఇప్పుడు తొందరేమిటి అనుకున్నాడు, ప్రసాదం. అయినా చెప్పినా అమ్మకి అంత సానుభూతి రాదు, చదువుకున్న పిల్లలమీద. శ్యామలని అమ్మ అర్థం చేసుకున్న తరువాత విషయం చెప్పవచ్చు. అమ్మకి మాత్రం ఈ పరిస్థితులేవీ

> పరువు ప్రతిష్ఠలు గల పెద్ద మనిషిప్లీడరుగారి సహాయంతో వీలునామా తయారు చేస్తూ, అందులో తన ప్రత్యేకమైన అభిమతాన్నొకదాన్ని ఇరికించవలసిందని కోరాడు. పెద్దమొత్తాలు తనకు అప్పు పెట్టిన నలుగురు స్నేహితుల పేర్లు ఉదహరిస్తూ తన మరణానంతరం వాళ్ళే తన శవ వాహకులుగా ఉండాలని ఆ కోరిక.
>
> "అదేమిటి? వాళ్ళెందుకుండాలి?" అని ప్లీడరుగారి ప్రశ్న. "పాపం! ఇంతవరకూ పడిపోకుండా నన్ను మోసుకొస్తున్నారు. ఆఖరి ప్రయాణం కూడా వాళ్లే చేయించేస్తే మంచిది."
>
> వి. శివరామయ్య (బాపట్ల)

ఛాయా మాత్రంగా కూడా తెలియవు.

ఆఖరు సంవత్సరం, లేత వేసవిలో, పరీక్షలు నెగ్గి, ఉద్యోగి అయిన తరువాత వివాహ మాడతానని శ్యామలకి ప్రేమతో వాగ్దానం చేసాడు. ప్రసాదం. శ్యామల ఆరోజుకోసం బ్రతికివుంటానంది.

ఎండలు ముదిరినాయి. యం. ఏ. పరీక్షలు కూడా అయిపోయినాయి. రోజులు గడిచినాయి. ఫలితాలు వచ్చేసాయి. ప్రసాదం ప్రథమ శ్రేణిలోనే ప్యాసు అయ్యాడు. ఉద్యోగాన్వేషణ మొదలెట్టాడు. లాభంగా లేదు.

ఒకనాడు తల్లి ధైర్యం చెసుకుని "బాబూ! మనం వచ్చిన పని అయిపోయింది,గదురా. ఇంకా ఎందు కిక్కడ అనవసరంగా మనం. వృధాగా ఇంటి బాడుగ ఇచ్చుకుంటూ. గ్రామానికి వెళ్ళిపోదాం. అక్కణ్ణించే నీవు ఉద్యోగానికి ఉత్తరాలు వ్రాయవచ్చుగా" అంది.

ప్రసాదానికి భయం వేసింది. శ్యామలని వదలి దూరంగా వెళ్ళడం ఎల్లా? తొందరలో ఉద్యోగం వెతుక్కోవాలి. అవును అమ్మని గ్రామంలో వదిలిపెట్టి, అవసరమైతే ముఖ్య పట్టణంవెళ్ళి పెద్దలని కలుసుకోవాలి. బరువుగానే "సరే" అన్నాడు.

ప్రయాణంనాడు శ్యామలకి వీడ్కోలు చెప్పాడు ఏకాంతంగా, దైవ సన్నిధిలో.

తుదిసారి తనూ, శ్యామల కలిసి చదువుకున్న కాలేజీ ఒక్కమాటు చూచి పోదామని వెళ్ళాడు. కాలేజీ ఆవరణఅంతా నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వుంది — ఆ మిడి మిడి ఎండలో మర్రిచెట్లలోనించి కపోది పక్షులు వ్రేళ్ళాడుతున్నాయి. లెక్చరు హాలు ఎదురుగా తెల్ల గన్నేరు చెట్టు ఆకులన్నీ రాల్చి మొండిగా నించునివుంది. ఆ దిశ కొమ్మల కొసల పువ్వులు గుత్తులలోనించి, అపుడపుడూ, శబ్దం లేకుండా ఒక్కొక్క తెల్లటి పువ్వు క్రిందికిరాలి పడుతూంది—అశ్రు బిందువులా.

ప్రసాదం కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి తిరిగి వచ్చాడు. ఎండలు చల్లారినయి. నీడలు చీకటిలో కరిగిపోయే వేళకి రైలు కదిలింది.

ఆ అమాయకపు అమ్మకి ఇవ్వేవీ తెలియవు గ్రామం తిరిగి వచ్చిన తరువాతనించీ ప్రసాదం అదోక మోస్తరుగానే ఉన్నాడు. ఇంటి వ్యవహారాలు, విపులంగా చెబుతూంటే, అతను వినే ధోరణిలోవున్నట్లుగానే లేదు. లక్ష్మిదేవిగారికి ధైర్యం రావడం లేదు, కొడుకు మౌనం చూచి. "ఏమిటీ మార్పు తండ్రీ నీలో?" కాని ఆ ప్రశ్న ఆమె నోటినించి బయటికి మాత్రం రాలేదు.

ఆఖరుకి ధైర్యం చేసుకుని ఈనాటి సాయంత్రం గదా, కాస్త ప్రస్తావించింది—ఇంతలో ఇల్లా, వద్దని వెళ్ళిపోయె. బయట వర్షం బాగానే కురుస్తూంది. కాని ఆవిడకి గాలి కూడా సోకడంలేదు. అసలు ఈ వేళ కలహం, ఎల్లా వచ్చిందో బలవంతంగా గుర్తు తెచ్చుకుంటూంది, లక్ష్మిదేవిగారు

"ఉద్యోగం విషయం నేను స్వయంగా వెళ్ళి చూచుకోవాలమ్మా. ఇక్కడేవుంటే, దొరికే టట్లుగా లేదు" అన్నాడు ప్రసాదం మధ్యాహ్నం కాఫీ అయ్యాక — కాస్సేపటికి. "ప్రసాదం నువ్వు ఇలా

పాస్ అయ్యావని, మీ మామయ్యకి ఏమిగ పెక్కి వంత సంతోషంగా వుందిరా" అంది ఆవిడ. ప్రసాదరావు పట్టించుకోలే. ఆమె తిరిగి "నివ్వింత విద్యావంతుడవయి, వృద్ధిలోకి వస్తావని, వాడు......" అంటూండగా,

"ఏం ఎదురు చూస్తున్నాడా ఆయన ?" అన్నాడు ప్రసాదం, వినుగ్గా.

"కాదురా, కనకవర్షం కురిపించాడు" అంది. ప్రసాదం తెల్లబోయాడు. కొంచెం తేరుకుని "ఆయన డబ్బుతోనా, నాకు చదువు చెప్పించావు? ఎంతపని చేసావమ్మా! నేను కాలేజీలో ఉన్నప్పుడు క్రొత్తరోజుల్లో ఎన్నిసార్లు నిన్ను తడినీళ్ళు అడిగాను కూడాను చూచాయగా. ఫరవాలేదురా, నగలు అమ్మేను అన్నమాట తప్ప రెండో మాట చెప్పవయితివే!" క్రొత్త స్వరం అన్నాడు—ఎదురుగా శూన్యంలోకి చూస్తూ.

లక్ష్మీదేవిగారికి తన ముద్దుబిడ్డ ఎందుకింత బాధపడుతున్నాడో తెలియలే.

మరి కొంచెంసేపాగి "మరి అపుడే నాతో ఎందుకు చెప్పలేదు ?" అన్నాడు. అమ్మ మౌనం.

మరి కాస్సేపాగి "దీనికి ఎంత వడ్డీ వేసాడు?"

"వడ్డీ లేదురా" అంది లక్ష్మీదేవిగారు కొంచం తప్పరిల్లి. "వాళ్ళ దుర్గని నీకిచ్చి పెళ్ళిచేసే ఏర్పాటుమీద" చిరునవ్వు కళ్ళతో.

"ఆఁ!" అన్నాడు ప్రసాదం వెర్రిగా, ఆశ్చర్యంగా. కొంచం సేపటికి గొంతు వచ్చింది పెళ్ళగించుకొని "ఎవ్వరి ఏర్పాటు ఇది?"

"నేనూ, మీ మామయ్యారా. లేకపోతే, ఇన్ని వేలు ఎల్లా ఖర్చు పెడతాడు? ఊఁఅకే. అందులోనూ మీ మేనత్త తెచ్చిన ఆస్తే ఎక్కువ వాళ్ళకి. ఆవిడా ఊఁ ఆశవల్లనే, నీకోసం, వాణ్ణి ఇల్లా ఖర్చు పెట్టనిచ్చింది" అంది పరవాలేదుగదా అనుకుంటూ.

ప్రసాదంనోట బదులు రాలేదు. ఒక నిశ్శబ్దంతో స్వరాలలాగు వినిపిస్తున్నాయి, కన్నతల్లి మాటలు.

"అంతా నీ మేలుకోరే గదురా!"

"ఆఁ! నామేలా! ఎంత ఘోరం జరిగింది" ప్రసాదానికి తల తిరుగుతూంది.

ఆ వెర్రితల్లికి ఇంకా ఏమీ అర్థం కావడం లేదు. "మరీ...ముహూర్తం ఎప్పుడు పెట్టమంటావురా?" ప్రసాదానికి స్పృహ వచ్చింది.

"ఇదిగో ఇప్పుడే!" అన్నాడు ఛటాలునలేచి "ఇక తిరిగిరాను" అని వెంటనే వెళ్ళిపోయాడు, అంతే.

ఇదీ జరిగిన కలహం. ఇప్పుడంతా స్ఫురణకొస్తూంది. బయట గాలి వాన మెండయింది. దక్షిణాన్న గోవలేరుపొంగి గట్లు తెంచుకుని వూళ్లోకి వచ్చింది. చిన్న ఇండ్లవాళ్లూ, పల్లపు ఇండ్లవాళ్లు పెద్ద ఇండ్లల్లోనూ మేడల్లోనూ దాక్కున్నారు.

లక్ష్మీదేవిగారిఇల్లు వూగిసలాడుతూంది. రెండు తలుపులు విరిగిపడిపోయినాయి. లక్ష్మీదేవిగారు అల్లాగే కూర్చునే ఉండిపోయింది. పొంగి పొంగి దుఃఖం వస్తోంది.

భద్రయ్యగారి కొడుకు తడిసి ముద్దయి వచ్చాడు. అతన్ని చూడంగానే ఇంకా ఘోరున ఏడ్చింది, లక్ష్మీదేవిగారు. "నా కొడుకు ఏడీ?" అంది వెర్రిగా. బలవంతంగా వాళ్ళ ఇంటికి తీసుకుపోయాడు అతను, ఆవిడ్ని సగం స్పృహతో తీసుకొచ్చినంతా. అతికష్టంమీద జరిగినదంతా చెప్పించుకోగలిగారు భద్రయ్యగారూ, ఆయన కుటుంబమున్నూ. "వాడు బాగున్నాడంటారా?" అంది దీనంగా. "అంత భోళ్తుగా చిన్నవాడా అమ్మా. ఏం భయంలేదు వాడికి. మీరు నెమ్మదిగా వుండండి" అన్నారు, భద్రయ్యగారు "వర్షానికి ఎక్కడా తడిసిపోవడం లేదుగదా!" అంది. పోతూన్న మతిని చిక్కపట్టుకుంటూ "ఎక్కడైనా దాక్కొకుండా వుంటాడాండీ. వాడి సుఖము వాడికి తెలియదూ" అన్నాడు భద్రయ్యగారి కొడుకు. "చాలు బాబూ! వాడు సుఖంగావుంటే" అంది. క్షణికమైన కాంతి కళ్ళల్లో మెరిసింది. వెంటనే తలవంచుకుని కూచుంది గోడని ఆనుకుని.

రాత్రి అంతా ఉరుములు మెరుపులతో వర్షం నిర్విరామంగా.

లక్ష్మీదేవిగారు నిబ్బరంగా చూడ్డానికి ప్రయత్నిస్తూంది, దగ్గర నిలుచున్న ప్రతివాళ్ళని "నా ప్రసాదం బాగున్నాడంటావా తడవకుండా?" అంది ఆశగా.

భద్రయ్యగారి దొడ్లో బాదం చెట్టు విరిగి, ఎగిరింది గాలిలో. చిన్న ఇండ్ల కప్పులు విరిగి నీళ్ళల్లో తేలిపోతూన్నాయి. వీధుల్లో, పల్లాల్లో నీళ్ళు రొమ్ము లోతు వచ్చినయి. ప్రతి కిటికీ నీ పశువుల్ని కొట్టుకుపోతున్నాయి. భద్రయ్యగారూ, ఆయన కొడుకూ బయటికి టార్చిలైట్లు వేసి చూస్తూ ఇటూ అటూ తిరుగుతూ నీళ్లల్లోనించి వచ్చే వాళ్ళని వేదుకుంటున్నారు—ధైర్యం చెబుతూ.

> ఒక గురువుగారి ఇంటిలో మరచెంబు పోయింది. గురువుగారు ఇల్లంతా వెతికి శిష్యుడికి తెలుసేమోనని అడిగారు.
>
> గు : ఏరా శివయ్యా? నా మరచెంబు కనబడటంలేదు. నీవు చూశావురా?"
>
> శి : అదేనాండీ! మీరు రోజూ మంచినీళ్ళు త్రాగుతూ వుండేవారు.
>
> గు : అవునురా అదే.
>
> శి : మొన్న నాకు మంచి నీళ్లు కూడ యిచ్చారు ఆ చెంబొండీ.
>
> గు : మరేరా అవును.
>
> శి : తేలుకుడితే చిల్లిపడిందని నన్ను మాటించుకు రమ్మని పావులా యిచ్చి పంపారు. ఆ మరచెంబేనాండీ.
>
> గు: నన్ను చంపక. ఆ చెంబేరా నీకు తెలుసా?
>
> శి: ఆ చెంబయితే నాకు తెలియదండీ గురువుగారూ.
>
> కస్తూరి సుబ్బారావు (సికింద్రాబాదు)

బయట వర్షం నిలబడి కురుస్తోంది. లక్ష్మీదేవిగారు సొమ్మసిల్లిపడిపోయింది. ఏడుపు రావడం లేదు.

సూర్యోదయానికిముందే గాలి ఆగిపోయింది. వర్షం తగ్గింది. నీళ్ళల్లోనించి కూడా మనుష్యులు తీసుకుంటూ, జనమూ గాబరాగా తిరుగుతున్నారు.

తూర్పారే వేళకి భద్రయ్యగారి కొడుకు, బయటనించి పరుగెత్తుకుంటూ వచ్చి "అమ్మా, అమ్మా" అని అరిచాడు. లక్ష్మీదేవిగారు ఖంగారుపడి లేవబోయింది "బాబూ వాడు బాగున్నాడటనా? ఏ ఊళ్ళో వున్నాడు ?" అంది మతి లేకుండా, వెనక్కి కూచోబడిపోయింది, వెంటనే. "అదుగో మన ప్రసాదాన్ని చూచాను. మీరింకా మీ ఇంట్లోనే వున్నారనుకొని అక్కడికి వెళ్ళాడుట" నిలువుడు లోతు నీళ్ళల్లోనించి ఈదుక్కుంటూను—వాళ్ళంతా చెబుతూంటేనా!" అన్నాడు వగరుస్తూ.

'ఆఁ! ఆఁ! ఏడీ నా తండ్రి తిరిగి వచ్చాడా! అమ్మ దగ్గరికి వచ్చాడా? నాకు దిక్కుందా? తడికాడా బాబూ, చూచావా ?" అంది లక్ష్మీదేవిదృష్టి అతనిమీదనే నిలపడానికి ప్రయత్నిస్తూ.

"అదిగో చూడండి, బయటికి, ఆ పెద్ద రోడ్డుమీద" అన్నాడు బయటికి వేలుఉ చూపిస్తూ గుమ్మంలోనించి, "అదిగో, ఆ కారు కనబడడంలే తెల్లది? అప్పైని రెండు గీతలులేవు నిలువుగా అడ్డంగా ఎర్రని—అది—అందులో అదండీ—అదిగో. తడిసిపోయి ఏమైనా గరు, కూడా వరిగెట్టడంలే? కారు కూడా. ఆ కారు, దాంట్లో వున్నాడు ప్రసాదం. నేను పోవాలి కూడా" అన్నాడు.

గబ గబ శ్వర్మ వేసుకుంటున్నాడు. "ఆ కారులోవున్న వర్కారు డాక్టరుని అడిగాను. మీ ఇంట్లోకి వెళ్ళంగానే ఇల్లు విరిగి దూలం కాళ్ళమీద పడ్డదట. కంటికి కూడా ఏదో తగిలినట్టుగా వుంది. కాళ్ళు రెండూ తీసెయ్యాల్సివస్తుంది అన్నారు డాక్టరు. ప్రాణభయంలేదు. ఆస్పత్రికి పోతూంది కారు" అని వూపిరి తిరగకుండా చెప్పి పరుగెత్తుకు పోయాడు—బయటికి. ★



కె. ఎ. యస్. వారి 'పాపాలభైరవుడు'లో అంజలీదేవి.



మహేంద్రా పిక్చర్సువారి "కృష్ణప్రేమ"లో బాలయ్య, గిరిజ, పద్మనాభం.

# నిర్మాతల లోపాలకు ప్రేక్షకులా బాధ్యులు!

"మన ప్రేక్షకులకు ఈనాడు ఇంతకన్నా గొప్ప చిత్రాలు తీయనవసరంలేదు" అని నిర్ణయిస్తూ ఈమధ్య ఆంధ్ర సచిత్ర వార పత్రికలో "ఒక నిర్మాత" గారు వ్రాసిన వ్యాసంచూచి విస్తుపోయాను. "కల్తీ సరుకుల వాడకానికి ప్రజలు అలవాటు పడ్డారు కాబట్టి కల్తీలేని సరుకులు వారికి అనవసరం. ఒకవేళ ఇచ్చినా వారు వాటిని తిని అరిగించుకోలేరు" అని చిల్లరకొట్టు వర్తకుడు వాదిస్తే ఏమి చెయ్యగలం చెప్పండి. ప్రజలు ముఖ్యంగా పట్టణాలలో నివసించేవారు (ఆ మాటకొస్తే గ్రామాలలో నీతి, నిజాయతీ నాలుగు పాదాల నడుస్తున్నాయనికాదు) కల్తీ సరుకులకు అలవాటు పడిన మాట నిజమే. అంత మాత్రంచేత కల్తీలేని సరుకులు అందజేస్తే వారు తిని అరిగించుకోలేరని అనటంగాని, అనుకోటంగాని, అనుకునేవారి ఆలోచనా పద్ధతిని తెలియజేస్తాయిగాని ప్రజల అభిరుచిని తెలియజేయవుగదా! మనం ఈనాడు చెత్త సినిమాలు చూస్తున్నమాట యధార్థమే. వీటికి కొంతవరకు అలవాటు పడ్డామన్నా తప్పులేదు. కాని మనకు ఇంతకన్నా మంచి చిత్రాలు తీయనవసరంలేదంటేనే వస్తోంది చిక్కు.

సినిమా తీయటమంటే లక్షలతో కూడిన వ్యవహారమనీ, కళాఖండాలుతీస్తే చూచే నాధుడు ఉండడనీ, పెట్టిన డబ్బు అయినా రాకపోతే నిర్మాత మట్టి కొట్టుకుపోతాడనీ పదేపదే చెప్పి ప్రయోజనంలేదు. తన చిత్రాలు నలుగురుచూసి, నాలుగు డబ్బులు రావాలని ప్రతి నిర్మాత అనుకోటం అబ్బురమేమీకాదు. "కళ"ను ఉద్ధరిస్తున్నామనుకుంటూ ఎవ్వరూ చూచి ఆనందించలేని చిత్రాలుతీసి, తీరా వాటిని విడుదల చేసిన తర్వాత డబ్బు రాకపోతే "చూశారా నేను కళాఖండంతీస్తే ఏగతి పట్టిందో. అసలు ఈ జనానికి మంచి సినిమాలు చూసే తాహతులేదు" అని ప్రజలను ఆడిపోసుకున్నా ప్రయోజనంలేదు. నాలుగు డబ్బులు చేసుకున్న చిత్రాన్ని పరిశోధించి ఫలానా కారణాలవల్ల దీనికింత డబ్బు వచ్చిందని తేల్చుకుని (కొన్ని మూఢ నమ్మకాలతోసహా) తు. చ. తప్పకుండా వాటినే అనుసరించినా జేబులు నిండక తెల్లమొహం వేసిన నిర్మాత లెంతమందిలేరు?

విడుదల అయిన చిత్రాలలో నూటికి 80 చిత్రాలకుపైగా ఎందుకు దెబ్బ తింటున్నాయి? ఈ దుస్థితికి కారణం ఏమిటి? ఎందువల్ల ప్రజలు వీటిని చూడటంలేదు? ఇవి చాలా ముఖ్యమైన ప్రశ్నలు. విజయవంతమైన చిత్రాలను పరిశోధించి వాటిలోఉన్న చిట్కాలను తెలుసుకొనడానికి ప్రయత్నించేకంటే, ఈ ప్రశ్నలకు సరియైన సమాధానాలు తేల్చుకుని చిత్ర నిర్మాణానికి పూనుకుంటే నిర్మాతలు ఇంతగా నష్టపోవలసిఉండదేమో.

"తెలుగు వారికి ఇంకా జానపద, పురాణ గాధల మీద అభిమానం తగ్గలేదు" అని "ఒక నిర్మాత" గారు సెలవిచ్చారు. వరసగా కొన్ని సంవత్సరాల పాటు ఎలాంటి చిత్రాలకు డబ్బు ఎక్కువగా వస్తోందో పరిశీలించి (వారొక జాబితా ఇచ్చారు లెండి!) తామీ నిర్ణయానికి వచ్చినట్లు ఆయన చెబుతున్నారు. కాని ఈమధ్య, కాలంలో జానపద పురాణ గాధలు ఇతివృత్తాలుగా గల ఎన్ని చిత్రాలు, విడుదలైన రెండు మూడు వారాలలోనే నామ రూపాలు కనిపించకుండా పోలేదు? ఇందుకు కారణం ఏమిటో తెలుసుకొనడానికి సినిమా పండితులు బుర్రలు బద్దలు కొట్టుకుంటున్నా అంతు చిక్కటంలేదు. ఫలానా రకం కధలుంటేనే చిత్రాలు చూస్తాం అని ప్రేక్షక మహాశయులు ముఖాముఖి చెబితే వీరికి ఈశ్రమ ఉండకపోను. అసలు విషయమేమంటే ప్రజలు ఏ మాటా ముందు చెప్పరు. తీరా చిత్రాన్ని విడుదల చేసిన తరువాత

54-వ పేజీ చూడండి)

## చిత్ర సమీక్ష :



సింధూర్ ఫిలిమ్స్ "ఎవరు దొంగ"లో బి. సరోజాదేవి



సింధూర్ ఫిలిమ్స్ "ఎవరు దొంగ"లో నాయికా, నాయకులు బి. సరోజాదేవి, ఉదయకుమార్

హుషారైన కత్తియుద్ధాలు, పసందైన ప్రేమ కలాపాలు, రమణీయమైన ప్రకృతి దృశ్యాలు .... ఇలా చిత్రవిజయానికి కావలసిన అన్ని హంగులు సింగారించుకున్న చిత్రం సింధూర్ ఫిలిమ్స్ "ఎవరు దొంగ ?". ఈ చిత్రాన్ని యిటీవల విజయా స్టూడియోలో పత్రికేయులకు ప్రదర్శించారు.

టూకీగా ఈ టాకీ (చిత్రం) కథ ఇది

ఏకాంబరం అనే జమీందారు తన ఎస్టేటులో తిరుగుతుండగా ఏనుగు వెంటబడుతుంది. ఆ ఏనుగువల్ల అపాయం రానున్న తరుణంలో ఆ ప్రాంతంలో పోతున్న శంకర్ అనే మావటీవాడు యుక్తిచే ఏనుగ తోక పట్టుకు లాగి దాన్ని తరిమి వేస్తాడు. ప్రాణం రక్షించిన శంకర్‌ను తనతో పాటు వుండి ఎస్టేటు పనులన్నీ చూడవలసిందిగా కోరుతాడు. శంకర్ అంగీకరించి ఏకాంబరం సొంత ఏనుగకు మావటీడుగాను ఉంటాడు. ఏకాంబరంకు శంకర్‌ను చూడగానే చిన్నతనంలో తప్పిపోయిన తన కొడుకు స్మృతికొస్తాడు. ఏకాంబరం యింట్లో ఉంటున్న కనకయ్య శంకర్‌కు దోస్తు అవుతాడు

శంకర్ కంటె ముందు తనను చిరుతబారి నుంచి తప్పించబోయి తానే మరణించిన ఒక బాట సారి భార్య, గిరిజను, జమీందారు తన యింట్లో చెల్లెలిగా చూస్తుంటాడు. ఆ గిరిజ కూతురు లీల తప్పిపోగా చిన్నస్వామి అనే మరో జమీందారు అడవిలో చూచి (చిన్న అమ్మాయిని) తీసుకుపోయి పెంచి పెద్ద చేస్తాడు లీలకు మరొక అనాథ బాలిక మల్లి స్నేహితురాలు.

లీల ఏనుగుల చిత్తవృత్తులు గమనించి, వాటిని గూర్చి వ్రాయాలనే తలంపుతో తండ్రి (జమీందారు) అనుమతితో మల్లితో సహా ఏకాంబరం ఎస్టేటుకు గుర్రాలపై వస్తుంటారు. మల్లి—లీల వేరుపడతారు. ఎలుగుబంటి వాతన పడిన లీలను ఎస్టేటులో తిరుగుతున్న శంకర్ రక్షించి ఏకాంబరం యింటికి చేర్చుతాడు. తొలి చూపుల్లోనే ప్రేమించుకొంటారు. మల్లిని కనకయ్య అడవిలో కలుసుకుని ఏకాంబరం యింటికే తీసుకు వస్తాడు.

ఏకాంబరం స్నేహితుని కొడుకైన మేఘనాథుడు ఏకాంబరం యిల్లు చేరి, అక్కడే ఉండి ఎస్టేటు పనులు చూసుకునేందుకు అంగీకరిస్తాడు. ఎస్టేటు లోని చెట్లు కొట్టుకుపోతున్న దొంగల ముఠాకు చిక్కి మేఘనాథుడు తన పూర్వపు స్నేహితుడు, దొంగలముఠా నాయకుణ్ణి కలుసుకుని క్రమంగా ఎస్టేటును స్వాహా చేయడానికి ప్లాను పన్నుతాడు. తమకు అడ్డుగా ఉంటున్న శంకర్‌ను అంత మొందించాలని ప్రయత్నిస్తాడు. శంకర్‌పై చెడ్డగా ఏకాంబరానికి చెప్తాడు. చివరకు చెట్లు కొట్టుకుపోతున్న ముసుగు వీరుడు శంకర్ అని ఋజువు చేసేందుకై ఒంటరిగా పోతున్న శంకర్‌ను



సుప్రసిద్ధ నాట్యతార పద్మినికి, డా॥ కె. టి. రామచంద్రన్‌తో ఇటీవల వివాహం జరిగింది. వధూవరులను మద్రాసులో సినీ ప్రముఖులు అభినందించారు. చిత్రంలో: రామచంద్రన్, పద్మిని, అంజలీదేవి.

బంధించి తెస్తాడు. ఏకాంబరం మాటలతో అవ మానపడిన శంకర్ నిజమైన ముసుగు దొంగను పట్టి చూపుతానంటాడు. లీల విజ్ఞప్తిపై అక్కడే ఉండి ఉంటాడు. ఇంత జరిగినా తమకు ఉపయోగపడని ఎస్టేటును దొంగలముఠా కాల్చి వేయ ప్రయత్నించగా శంకర్ తన అనుచరులతో పోయి ఆర్పి దొంగల ముఠాను హతమారుస్తాడు. ముసుగులో ఉన్న మేఘనాధుణ్ణి చంపేటప్పటికి, ఈ సమాచారం తెలిసిన ఏకాంబరం అక్కడికి వస్తాడు. మేఘనాధుని మాటలు నమ్మి శంకర్‌ను అనవసరంగా అన్న మాటలకు పశ్చాత్తాప పడ తాడు. దైవ సంఘటనల ఫలితంగా శంకర్ తన కొడుకేనని తెలుసుకొంటాడు. లీలను పెంచిన చిన్నస్వామి జమీందారు అమెరికానుండి వచ్చి లీల వృత్తాంతం చెప్పగా, లీల గిరిజ కూతురేనని తెలుస్తుంది. లీలా, శంకరంలను, మల్లి—కనకయ్య లను ఏకాంబరం ఆశీర్వదిస్తూ చేతులు కలుపు తాడు.

నాయికగా బి. సరోజాదేవి, నాయకుడుగా ఉదయకుమార్ చక్కగా నటించారు. కనకయ్య ప్రేమకలాపం ప్రేక్షకులను కవ్వించి నవ్విస్తుంది. "పదహారు కళలలోను" అనే పాట సందర్భో చితంగాను, విన సొంపుగాను ఉంది.

ఏదీ మరీ మితిమీరకుండా సామాజిక అంతస్థు లనే వాటి ప్రభావాన్ని చూపెట్టేట్లుగానూ, శ్రీశ్రీ కథారచన సాగించా రనిపిస్తుంది.

ప్రేక్షకులకు ఉత్తేజాన్ని కల్గించగల సరం జామా అంతా రంజుగా ఇందులో ఉంది. కాల క్షేపం కావాలనుకుంటే కలిసివచ్చే చిత్రం ఈ ఎవరు దొంగ. దర్శకుడు: యం. ఎం. తిరుముగం. సంగీతం: కె. వి. మహాదేవన్. రచన: శ్రీశ్రీ.

"రామచంద్ర" ★

---

# వార్తాభరణం

ప్రసిద్ధ నాట్యతార, తిరువారువాన్కూరు సోదరీమణిత్రయ మధ్యమ, కుమారి పద్మిని, గురువయ్యూరులో శ్రీ కృష్ణదేవుని సాన్నిధ్యంలో బంధుమిత్రుల ఆనంద కోలాహలధ్వానాల మధ్య గతనెల 25 వ తేదీ ఉదయం (8—35) పవిత్ర ముహూర్తంలో పద్మినీ రామచంద్రన్‌గా మారింది. ఈ శుభమహోత్సవానికి వధూవరుల బంధు మిత్రులు వేలాది సంఖ్యలో హాజరై ఆశీర్వ దించారు. చలనచిత్ర రంగంలో ప్రసిద్ధికెక్కిన పలువురు ప్రముఖులు శ్రీయుతులు కె. సుబ్ర హ్మణ్యం, గోపీనాథ్ (డాన్సర్), నటులు జి. కె. పిళ్లె, ఎస్. పి. పిళ్లె, నిర్మాతలు ఎల్. శ్రీని వాసన్, టి. ఇ. వాసుదేవన్, ఎ. సి. పిళ్లె, భాస్కరన్, ఎస్. ఎం. ఎస్. నాయుడు, శ్రీమతులు ఎం. ఎల్. వసంతకుమారి, టి. ఎ. మధురం ప్రభృతులు ఈ వివాహ సందర్భంలో హాజరయ్యారు.

గతనెల 30 వ తేదీన మద్రాసులో ఆబట్సు బరీలో విందు జరిగింది. శ్రీమాన్ రాజాజీ (స్వతంత్ర పార్టీ వ్యవస్థాపకులు స్వయంగా హాజరై) వధువు పద్మినిని, వరుడు డా. కె. టి. రామచంద్రన్‌ను ఆశీర్వదించారు.

చలనచిత్ర పరిశ్రమలో వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు శ్రీమతులు అంజలీదేవి, కన్నాంబ, జమున, కృష్ణకుమారి, షావుకారు జానకి, యం. యన్. రాజం, శ్రీయుతులు ఆదినారాయణరావు, రాఘవన్, రాజేంద్రన్, సారంగపాణి, మనోహర్, బాలాజీ



రామచంద్రన్, పద్మిని, జమున.

ప్రభృతులు హాజరయ్యారు. డా. రాజేంద్రప్రసాద్ ప్రధాని నెహ్రూ, ఎలిజబెత్తు రాణి, ఎడింబరో రాకుమారుడు, కె. పి. యస్. మీనన్ శుభాకాంక్షలు పంపించారు.

శ్రీమతి లలిత అతిథి సత్కారం చేశారు. శ్రీమతి యం. యల్. వసంతకుమారి శాస్త్రీయ సంగీత కచ్చేరీతో ఆహూతుల నానందింపజేశారు. వధూవరులకు మా శుభాకాంక్షలు.

## "బహుమానం ప్రారంభోత్సవం"

శ్రీ కె. యల్. కె. పిక్చర్స్ అనే కొత్త సంస్థ చిత్ర నిర్మాణానికి ప్రయత్నాలు చేస్తోంది. వీరి చిత్రం "బహుమానం"కు ఇటీవలే గోల్డెన్ స్టూడియోలో ప్రారంభోత్సవం జరిగింది. రెండు పాటలు రికార్డు చేశారు.

ఈ చిత్రానికి నిర్మాత : శ్రీమతి కావేటి లక్ష్మీ కాంతమ్మ. దర్శకత్వం : కమలాకరం కామేశ్వరరావు. మాటలు : నరసరాజు, పాటలు : వడ్డాది, కొసరాజు బి. వి. యస్. ఆచారి.

బాలయ్య, రాజనాల, రాజశ్రీ ప్రభృతులు నటించనున్న ఈ చిత్రం త్వరలోనే సెట్సుకు వెళ్ళనున్నది.

నిర్మాతలు, 'నాగలపురి' అనే క్రొత్త సంగీత దర్శకుణ్ణి ఈ చిత్రంతో ఆంధ్ర ప్రేక్షక లోకానికి పరిచయం చేయబోతున్నారు.

## చిత్రంపేరు మార్పు

రోహిణీ ఫిలింసువారి సాంఘిక చిత్రంపేరు మార్చారు. "తల్లీ—బిడ్డలు" అని కొత్త పేరు పెట్టారు.

ఈ చిత్రంలో బాలయ్య, కృష్ణకుమారి, రాజశ్రీ మీనాకుమారి, హరనాథ్, నాగయ్య. లింగమూర్తి, శివరావు నటిస్తున్నారు . రచయిత, నిర్మాత : యడ్లపల్లి లక్ష్మీనారాయణ. దర్శకుడు: పి. యస్. శ్రీనివాసరావు. ఛాయ : కె. యస్. ప్రసాద్, సంగీతం : శంకరరావు.

## తర్జుమా చిత్రం 'కొరడావీరుడు'

యం. యస్. యం. మూవీస్ అనే సంస్థ "చౌకడి చంద్రకాంత" అనే తమిళ చిత్రాన్ని తెలుగులో కొరడా వీరుడుగా సమర్పిస్తున్నారు. ఈ, చిత్రంలో జానకి, టి. లలిత, వీరప్ప, బాలయ్య. టి. కె. రామచంద్రన్ ప్రభృతులు నటించారు. మాటలు : అనిసెట్టి, పాటలు : వేణుగోపాల్, సంగీత పర్యవేక్షణ యం. రంగారావు. ఈ చిత్రానికి జె. పురుషోత్తం అనే నూతన సంగీత దర్శకుడు సంగీతం నిర్వహిస్తున్నారు.

ఇటీవల జయంతి స్టూడియోలో జిక్కి, పి బి. శ్రీనివాస్, బస్వేశ్వర్ పాడిన పాటలను (రెండు) రికార్డు చేశారు. చిత్ర నిర్మాత. ములుకుట్ల సుబ్రహ్మణ్యం. చిత్రాన్ని జూలైలో విడుదల చేయాలని ప్రయత్నాలు జరుగుతున్నై.

## భారతదేశంలో టెలివిజన్ ఆవశ్యకత

భారతదేశంలో టెలివిజన్ పరిశ్రమ అభివృద్ధి పొందేందుకు దోహదం చేయాల్సిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ, ప్రముఖ చలన చిత్రదర్శక నిర్మాత—స్టూడియో యజమాని శ్రీ బి. యస్. రంగా ఇటీవల విజ్ఞప్తి చేశారు.

ఈ టెలివిజన్‌వల్ల చలన చిత్రరంగానికి ఎలాంటి అపాయమూ లేదని, ఇతర దేశాల్లో లాగానే భారత దేశంలో కూడా టెలివిజన్ పరిశ్రమ పెంపొందేందుకు తగిన పరిస్థితులను ప్రభుత్వం కల్పించాలని, అయితే ఈ టెలివిజన్ స్థాపన అనేది ప్రయివేటు రంగంలో ఏర్పడితే బాగుంటుందని శ్రీ రంగా అన్నారు.

## అర్జంటైనాలో భారతీయచిత్రాలు

అర్జంటైనాలో భారతీయ చిత్రాలు విడుదల చేస్తే చాలా (వ్యాపార రీత్యా) లాభం కలుగుతుందని, మనదేశంలో అర్జెంటైనా రాయబారి డా. రికార్డో మాస్క్వేరా ఈన్స్‌మాన్ ఇటీవల పెరంబూరో రైలు పెట్టెల కర్మాగారం దర్శించిన సందర్భంలో తెలియజేశారు. ★



'మోడరన్ గరల్ చిత్రం'లో వివియన్, నళినీషాంకర్.



శ్రీకాంత్ ప్రొడక్షన్స్‌వారి "సతీసులోచన"లో ఒక ఘట్టం.

# నిర్మాతల లోపాలు...

(49 వ పేజీ తరువాయి)

నిర్మాత దాని కర్మానికి దానిని వదిలి వేయడం తప్ప చేయగలిగిందేమీలేదు. ప్రజలు తమకు తోచిన విధంగా తీర్పు చెబుతారు. ఆ తీర్పు ఏమిటో రాబడినిబట్టి నిర్మాత అంచనా వేసుకుంటున్నాడు. యదార్థానికి ప్రజలు కొన్ని జానపద పౌరాణిక చిత్రాలను ఎంతగా అభిమానించారో కొన్ని సాంఘిక చిత్రాలను కూడా కొంచం హెచ్చు తగ్గుగా అంతగానే అభిమానించారు. ఇందుకు ఉదాహరణలకోసం అట్టే వెతుక్కో నవసరంలేదు. ఇతివృత్తం జానపదమైనా, పౌరాణికమైనా, సాంఘికమైనా చిత్రం సరిగాఉంటే జనం చూశారు; ఇకముందుకూడా చూస్తారు. అయితే తేలికగా నాలుగు డబ్బులు చేసుకోవాలని ఉబలాటపడటం తప్ప ఇంకొకైన చిత్రంతీసి కృతకృత్యులైన నిర్మాత లెంతమంది? చిత్రం ఇతి వృత్తం ఏదైనా ఎన్ని బిగువు చెడకుండా ఉంటున్నాయి? ఎన్నింటిలో ఇతి వృత్తానికి అనుకూలమైన వాతావరణం సన్నివేశాలు వగైరా సరంజామా ఉంటోంది? చూస్తున్న చిత్రం సాంఘికమో, జానపదమో అంతు పట్టని స్థితి ప్రేక్షకులకు ఎన్ని సందర్భాలలో కలగటంలేదు. సాంఘిక చిత్రం అని చెప్పి కత్తియుద్ధాలు, సర్కసులు, కుప్పిగంతులు చూపిస్తే ప్రేక్షకులకు తల నొప్పి రాక ఏమవుతుంది? పౌరాణిక చిత్రంతీసి అందులో అడుగంటిపోతున్న జమిందారీ వాతావరణమో, మధ్య తరగతి కుటుంబాలలో కనిపించే కీచులాటలో చూపితే జనం అసహ్యించుకోక ఏమి చేస్తారు? జాతి సంస్కృతికి, ఆదర్శాలకు చిహ్నాలుగాఉండే పురాణ పురుషులను వాజమ్మలుగాను, వారి భార్యలను గయ్యాళి గంపలుగాను చూపితే కోపంరావటం అసహజంకాదే!

"వినోదంకోసం వచ్చిన వాడికి ఉపన్యాసాలు నీతులు చెబితే వాడు లేచి చక్కాపోతాడు" అని నిర్మాతగారు అంటున్నారు. సినిమా చూడటానికి వచ్చేవాడు వినోదాన్ని ఆశించే వస్తాడంటే అతిశయోక్తి కాదు. వాడికి నీతులు, ఉపన్యాసాలు అనవసరమే కావచ్చు. అంత మాత్రంచేత చిత్రాన్ని అసభ్యంగా తయారుచేయనవసరంలేదే! నీతులు ఉపన్యాసాలు అక్కరలేనివాడికి నినాదాలు అవసరమా? అయినా దేశ కాల పరిస్థితులకు అనుగుణమైనవో కానివో ఎన్నోకొన్ని నినాదాలు మన చిత్రాలలో వినిపించటంలేదు? సినిమాల ప్రభావం భాషను, చమత్కారాలవంటి సరదా విషయాలమీదే ఆధారపడి ఉంటుంది తప్ప, నీతులమీద అట్టే ఉండదు" అని నిర్మాతగారివాదం. నీతులు చెప్పడం అంటే వీరి ఉద్దేశం సుమతీశతకం పద్యాలు ఏ కరువు పెట్టటం అని అనుకోవలసి వస్తోంది. సరే నీతులు చెప్పడం సినిమాల లక్ష్యం కాదనే అనుకుందాం. కాని ఎంతమంది నిర్మాతలకు ఈ విషయం తమ చిత్రాల ద్వారా చెప్పగలిగే తాహతు, సాహసం ఉన్నాయి? మన చిత్రాలలో పతివ్రతాను తల్లిని అవమానపరిచిన దుష్టుడు చివరకు హతమారిపోవటమో, బుద్ధితెచ్చుకోవటమో జరుగుతుందే తప్ప అట్లాగే ఉండిపోడే! ఇందులో నీతిలేదా? నీతి మాట ఎలా ఉన్నా ఒక ఉత్తమ గ్రంథం చదివి నప్పుడు చక్కని శిల్పం చూచినపుడు కలిగే అనుభూతి సినిమా చూస్తే కలుగ నవసరంలేదా?" సినిమాతో దేశానికి దారి చూపగల మేధావులు లేరు." అని నిర్మాతగారు చెప్పనే చెప్పారు. కాబట్టి ఈ ప్రశ్న వారిని అడుగ నవసరం లేదు. నిర్మాతలు దేశానికి దారి చూప నవసరమూ లేదు. నాలుగు డబ్బులు సంపాదించుకునేదారి తమకు తాము చూచుకోగలిగితే దేశానికి మహోపకారం చేసినట్లే!

"మన ప్రజల స్థాయితోపాటే చిత్రాలస్థాయీ పెరగాలి తప్ప, అమాంతం ఎగిరి లాభంలేదు." అని నిర్మాతగారు ఉద్ఘాటించారు. ప్రజలస్థాయి ఎలా పెరుగుతుంది? పెంచే బాధ్యత ఎవరిమీద ఉన్నది? ఈ బాధ్యత ఎంతో కొంత చిత్ర నిర్మాతల మీదలేదా? ఉంటే వారు తమ చిత్రాలలో మానవుని లోని పశు ప్రవృత్తిని ఆటవిక ప్రవృత్తిని సంతృప్తి పరిచే సన్నివేశాలకు, దృశ్యాలకు ఎందుకు ప్రాధాన్యం ఇస్తున్నట్లు? ఈ చిత్రాలు ప్రజల స్థాయిని పెంచకపోగా అధోగతి పాలు చేస్తున్నాయి. విద్యార్థులు, పండిత [illegible]రు కాబట్టి పాఠశాలలు, కళాశాలలు [illegible] లేదంటున్నామా? అనగలమా? మన నిర్మా[illegible] [illegible]కంటే సబబుగా కనిపించటం[illegible]. చిత్రాలు వినోదం కోసమే అయినా, ఈ వినోదం మాజ సంక్షేమానికి హానికరంగా ఉంటే ఎలా? కొన్ని అవధులకు, ప్రమాణాలకు లోబడి చిత్రాలు నిర్మించవలసిన బాధ్యత నిర్మాతలకు ఉన్నది.

సంగీత, సాహిత్యాలలోగాని, శిల్ప, చిత్రలేఖనాలలో గాని ఆంధ్రుల అభిరుచి, ప్రతిభ ప్రపంచంలో ఏ ఇతర జాతికీ తీసిపోదే! కాని సినిమాలలో మన స్థాయి ఇందుకు భిన్నంగా ఉన్నది. డొక్కశుద్ధి అయిన తెలుగువాడు ఎవ్వడూ తెలుగు సినిమాలు చూచి ఆనందించలేకపోతున్నాడు. "ఇది ఏమిరా మన అభిరుచిన గూర్చి నిర్మాతలకు ఇంతదారుణమైన అభిప్రాయం ఉన్నది" అని వాపోక మానడు. తీసిన సినిమాలకు డబ్బు రావలసిందే. కాదని ఎవ్వరూ అనరు, అంతమాత్రంచేత వాసాట్స్థాయి నేలమట్టానికిఉండితీరాలని అనుకో నక్కరలేదు. ఈనాటి నిర్మాతలు ఇంతకంటే మంచి చిత్రాలు తీయలేనిమాట యథార్థమే కావచ్చుగాని, ఆ చేతకానితనాన్ని సమర్థించుకునేందుకు మన నిర్మాతగారు ప్రయత్నించటం నేల బారుగావుంది. వారు తమ అభిరుచిని ప్రేక్షకుని అభిరుచిగా చెప్పడానికి తంటాలు పడినట్లు కనిపిస్తోంది.

మన సినిమాల స్థాయిని, మన సాహిత్యం స్థాయితో పోల్చిచూచినట్లయితే ఈ రెండింటిమధ్య ఉన్న వ్యత్యాసం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఏవో కొన్ని చిత్రాలు ఎంతో కొంత బాగున్నాయంటే అందుకు రచయితలే కారణం అంటే అతిశయోక్తి కాదు.

ఇంతకంటే గొప్ప చిత్రాలు తీసే సాహసం మన నిర్మాతగారికి లేకపోతే కనీసం అందమైన యువతులను, యువకులను నాయికీ నాయకులుగా పరిచయం చేయవచ్చునే! అందమైన యువతీ యువకులకు తెలుగు దేశం గొడ్డుపోలేదే! మరి మనం ఎప్పుడు చూచినా వికృతాకారంకల స్త్రీలను పురుష లక్షణాలు అంతగా కనిపించని పురుషులను మాత్రమే మన చిత్రాలలో చూడవలసి వస్తోంది ఎందుకు? చిత్రంలో ఏది ఉన్నా ఏది లేకపోయినా అందమైన నాయికీ నాయకుల ప్రణయకలాపం ఉన్నా మా బాగే.

★

ఒక ప్రేక్షకుడు

## సాందీపనిపర్వం - 18

దేవతలేమో, ఇట్లా, దివోదాసునివలన ధ్వస్త ప్రయత్నులైనారు. మరి తానేమో కాశియందు వియోగము వలన వేదనా దూయమానమానసుడై పోయినాడు. కాశీకా విప్రయోగాభిఘాతజనితతాపభారమును సైరింపగా ఓపలేకపోతున్నాడు. దేవతలందరు తన దగ్గరకు వచ్చి "స్వామీ! శంకర! శివంకర! అవిముక్తమును సాధింపగా ప్రయత్నించి దివోదాసుని యోగ శక్తివలన దండింపబడినవారమైనాము. ఆ దివోదాసుడు తానే దహనుడై అధ్వరములలో హవ్యకవ్యాహుతులను కైకొంటున్నాడు. పర్జన్యమూర్తియై సస్యములు ఫలింపగా సలిలధారలు వర్షిస్తున్నాడు. శశిదివాకరుల వేషములు తాల్చి గాఢాంధకారపటలిని ఖండిస్తున్నాడు. పవనుని ఆకారమును భరించి ప్రాణ్యంతర్బహిః వ్యాప్తిని ఆచరిస్తున్నాడు. తానే వేల్పులందరునై విశ్వలోకమును వివిధ గతులుగా రక్ష చేస్తున్నాడు. మేము వానిని ఏమియు చేయలేనివారమై పోయినాము. వానిని ఏమి చేయుటయు మా చేత కాలేదు" అని పరిదీనవదనులై దీనముగా విన్నవించుకున్నారు.

వారి దైన్యమును చూడగా తనకు గూడ దైన్యము కల్గుతున్నది. ఏమియు తోచుటలేదు. అమ్మవారు అన్నది: "త్ర్యంబక! యోగినులను అవిముక్తమునకు పంపి చూడరాదా! దివోదాసుడు ధర్మభ్రష్టుడు కానంతవరకును అతనిని ఎవ్వరు నేమియును చేయలేరుగద!" తాను మందహాసము చేసినాడు. "శివే! శివతరముగా నాదేశించినావే" అన్నాడు. యోగినులను పేరు పేరు వరుసన పిల్చినాడు. "ఓసి! గజానన! ఓసి గృధ్రాస్య! ఓసి! కాకతుండిక! ఓసి! ఉష్ట్రగ్రీవ, ఓసి హయగ్రీవ! ఓసి వారాహి! శరభానన! నీవు ఎక్కడ! అదిగో! అవికేశి! అది శివారావ! అదిమయూరి! ఓసి! వికటానన! అష్టవక్రను ఇటులముందుకు రమ్మనుము. కోటరాక్షి కుబ్జ, వికటలోచన, శుష్కోదరి, లలజ్జిహ్వా, దంష్ట్రోగ్ర, వానరానన ముక్తాక్షి, కేకరాక్షు లెక్కడ! ఆ బృహత్తుండను, సూరాప్రియను, కపాలహస్తను, రక్తాక్షిని, శుకిని, శ్యేనిని, కపోతికను, పాశహస్తను, దండ హస్తను, ప్రచండను, చండవిక్రమను, శిశుఘ్నిని, పాకహంత్రిని ఇట్లా రమ్మనుడు. ఓసి! కాళి! ఆరుధిరపాయినిని వెంట బెట్టుకురా! నీవు వసాధయవుకావా! గర్భభక్ష మెక్కడ! శవహస్త, ఆంత్రమాలిని, స్థూలకేశి, బృహత్కుక్షి, సర్పాస్య, ప్రేత వాహనలువచ్చినారా! వారు గోదండశూకకర, క్రౌంచి, మృగశీర్షలు. ఇది వృషానన, అది ఆంత్రయామ! ఇది ధూమనిశ్వాస! ఓసి! మీ వలన దివోదాసుని రాజమున ధర్మము భ్రష్టమై పోవలయునే! ఓసి! వ్యోమకచరణ! మీ వలన కాశికలో పుణ్యస్త్రీల పాతివ్రత్యములు చెడవలెనే! ఓసి! ఊర్ధ్వదృశ, ఓసి! తాపని! ఓసి శోషణి! ఓసి! వృకోదరి! మీ వలన కాశిలో పురుషుల ఆచారములకు గ్రహచారము పట్టవలెనే. నీవు స్థూలనాసికవు! నీవు విద్యుత్ప్రభవు! నీవు బలాకాస్యవు! నీవు మార్జారివి. ఓసి! మీ అందరివలన ఆనంద కాననంలో దివోదాసుని రాజ్యంలో, వర్ణాశ్రమములు పాడరిపోవలెనే. వర్ణాశ్రమములు నిజ ధర్మమున వర్తింపకపోయిన యెడల దివోదాసుడు రాజ్యభ్రంశమును పొందును గదా! కటపూతన! అరిష్టహాస! కామాక్షి! జాగ్రత్త సుమా! మాకు కాశీ సమాగమం సిద్ధింపవలెను. దివోదాసుడు పదచ్యుతుడుకాక అది సిద్ధించదు. మీరు ఇది సాధించవలెను. మీరు నానా ప్రకారమాయా వేష చేష్టా విధానములుగా కాశిలో దివోదాసుని మహత్త్వను తారుమారు చేయవలెనుసుమా!" అని ఆజ్ఞాపించినాడు.

యోగినులు కాశికి పోయినారు. అనుకున్నంతలో తిరిగి రాలేదు. తనకు ఊరట కల్గలేదు. కాశికానగ వృత్తాంతమును అరయుట, కాలయాపనక్షేమము కాదు. అనుకున్నాడు. "శివే! ఇప్పుడు ఏమి చేయవలయును. కాశికావిప్రయోగాభిఘాతజనిత తాపభారాన్ని ఓపలేకుండా వున్నాను" అన్నాడు. అంబిక మందహాసము చేసినది. "ప్రభు! మీకన్నులు సూర్యుడును చంద్రుడును. మరి ఆ చంద్రుడో కళంకి! సూర్యుణ్ని కాశికి పంపి చూడండి" అన్నది. తనకు ఆమెమాట నచ్చినది. తాను తలచినంతలో దివాకరుడు సాకారుడై ఎదుట నిలబడినాడు. వినమితుడై "ప్రభు! ఆజ్ఞ యేమి?" అన్నాడు. "వాసరాధిప! దివోదాసు ధర్మాత్ముడు, నా కాశిని కాజేసినాడు. వాడు ధర్మ విముఖుడుకాక కాశి నాకు దక్కదు. మరి ధర్మ మార్గైక తత్పరుణ్ణి, అతణ్ని; మనము ఆదరించకపోయినట్లయితే ధర్మము ఏ విధమున అభివృద్ధి పొందుతుంది. కాబట్టి అగు నయము తప్పకుండా నేదేని తప్పును అతనియందు చూపించాలి. ఇది నీవలన కావలసినపని" అన్నాడు. సహస్ర కిరణుడు మరియు వినయవినమితుడై 'వల్లె' అన్నాడు. అన్నాడే కాని అతనికి ఏమీ తోచలేదు. అతని ఆ తోచనితనమును చూచి తిరిగి తాను ఇట్లా అన్నాడు: "ఓయి! కర్మ సాక్షి! ఎంతకాలము ధర్మము అతి సుకరమై కదలక వుండునో, అంతకాలము నరునకు ఏ అపాయము ఆవహిల్లదు. ఈ సూక్ష్మాన్ని తెలుసుకు వ్యవహరించు" కర్మసాక్షి "ప్రసాదం" అని కాశికి బయలుదేరినాడు. ఆకాశిలో అంశుమాలి ఒక్కమాటు యాచకుడై ఒక్కమాటు దాతయై, ఒక్కమాటు వదాన్యుడై, ఒక్కమాటు దీనుడై ఒక్కమాటు కార్తాంతికుడై, ఒకమాటు దృష్టప్రత్యయవాదియై, ఒక్కమాటు జటిలుడై, ఒక్కమాటు దిగంబరుడై, ఒక్కమాటు జాంగలికుడై, ఒక్కమాటు పాషండుడై ఒక్కమాటు బ్రహ్మచారియై, ఒక్కమాటు గృహియై, ఒక్కమాటు వానప్రస్థుడై, ఒక్కమాటు యతియై, నానా ప్రకార వేష భాషా చేష్టా యంత్ర మంత్ర తంత్ర మాయా ప్రయోగ యోగాగ్రనిష్ఠుడై, దివోదాసుని సుశీలమునందు చరిత్రయందు రంధ్రాన్వేషణావిష్టుడై, క్రుమ్మరిల్లినాడు. రాజునందు ఎక్కడా ప్రవేశము కన్పించలేదు. ఆ రాజు రాజ్యంలో ఒకపృథగ్జనునియందు గూడ సహస్ర కిరణుడైన ఆతనికి, కర్మసాక్షియైన ఆతనికి, అవకాశము గోచరించలేదు. మరి కార్యమేమో నిష్పత్తి గతికి రాలేదు. తిరిగి తాను మందరమునకు ఏ ముఖమునపోయి పరమశివునకు ముఖమును చూపించగలను అనుకున్నాడు. అనుకొని కాశిలో నిల్చిపోయినాడు.

సూర్యుడు కాశినుండి రాలేదు. తాను కాశికిపోవు మార్గమును ప్రాదియు చేయలేదు. తనకు అది మరియు విచారమైంది. శివ అన్నది "స్వామి! "ఈసారి బ్రహ్మను పంపిచూడండి" బ్రహ్మ వచ్చినాడు. తాను ఆయనకు ఏమి చెప్పవలయునో తోచలేదు. అంబికయే అన్నది: "ద్రుహిణ! కాశికయందు విరహముచేత ప్రభువు తపించి పోతున్నారు. యోగినీబలమును పంపినారు గాని వారు పోయినపోకనే పోయినారు. తర్వాత తోయజబాంధవుణ్ణి పంపినాముగాని, అతడును తిరిగి రాలేదు. చెర్వును చూడబోయిన తూడు తీగక్రియగా వున్నది వీరి వ్యవహారము అంతయును గూడ. నీవు గూడ వారికివలె కారాదుసుమా!

శతానందుడు వృద్ధబ్రాహ్మణ వేషమును అంగీకరించి వారాణసిలో ప్రవేశించినాడు. దివోదాసు బ్రాహ్మణుల నెప్పుడును అనాదరించలేదు. రాజు నిండుపేరోలగం వుండగా శతానంద బ్రాహ్మ

హరిత శివశర్మ

గుడు, ఆయన దర్శనము చేసికొని, బహు విధములుగా దీవించినాడు. "అధిప! ఆనందకాననాభ్యంతరములో యజ్ఞములు చేయవలెనని నాకు వున్నది. అందుకు మీ అభ్యనుజ్ఞ కావాలి. మీరు ఇందుకు అనుమతించాలి. రాజు నడిపిస్తేకదా ధర్మం అంటూ నడిచేది. అందుకే ఇందుకు నీ సాహాయ్యాన్ని అర్థిస్తున్నాను."

రాజు అర్ధాంగీకారసూచకంగా శిరశ్చాలనం చేసినాడు. శరానందబ్రాహ్మణుడు తిరిగి ఇట్లా అన్నాడు : "మహారాజా! ఇది యేమి చోద్యము పరమ శివుడులేని కాశీ కాశియా? అక్కట్టు విశ్వేశ్వరుడు లేమి కాశికాపురి అనదవలె వున్నది. చిల్లర వేల్పులు వస్తే వస్తారు. లేకపోతేలేదు. వామదేవుణ్ణి రప్పించలేపోవడం నీకు జయం కాదు!

రాజు ఏమీ అనలేదు. మందంగా మందహాసం చేసినాడు. "బ్రాహ్మణ ప్రవర! మీరు యజ్ఞాలు సుప్రయోగంబులుగా ఆచరించండి" అన్నాడు.

తనకు బ్రహ్మ యీ వేడబము వేడబయునై పోయింది. దివ్య దృష్టిని విసారించి ద్రుహిణుని పోకడలను తాను పరికించినాడు. ఆయన అచ్చట అశ్వమేధములు తలపెట్టినాడు. ఒకటికాదు పది. రాజు కాదనలేదు. ద్రుహిణుడు అచ్చట తన పేరున బ్రహ్మేశ్వరుణ్ణి గూడ ప్రతిష్ఠించినాడు. పజ్జనే దశాశ్వమేధ తీర్థమును సర్వ తీర్థోత్తమంగా సంతరించినాడు. తన్ను మరిచిపోయినాడు. తనకు కోపము రాలేదు. ఆనందకాననం తనకు మూర్త్యంతరముకదా! బ్రహ్మ తడయుటకు కారణ మున్నది.

తిరిగి తాను ఆలోచనచేసినాడు. ఇప్పటికి ఇందరిని పంపినాను జరగవలసిన పని జరగలేదు. ప్రమథులను పంపినచో! అంబిక "అవును" అన్నది. "ఏమిటి ఔను?" అన్నాడు తాను. "త్ర్యంబక! ప్రమథులను కాశికి పంపండి ద్రుహిణుడు పోయి తడవైనది" అన్నది.

అవును. వారాణసిలో ముక్తిమండపములో ప్రత్యహము అంబిక అన్న దానము చేయునలవాటు గలది ఇప్పుడు బైసివారి వున్నది. తనకు నవ్వు వచ్చినది "అన్నపూర్ణ! కాశిలో అన్న దానము చేయలేని నీ చేయి నిన్ను బాధించుచున్నది!" అంబిక విచార సూచిముఖారవింద అయినది.

తాను తలచినంతలో శంకుకర్ణ మహాకర్ణులు ఘంటాకర్ణ మహాకాళులు, సోమనందిషేణ కాళపింగళ కుక్కుటులు, కుండోదర మయూరబాణ గోకర్ణులు, తిలకర్ణ సూలకర్ణ ద్రుమచండ ప్రభామయ సుకేశచ్ఛాగకపర్ది పింగలాక్ష వీరభద్ర కిరాత చతుర్ముఖులు, నికుంభ పంచాక్ష భారభూత త్ర్యక్షక్షేమక విరాధ సుముఖులు ఆదిగాగల ప్రమథులు తనముందు వినతులై, నతులర్పిస్తూ నిలబడినారు తాను వారికి తన ఆజ్ఞను వినిపించినాడు "ప్రమథులు! మీరు ఒక్కుంగలవారివలె కాశిలో తడయరాదు" అన్నాడు వారు "స్వామి! మహా ప్రసాదం" అన్నారు. కాశికిపోయినారు. మరల తిరిగి రాలేదు. ఆనందకాననం వారిని కదలిరానీయలేదు.

ఇక మిగిలినది వారణాస్యుడు. వానిని వారాణసికి పంపమన్నది గౌరి. అందుకు తాను ఒడబడినాడు. "డుంఠి! ఈ పని నీవలన కావలసి వున్నది. ముందు యోగినీ మండలాన్ని అవిముక్తమునకు పంపినాను. వారు అక్కడ తడసినారు. కాశికా కటక శృంగాటకములు వారికి తరితీపులై పోయినవి. పిమ్మట దివసరుహప్రభుణ్ణి పంపినాడు. అతని మనసు కాశియందు లోలము అయిపోయినది. ఆయన లోలార్కుడై పోయినాడు. అటు పిమ్మట దివసరుహాభవుణ్ణి పంపినాడు. ఆయన యాయజూకుడై పోయినాడు. మమ్ము మరచిపోయినాడు. ఆ తరువాత ప్రమథులను, గణనాయకులను పంపినాను. వారును కాశిలో కాపురం పెట్టినారు. ఇదియు ఒక అందుకు మంచిదే అనిపించుచున్నది. అన్య రాజ్యలక్ష్మికి భేదముతో పెనగుతున్నాము. అందువలన వీరి అందరికి ఉనికి అక్కడ మేలే అవుతున్నది. మరి వారు సామాన్యులా? ఒక్కొక్కరు నాయంతవారు. ఎప్పుడైనా తడసి కార్యమును కొనుట హితముగా కన్పిస్తుంది" అన్నాడు. వినాయకునకు బుద్ధులు అనతిచ్చినాడు. కాశికి పంపినాడు.

డుంఠి కాశిలో డుంఠిభట్టు అయినాడు. ఆయన పోయి కాశిని చేరగా అక్కడ దివ్యాంతరిక్ష భౌమోత్పాతములు బహుళములుగా పుట్టినవి. మేఘపథములలో గంధర్వనగరరేఖలు తోచినవి. వేశ్మసీమలయందు చేకొడుందులు కల్గినవి. నట్టనడురేయి అమరకోదండములు పొడమినవి. నిద్రలయందు కరము అరిష్టములను సూచించుకలలే గాని కాశికా వాసులకు సుఖనిద్రలు దరిద్రములైనవి పురవీధులలో వరళ్ళు పరవళ్ళు పోయినవి. దేవతాప్రతిమలు కుతిలపడినవి. పోతే నేత్రములయందు బాష్పసలిలముగా మలగిపోయినవి. ప్రజలకు ఆకస్మికమైన భయములు అధికము లయినవి. విఘ్నరాజు నిర్విఘ్న విక్రాంతికి కాశిక తట్టుకోలేకపోయినది. తానై ఆయన ఈ ఉత్పాతములు సృష్టిస్తున్నాడు. తానై వానికి ఉపశాంతులను ఉపదేశిస్తున్నాడు. తానై కాశికా జనాన్ని వెరపిస్తున్నాడు తానై వారికి మిత్రమపోలె హితము అచరిస్తున్నాడు కలలో ఎన్ని కథలు పుట్టినవి, అన్నింటిని పూసగ్రుచ్చినట్లు పొసగగా చెబుతున్నాడు. హస్తరేఖలు చూచి నీ ఆయుష్యము ఇంత, నీభవితవ్యము ఇది, అని ఆనతి ఇస్తున్నాడు. చూడు! నీకు కొడుకు లిద్దరు, కూతురు ఒక్కర్తుకే. నీ ముఖమును చూడగానే తెలియుచున్నది అని శకునములు పల్కుతూ ప్రజలలో పుల్కు కల్గిస్తున్నాడు. నగరంలో భామినీజనమునకు డుంఠిభట్టు అనగా అకుంఠితమైన గౌరవము కుదిరినది. వారిచేత ఆయన నోములు నోపించుచున్నాడు. దిన వారములు నొడువుచున్నాడు. కుండబొజ్జ కురచశిఖ, వ్రేళ్ళను పొడువుపాటి దర్భాంకురములు: ఆయనను చూడగా హాస్యమో గౌరవమో, మర్యాదయో, డుంఠిభట్టు కామధుగ్ధేనువును పోనియోగంతో కాశిలో క్రుమ్మరిల్లుతున్నాడు.

ఆయనమాటను కాదనువాడు కాశిలో లేడు. లేదనుపది కాశిలోలేదు. ఆయనవాక్యము వేదవాక్యమైనది. ఆయన పౌరజనములలో చేరి "కాశికి అరిష్టము కల్గబోపుచున్నది. మీరు అవిముక్తమును కదిలిపొండి" అని ఒక్కరోజున అనినాడు. పౌరజనులు కుటుంబసహితముగా కాశిని



వదిలిపోయినారు. స్త్రీలలో ఆయన మహత్తులు మరియు హత్తుకు పోయినవి. దివోదాసుని పట్టమహిషి లీలావతిముందు కర్ణాకర్ణియుగడుంఠి భట్టారకుని మహిమ విన్నది ఆయన జితేంద్రియుడు. అనుష్ఠానపరుడు. శమదమాది గుణ గరిష్ఠుడు. సత్యసంధుడు. నిస్పృహుడు. త్రికాలవేత్త. ఇట్టి స్తోత్రములు అతనినిగూర్చినవి ఆమె చెవుల పడినవి. కాశికాపట్టణములో మహోత్పాతాలు పుడుతున్నవి. మహారాజు ఖేదమునుచెందుచున్నారు. ఈయనను, ఈ డుంఠిభట్టారకుని ప్రశ్న చేసినచో! లీలావతీదేవి మహారాజుతో మాటాడినది. ఆయనయు వల్లె యనినాడు. డుంఠికి అది కోటలో పాగా వేసినట్టులయినది. రాజు తన్ను పిలవనంపగా పోయి, ఆయన అడిగిన ప్రశ్నములకు సదుత్తముల నిచ్చినాడు

రాజు . డుంఠిభట్టారకా! కాశికాపట్టణంలో ఇన్ని ఉత్పాతములు పుట్టుటకు కారణం ఏమిటి? ఈ కలుషము ఎట్టుల వాటిల్లినది? ధర్మము ఏ వంక పల్లటిల్లినది?

డుంఠి మహారాజా! ఉత్పాతములు కల్గుతూ వున్నవి. నిజమే ఇందుకు శాంతి చేయించవలసి వుంది. ఆ పని నేను చేస్తాను. అందుకు నీవు ఒక్కటి చేయవలసివుంది. నీవు రాజ్యాన్ని విడిచి కొన్ని నాళ్ళు ఎక్కడికన్నా పోవలెను సుమా! ఆత్మార్థము ఎవ్వరు ఏమి చెయ్యరు వేదములు గూడా చెబుతున్నవి 'ఆత్మార్థం పృథివీంత్యజే'త్తని. నేను చెప్పినది సరికాదో! పెద్దలను విచారించుకో. నేను త్రికాలజ్ఞుడను. చెబుతున్నాను విను. నేటికి పదు నెనిమిది అగు దినమునాటికి ఉత్తర దేశము నుండి ఒక్క బ్రాహ్మణుడు కాశికకు రానున్నాడు. అతడు నీకు హితోపదేశం చేయుగల సమర్థుడు, అప్పుడు నీ యీ ప్రశ్నలు నన్ను అడుగు. ముందు నా వాక్యములను ప్రవగాంకరించుకోవలయును గదా! ఇక మేము సెలవు తీసుకుంటాము.

రాజు ఆలోచనాధీనుడైనాడు. తాను, పరమశివుడును, ఆలోచనాధీనుడైనాడు. ★

(7-వ పేజీ తరువాయి)

నట్టుగా, వివిధ కోణాలనుంచి తీసిన చిత్రాల కట్టను ఢిల్లీ వార్తాపత్రిక ప్రచురించింది. 1947 నుంచి ఈరోజు వరకు కనీసం కేంద్ర మంత్రుల ప్రచార హంగామాకు అయిన ఖర్చును నిజాయితీగా లెక్క తేల్చి ప్రకటించి ఉంటే అదిహీనపక్షం న్యూఢిల్లీలో రెండు మురికివాడలు తొలగించడానికి సరిపడ్డంత ఉండేది.

ఇటీవల ఒక "పాఠకుడు" 1947 నుంచి జీవనవ్యయం రెట్టింపైందన్న సాకుతో కేంద్ర మంత్రులను సమర్థిస్తూ పత్రికల్లో ప్రకటించాడు. ఆడిటర్ జనరల్ ప్రజల జీవన వ్యయాన్ని గూర్చి తెలియనివాడేం కాదు. కాకపోతే ఆయన కోరేదల్లా ఇది: మంత్రుల హోదాలకు తగ్గట్టుగా వారికి వేతనాలు యివ్వాలి. అయితే ఈ వేతనంలో అన్ని భత్యాలు కలిసి ఉండాలి. త్యాగం చేస్తున్నారనే పేరుతో అన్ని సౌకర్యాలు ముందు వారికి (మంత్రులకు) కల్గించకూడదు,

* * *

ఇకదినదినం అభివృద్ధి గాంచుతున్న ప్రభుత్వ రంగప్రాముఖ్యతను గూర్చి ముచ్చటిద్దాం. హిందూస్థాన్ ఉక్కు కర్మాగారం ఈ విషయానికి మహచక్కటి ఉదాహరణౌతుంది. ప్రభుత్వరంగంలో ఉన్న మూడు ఉక్కు కర్మాగారాలపై అజమాయిషి చేస్తున్నసంస్థ ఇది. దీని డైరెక్టర్ల సంఘంఅధ్యక్షుడు ఉక్కుశాఖ మంత్రి. లోక్‌సభ సభ్యులు ఈ సంస్థవాటాదార్ల ప్రతినిధులు.

ఈ సంస్థ వార్షిక నివేదిక, జమాఖర్చుల పట్టిక ఇప్పుడు లోక్‌సభముందున్నాయి. కేంద్ర ఉక్కుశాఖ మంత్రి వీటి వివరాలు తెల్పుతారు. అంటే, ఉక్కుశాఖమంత్రి చేసేఉపన్యాసం వాటాదార్ల వార్షిక సమావేశంలో బోర్డ్ఆఫ్ డైరెక్టర్ల అధ్యక్షుడు చేసే ఉపన్యాసమేనని అనుకోవాలన్నమాట. ఇంతకీ నేచెప్పాలనుకున్న విషయం ఇది. టాటా ఇనుము ఉక్కు కర్మాగారాల్లాంటి సంస్థల అధ్యక్షుల ఉపన్యాసాలు వ్యాపారప్రకటనలుగా వేస్తున్నప్పుడు, ఉక్కుశాఖ మంత్రి ఉపన్యాసంవార్తలలో ఎందుకు ప్రకటించాలి. వ్యాపారరంగంతో ప్రభుత్వరంగం పోటీలో ఉన్నప్పుడు అన్ని విషయాలు సమంగానే చూడాలి. అంటే ఉక్కు శాఖ మంత్రి ఉపన్యాసం కూడా ప్రకటన క్రిందనే భావించి దానికి పత్రికలకు ధనం చెల్లించాలి.

కాంగ్రెస్ పార్లమెంటరీ పక్ష ఉపనాయకుని ఎన్నిక వివాదాన్ని సింహావలోకనం చేస్తే ఆ పదవికి శ్రీ కృష్ణమీనన్ పోటీచేసినట్లు తెలుస్తుంది. కృష్ణమీనన్ అనుయాయులు కొంతమంది 'పెద్దలు' ఆయనకు అధిక సంఖ్యాకుల మద్దతు ఉందని ప్రధాన మంత్రిని నమ్మించారు కూడా. సరిగ్గా ఇక్కడే ప్రధానమంత్రి పప్పులో కాలు వేశారు. ప్రధానమంత్రి పలుకుబడి లేకపోతే శ్రీ మీనన్ ఈపాటికి ఏ మారుమూలో అణిగిపోయేవారు. దేశంలో ఏమాత్రమూ పలుకుబడీ

లని శ్రీ మీనన్ కేదో పెద్ద పలుకుబడి కాంగ్రెస్‌లో ఉందని, అనాలోచితంగా, అతిశీఘ్రంగా నమ్మేయటమే ప్రధాన మంత్రి చేసిన పెద్ద పొరబాటు. ప్రధానమంత్రి తమ మొగ్గు ఎటో (శ్రీ మీనన్ వైపు) సూచన చేయటమో లేదా ఉపనాయకుని నియమించేటట్లు చేయటం ఈ పెద్ద లాడిన నాటక ఉద్దేశ్యం. శ్రీ కృష్ణమీనన్ కేదో పెద్దగా పార్టీలో పలుకుబడి ఉందని ప్రధాన మంత్రికి తెలియజేయాలని వారు చేసిన తతంగం చాలా పొరబాటు పని. దీనివల్ల ప్రధాన మంత్రికి తాము ప్రజాస్వామ్యవాదులమని, అందువల్ల ఎన్నికవైపే మొగ్గు చూపుతామని ప్రకటించే అవకాశం కలిగింది. అయితే ప్రధాన మంత్రి ఇంకో అకు ఎక్కువే చదివారు. ఏ వ్యక్తివైపు మొగ్గు చూపుతారో వెల్లడించ నిరాకరించా రాయన. ఈ పెద్దలు తమ పాచిక పారలేదని తెలుసుకొని, అభ్యర్థిగా నిలవాలని శ్రీ జగజీవన్‌రాం వెంట పడ్డారు. హిందీ, బీహారీ వోట్లు చీలటంతో ఈ పెద్దలు శ్రీ మీనన్‌కు ఏదో అవకాశం ఉంటుం దనుకున్నారు.

శ్రీ నెహ్రూ గనక కృష్ణమీనన్‌ను ఉపనాయకుడుగా నియమించినా లేదా ఆయన పట్ల మొగ్గు చూపినా కాంగ్రెస్‌పార్టీకి మీనన్ పట్ల ఎంత విముఖత ఉన్నా ఆయన్నే ఉపనాయకుడుగా అంగీకరించేది. ప్రయోజన ఎన్నిక హక్కు పుణ్యమాంటూ, పార్టీలో నాలుగోతరగతి జనం ఉన్నారు. సత్తగుర్ల కూడా ఒక్కొక్కప్పుడు నాయకుడు కావచ్చు. వచ్చే ఎన్నికల దృష్ట్యా ఇదీ సాధ్యపడదు. ఈ ఉపనాయకుని ఎన్నిక సమయంలో రాష్ట్రాల ముఖ్య మంత్రు లందరు ఢిల్లీలో ఉండటం మాత్రం యాదృచ్ఛిక సంఘటన కావచ్చు.

మన ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయ్‌ని గూర్చి ఒక్కమాట. ఆయనకు జరిగిన అవమానం లాంటిది, గొప్ప నాయకులకు ఎప్పుడో అరుదుగాగాని జరగదు. ఇంకా ఆయన పదవిలో ఎందుకుంటున్నాడా అని ఆయన మిత్రులే ఆశ్చర్యపోతున్నారు. పదవిలోంచి వెంటనే తప్పుకోవాల్సింది. ఎందుకంటే అలా తప్పుకోటమే మంచిది కనక. ఏది ఏమైనా తనను గూర్చి ప్రధాన మంత్రి అభిప్రాయ మేమిటో ఆయనకు బాగా తెలుసు.

గత నలభై సంవత్సరాల చరిత్ర ప్రాస్తే మహాత్మాగాంధి చేసిన పొరపాటు అంచనాలలో మొట్టమొదటిది మౌల్వీ మౌలానాలతోటి ఆయన సాన్నిహిత్యం అని తేలుతుంది. దేశ విభజన తర్వాత కూడా మౌల్వీలో కాంగ్రెసుకు అచెంచల విశ్వాసం ఉండటం చిత్రంగా ఉంది. నిజానికి, భారత ముస్లిములను గూర్చి చెప్పదగ్గవారు మౌలానాలేనని కాంగ్రెసువారి దృఢనమ్మకం.

ముస్లిం మౌలానాల కేంద్ర సంఘం—జమయత్—ఉల్—ఉల్లేమా — ఇ — హింద్ జూన్ 10, 11 తేదీల్లో ముస్లిం సమావేశం జరపాలని నిశ్చయించింది. స్వర్గీయ మౌలానా అజాద్ వారసుడు శ్రీ హుమయూన్ కబీర్ ఈ సమావేశ కర్తలలో ఒకరు.

ఈ సమావేశం జరిపేందుకు కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ సంజీవరెడ్డి ఆమోదించారని ఒక ప్రకటన వెలువడింది. అయితే కాంగ్రెసు అధ్యక్షులు ఇదేవిధంగా శిక్కులకు, క్రైస్తవులకు యూదులకు, ఆదివాసులకు తదితర అల్ప సంఖ్యాకులకు కూడా ఇలాంటి సమావేశాలకు అమోదిస్తారా అనేది మాత్రం అందులో చెప్పలేదు. అసలు దీంట్లో కాంగ్రెసు ప్రమేయ మేమిటి? జమయత్, కాంగ్రెసుకు ఏమైనా అనుబంధ సంస్థా? ఈ సమావేశం నూటికి నూరుపాళ్ళు మత సంబంధమైనది.

శ్రీ కబీర్ చెప్పిన స్వర్గీయ మౌలానా అజాద్ జీవితచరిత్ర, జాతీయ ముసల్మాన్ దృక్పథం ముజేతికంకణంలాగా ప్రతిబింబించి తీరాలి. స్వర్గీయ మౌలానా సాహెబ్‌కు హిందువులపట్ల కోపంగా ఉందని, అందుకు కారణం వారు (హిందువులు) దేశవిభజన కొప్పుకోవటమే నని శ్రీ కబీర్ అభిప్రాయం. తన జాతివారు భారత విభజన ప్రతిఘటించేటట్లు శ్రీ మౌలానా ఏం ప్రయత్నాలు చేశారో ఆ విషయం గూర్చి ఒక్క ముక్క కూడా ఆ పుస్తకంలో లేదు. ఇక మౌలానా సాహెబ్ జీవిత చరిత్రలో అంతర్గంగా ఉన్న రెండో విషయ మేమిటంటే: మహమ్మద్ ఘోరీ రాజ్యస్థాపనకోసం ఢిల్లీపై దండెత్తిన నాటినుంచి లభిస్తున్న గౌరవసత్కారాలు ఉన్నత స్థానం ఇప్పుడు మహమ్మదీయులు పోగొట్టుకోటం పట్ల విచారం. ఈ విషయమే చెప్తూ కొద్ది రోజుల్లో జరుగబోయే ముస్లిం సమావేశం ప్రధాన కార్య నిర్వాహకులు మౌలానా హఫీజర్ రహమాన్ ఇలా అంటారు.

"భారతదేశంలోని ముస్లిములు జాతీయ కార్యకలాపాలలో పాల్గొనేందుకు పౌర హక్కులను అనుభవించేందుకు, సాంఘిక, సాంస్కృతిక రాజకీయ విద్యావిషయిక .... వగైరా వగైరా దేశాభివృద్ధి విషయాల్లో పాల్గొనేందుకు అవకాశం కల్పించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఈ అవకాశాలు సున్నితమైన సంప్రదాయములు, పరస్పరం అర్థం చేసుకోటం కోసం కావాలి." స్వర్గీయ అగాఖాన్ కూడా వెనుక మింటో ప్రభువునకు వ్రాసిన ఉత్తరంలో సరిగ్గా యిలాంటి భావాలు ఇలాంటి భాషనే ఉపయోగించాడు.

ఈ మత సంబంధ విషయాల్లో చాలా జటిల సమస్య లున్నాయి. ఒక్కతడవ గత చరిత్రను పరిశీలిద్దాం. లక్నోలో కాంగ్రెస్—లీగ్ ఒడంబడికపై సంతకాలు జరిగాయి. దీని ప్రకారం ముసల్మానుల కోర్కెలు కొన్ని నెరవేరాయి. ఆ వెంటనే జిన్నాగారి పధ్నాలుగు సూత్రాలు, కమ్యూనల్ అవార్డులు వచ్చాయి. చివరకి భారత ముస్లిములు తమకు హిందువులతో పొత్తు కలవదని, తమకు ఒక మాతృదేశం విడిగా పంచి యివ్వాలని కోరారు. 1947 లో ఇది కనాడా జరిగింది. ముస్లిములకు ప్రత్యేక హక్కుల పేరుతో ఇప్పుడీ సమావేశంవారు విభజనపూర్వపు సమస్యలన్నీ తిరగతోడుతున్నారు. కారణం భారతదేశంలో అల్పసంఖ్యాకుల రక్షణ అంటే అర్థం వారికి ప్రత్యేక హక్కులివ్వటమే గనుక. అసలు శ్రీ జగజీవన్‌రామ్ ఇంకో జాతినే తయారు చేశారు. అలాంటి సౌకర్యాలే కావాలని రహమాన్ ఉద్దేశ్యం.

ఎవరూ నిరాకరించలేని వాదం ఒకటి ముసల్మానులకు ఉంది. కేంద్ర సచివాలయం మొత్తం మీద ఉన్నతోద్యోగాలలో ఉన్న ముసల్మానులు చాలా తక్కువమంది కన్పిస్తారు. అలాగే అంగ్లో ఇండియన్‌లు ఒక గుంపుగా కేంద్ర ఉద్యోగాలనుంచి మాయమయ్యారు. క్రైస్తవులకూ ఇంతకన్న ఎక్కువ లాభమేం జరుగలేదు. స్వాతంత్ర్యం పొందిం తర్వాత ఏదో నిమ్నజాతులవారిని మాత్రం పటిష్ఠ పాలనకు ప్రమాదకారు లయ్యేంతదాకా పైకి లాక్కొచ్చాం. ఒక్కమాటలో చెప్పాలంటే మన కుల మత నివక్షతారాహిత్యం (సెక్యూలరిజం) పూర్తిగా విఫలమైంది. ముసల్మానులు ఇప్పటికన్న కొంచెం సద్భావంతో చూడతగ్గవారే. వారికి యోగ్యమైన హక్కులు ఇవ్వాలి. మౌలానాల ప్రమేయం మాత్రం ఉండకూడదు. అంటే భారతదేశం సంక్షేమం దృష్ట్యా భారత ముస్లిములకు మతోన్మాదులు మౌలానాల హస్తాలనుంచి విముక్తి కల్పించాలి.

అసలీ సమావేశం జరపాల్సిన అవసర మేం వచ్చిందంటే దానికి చెప్పాల్సింది చాలా ఉంది. మౌలానా హిఫ్‌జుర్ రహమాన్, హుమయూన్ కబీర్ ప్రభృతులు భారతముస్లింలకు తామే దో నాయకులమని భావిస్తున్నారు. దీనికి తోడుగా మద్రాసు, కేరళ, బొంబాయి ముస్లిములు ముస్లిం లీగ్ పేరు కింద సంఘంగా ఏర్పడుతున్నారు. ఒకప్రక్కనేమో మతసంస్థలను నిషేధించాలని ఉద్యమం బయల్దేరింది. జమైత్ ఉల్—ఉలేమా ఇ—హింద్‌ను అకాలీదళ్‌ను నిషేధించే ఖలేజాలు కాంగ్రెస్ ప్రభుత్వాని కున్నదా అనేది చర్చనీయాంశం. అవి మత సంస్థలూ, రాజకీయ సంస్థలు కావయ్యా అని కొంతమంది వాదిస్తారు. అదే నిజమైతే మవులానా హిఫ్‌జుర్ రహమాన్‌కు పార్లమెంటులో తావు లేదు. రెండో విషయం: జమయత్ ఉలేమా ప్రచురించిన వార్తాపత్రికలు కాస్త చిత్తగిస్తే అది ఏమాత్రం మత సంస్థ కాదో తేల్తుంది.

ఏమైనప్పటికి ముస్లింలీగును నిషేధించేందుకు ప్రయత్నాలు జరుగుతై. దీంతో మవులానాలు తాము ముస్లింలీగుకు, మత విషయంలో ఏమాత్రం తీసిపోమని, అందులో కాంగ్రెస్ చెప్పే కుల మత నివక్షతారాహిత్యం క్రింద పనిచేయ గలమని ముస్లిములకు చెప్పుకోటానికి వీలౌతుంది.

ఏది ఏమైనా ముసల్మానులకు కాంగ్రెస్‌లో విశ్వాసం పోయి ఉండచ్చని, మవులానాల్లో అసలు విశ్వాసమే లేదని వార్త. ముస్లింలీగ్‌ను నిషేధించవచ్చు. దాన్ని నిషేధించడం అంటే ఆ స్థానం జమైయత్ ఉలేమా ఆక్రమించవచ్చని కాదు. మౌలానాలకు కబీర్లకు నిజమైన పరీక్ష దక్షిణ భారత్, బొంబాయిల్లోని ముసల్మానులను మార్చటంగాని, పురావస్తు కట్టడాలకు పరుగెత్తటం కాదు. ★

వారు మరొక దేశంవెళ్ళి కొంతకాలంవుంటే ఆ దేశ
స్థులు మాట్లాడే విధంగానే వీరు మాట్లాడ
టమూ మారిపోతుంది. పిల్లలూ, పెద్దలూ సరిగా
మాట్లాడవలసిన అవసరం వారి పరిసర జీవితంలో
వుండాలి. మొట్టమొదట మాటలు తేటగా వచ్చినా
కొంతకాలంలో బిడ్డ తన మనోగతాభిప్రాయములు
తెలుపుతుంటే ముద్దుగా వుందని వూరుకోవడం మంచిది
కాదు. ఒక మాట అనుమని, సరిగ్గా అంటే నీ
కాకోలెట్లు ఇస్తానని, బిడ్డ సరిగా మాట్లాడ
డానికి ప్రయత్నించేటట్లు చేయాలి. ఆరంభంలో
లోనే ఒక మాట, ఒక శబ్దమూ, సర్వాంగీకృత
మయిన పద్ధతిలో బిడ్డకు అలవాటు కాకపోతే
తరవాత సవరించడం కష్టం. అందమయిన ముఖ
కవళికలు, మంచి సౌష్ఠవమున్న ఎందరో స్పష్ట
మయిన ఉచ్చారణలేక పనికి రాకుండా పోయినారు.
లాభమో, నష్టమో లేనిదే పెద్దవాళ్ళు కొన్ని
పనులు చేయరు. పిల్లలెట్లా చేస్తారు? చిన్న పిల్ల
లలో మాట్లాడవలసిన అవసరం తమ అవసరాలు
తీర్చుకోడానికి ఇంట్లో వారిని పిలవడం కోసమే.
కొన్ని మాటలతో వారి కర్థమయ్యేటట్లు బిడ్డ
మాట్లాడగలిగితే చాలు. ఆ అవసరాలు తీరిపోతుంటే
బిడ్డ పదజాలము, అంతటితోనో, ఆ స్వరూపం
లోనే ఆగిపోతుంది. అనాటికానాడు కొత్త మాటలు
సరి అయిన పద్ధతిలో బిడ్డ నేర్చుకుంటానికి తగిన,
పరిస్థితులు ఏర్పరచాలి. ఏ శబ్దం నోటితో ఎల్లా
వుడుతుందో ఇంట్లో వారికి తెలిస్తే పిల్లలకు నేర్ప
డానికి వీలవుతుంది. ఏ సందర్భంలోనూ పిల్లలు,
నత్తివారిని వెక్కిరించడం సహించకూడదు. మాటలు
నేర్చుకునే రోజుల్లో నత్తి ఏర్పడితే అది దుర్నివార్య
మవుతుంది.

మాటలకూ మానసికపరిస్థితులకూ చాలా
సంబంధము వున్నది. పరిస్థితులకూ, పరిసరాలకు
అనుగుణంగా మారగల శక్తి పెద్దవారిలోనే చాలా
కష్టసాధ్యమయిన విషయం. అందుకు కావలసిన
తర్ఫీదు శైశవంనుంచీ మెదడుకు యివ్వాలి. కోపం
వచ్చి మనస్సుకు కష్టం వచ్చినా, భయపడ్డా
కొంత మంది పిల్లలూ, పెద్దలూ ముడుచుకుపోయి
ఎంత సేపటికీ మాట్లాడరు. భయం, మాట్లాడ
డంలో ఎన్నో లోపాలు ఏర్పరుస్తుంది. పెద్ద వారిలో
భయాకారణం పోగానే, మాట్లాడడం సరిగా రావచ్చు.
చిన్న పిల్లలలో విపరీతమయిన భయం కలిగితే
మెదడులో వాక్కేంద్రము శాశ్వతంగానే దెబ్బ తిన
వచ్చును. ఒకరిలో ఏ బాధా అపాయము కలిగిం
చని కారణం మరొకరిలో విషమఫలితాలు కలి
గించవచ్చు. దండకోపనులమని విఱ్ఱవీగే పెద్దలు
ఈ విషయం గమనించడం చాలా అవసరం.
ఆపేక్షగల తల్లిదండ్రులు లేకపోవడం, తల్లులు
దూరంగా వుండడం, విస్మయం కలిగే పరిస్థితులు,
నిరంతరం భీతి కలిగించే పరిస్థితులు, మాటలు
వచ్చే తరుణంలో పిల్లలకు ఎంతమాత్రమూ
మంచిదికాదు. తమరు మాట్లాడ్డం లోపభూయిష్ట
మని తెలిసి తమ పిల్లలకు ఆ ధోరణి రాకూడదని
తెలిసినప్పుడుతప్ప, మాటలువచ్చే పిల్లల్ని దూరంగా
వుంచడం హానికరము. మాట్లాడడంలో లోపం వున్న
వారిని అర్థం చెసుకోకుండా, వెక్కిరించి వేళాకోళంచేసి
వారిమధ్య పిల్లల్నిగాని పెద్దల్నిగాని ఎంతమాత్రమూ
ఉంచరాదు. తమ శారీరక లోపాలను, ధీరోదాత్తులలాగా
"ఈశ్వరేచ్ఛ" అని సహించగల శక్తి, అందరిలోను
ఏర్పడదు. వారి వారిలోపాలకు ఎల్లప్పుడూ వారే
కర్తలుకారు. వారిని పరిహసించడం దయావిహీన
మైన పని. తగిన శిక్షణ, ప్రోత్సాహం యిస్తే
చాలామంది ఆత్మవిశ్వాసం కలిగి బాగుపడతారు.

బిడ్డలలో తెలివితేటలకూ, మాట్లాడడానికి
సంబంధం వుంది. కాని మాటలాడడంలో లోపం
వున్నప్పుడల్లా తెలివి తేటలలో లోపం వుందను
కోడం పొరపాటు. తెలివి తేటలు వయస్సుకు అను
గుణంగా ఏర్పడే వారిలో ఉచ్చారణలోపాలున్నా,
మాటలాడడము, వాక్య నిర్మాణం, భావ ప్రకటన
మొదలయిన వాటిలో లోపాలుండవు. వారిని తెలివి
తక్కువ దద్దమ్మలని తిట్టడం, వారు బాగుపడ
కుండా వుండడానికి మొదటి మార్గం. "ఇక మీరు
బాగుపడర"ని నిరుత్సాహపరచడం చాలా ప్రమా
దకరం. మితిమీరి మెచ్చుకోడం పెద్ద వారికి
ప్రమాదకరం. బిడ్డ తను చేసిన పనికి పెద్దల మెప్పు
కోరడం సహజం. మంచి పని చేసినప్పుడు మెచ్చు
కోడం, తప్పుపని చేసినప్పుడు బిడ్డల మనస్సు గాయ
పడకుండా సవరించడం ఒక కళ. అది ఇంట్లో వారం
దరూ నేర్చుకోవాలి.

వాగ్రోగవేత్తలు చేసిన పరిశోధనవల్ల తెలిసిన
హంశములను పైన క్రోడీకరించాను. కాని మాట్లా
డడంలో లోపాలకు యివే కారణములు అని అనుకో
కూడదు. పరిశోధనఫలితంగా యింకెన్నో కారణ
ములు కనపడవచ్చును. వచ్చేవారం ఉచ్చారణ లోప
ములు సవరించే మార్గాలు వర్ణిస్తాను. ★

# ఉత్తరాలు

(3-వ పేజీ తరువాయి)

## కథలు

"ఇచ్ఛ—ద్వైవేచ్ఛ" అను కథ నన్ను చాలా సంతోష పెట్టినది. కథ చదువుతుంటే మనస్సు కలత జెందినది. ముగింపు కూడా నాకు నచ్చినది.

వీరవల్లి నవకోటి (సూర్యాపేట)

* * *

ప్రేమకథ లన్నిటిలోకి "కిక్కిటుట్టా—క్రీగంటి చూపులు" క్రొత్తదారుల త్రొక్కినది. కాని రచయిత ఒకచోట మాత్రము అడ్డదారి పట్టారు. హరి గిరికి ఉత్తరం వ్రాసేటప్పుడు గౌరిని వర్ణిస్తూ "కుడిచేతికి ప్లాస్టిక్‌రాళ్ళ తొడిగిన చెయిన్‌తో కూడా వాచీ" అని వ్రాశారు. ఆమె ఆ అలంకరణ తోనే రైలు ఎక్కి ఉండాలి. కాని రైలులో "టైమెంతయిందమ్మా ?" అని ఎవరో ముసిలామె గౌరి నడిగినప్పుడు "నా దగ్గర వాచీ లేదండి" అని అన్నది. ఇకనైనా ఇటువంటి చిన్న చిన్న పొరపాట్లు లేకుండా రచన సాగిస్తారని ఆశిస్తున్నాను.

కె. పార్వతీశ్వరరావు (ఉర్లాం)

* * *

"క్రికెట్టూ—క్రీగంటి చూపులూ" 'నాకు నచ్చినది. మరదలుపిల్లను, (అంటే వయస్సులో ఉండి ఇంకా పెళ్లికాని పిల్లను) ఒక్కర్తినే పంపేందు కిష్టపడిన యింట్లోవాళ్ళుండడం వాస్తవికతకు దూరంగా ఉన్నా, రక్తిగా ఉంది.

దూసి జెనర్జీ (శ్రీకాకుళం)

* * *

క్రికెట్టూ—క్రీగంటి చూపులూ కథలో గౌరిని శేషగిరి 'మీ అన్నలాటి వాడిని" అని, తిరిగి ఆ అమ్మాయినే చేసుకోవటంతో కథ అసభ్యంగా తయారయింది.

కె. సరళాదేవి (మహబూబ్‌నగర్)

* * *

కాల్వ శ్రీరాంపురం నుండి కె. దివాకర్‌రెడ్డి గారు 'అగ్గిబరాటాలో" ఉషాదేవి చిటికెనవ్రేలు లోపించిందని వ్రాశారు. ఆశ్చర్యం! వారు సరిగ్గా చూడలేదేమో. చిన్నగా ఉన్నది వేలు బొటనవేలు కాదు. అది ఉంగరపు వేలు (మడతగా ఉండటం వల్ల చిన్నగా కన్పిస్తుంది). బొటనవేలు వెనక్కి నడుంమీదికి పోయింది. ప్రక్కవేళ్ళు సరిగ్గా ఉన్నాయి కాని చిటికెనవేలు కాస్త పెద్దదైంది. అంతేగాని అసలు లేకపోలేదు. ఇలా విమర్శించేటప్పుడు కాస్త ఆలోచించాలి.

జొన్నలంపల్లి శశాంక (హైదరాబాద్) ★

# గళ్లనుడికట్టు-56



## అడ్డం

1. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ.
4. లామాల భూమి.
7. వలు గురువుల కొక్క తవ్వే వనిముట్టు.
9. చెలికాడు.
10. నీరు ఉబికే చెక్కిలి !
11. నష్టం మాత్రం కాదు.
12. నక్షత్రమా ?
14. వైమరచినమా మునుపే సిద్ధము !
15. వారిసిగ తరగకముందే కాక మధ్యలో కూడా ఆడ ఏనుగు కనిపిస్తుంది.
17. వారి ధిక్కారము సహించను ! సముద్రం నాకు కావాలి !
18. తిరగబడిన చేదుకూర.
19. మళ్లీ తిరగబడిన వేలి నడుమ వెంట్రుక.
21. చీమలో వస్త్రఖండము !
22. ముకు ఇదే !
23. సరుకు చవిచూడకనే పొట్ట అని అనగలరా?
24. అటునుంచి నరికితే వచ్చేది.
25. చిలుక వచ్చేందుకు మొదట పాముని తియ్యండి.
27. వ్రాత, ఏమి చేస్తాం !
31. దేవాలయము.
32 గౌరవాలు ఇవేనా ?

## 55-వ గళ్లనుడికట్టుకు జవాబు



## నిలువు

2. హా ! హత—!
3. కుబేరుల విలా అనవచ్చు.
5. భేదము, ప్రయోజనము కురుల బెట్టులో దొరుకుతాయి.
6. కాయం !
8. మీ సేవకుడు.
9. చిందరవందర అయిపోయిన యిల్లు.
10 ఒకరోజు ఈ పత్రికను పరీక్షిస్తే తెలుస్తుంది.
13. కొంచెము కారముతో పలుచనైన గచ్చు పూత సాధించాలి!
14. మిథిలకు సంబంధించిన పేరు.
16. మీగడ—.
20. తెల్లవారే సమయము.
21. పేచని పారేయక 'చ' చేర్చి ఒక వృక్షం చేయండి.
26 దేవాలయాలలో ఎద్దుమెడకు కట్టే గంట.
28. మరి చనిపోతే మొదటే చిగురుకొమ్మ కోసం వెదకాలి.
29. బలము !
30. దరిద్రుడు.

★

మాస్టారు-అరిటాకు ముల్లు మీదపడినా, ముల్లు అరిటాకు మీదపడినా అరిటాకుకే ప్రమాదం. ఇల్లాగే ఇంకోటేదైనా చెప్పరా గోపీ!

గోపీ-చెప్తా సార్! బురదలో ఉన్న పంది వచ్చి మన మీద పడినా, మనం ఆ పంది మీద పడినా మనకే డేంజర్ సార్!

యం. వి. రాఘవేంద్రరావు
(రాజమండ్రి)

* * *

మొదటి వ్యక్తి-ఏం బాబు "సినిమాలో పొగ త్రాగరాదు అని" స్లైడ్ వేస్తారెందుకండి?

రెండవ వ్యక్తి-ఆఁ ఏముంది మరచిపోయిన వారికి, జ్ఞప్తి చేయడానికై వేశారండి.

డి. శంకర్ (ఆదిలాబాదు)

## కోర్టు మహామంత్రః

శ్రీరస్తు అస్యశ్రీ సివిల్ కోర్టు మహామంత్రస్య - లావాదేవీ-బీజం-ప్లీడరు ఋషిః, వకాలత్ ఛందః-జడ్జి దేవతా-పౌరుషం శక్తిః, కలహాంకీలకం - స్వపక్ష జయసిధ్యర్థే వినియోగః.

ఓం ప్లెయింట్ అంగుష్ఠాభ్యాన్నమః, ప్రతివాదినోటీసు-తర్జనీభ్యాన్నమః ఆన్సర్ మధ్యమాభ్యాన్నమః, జడ్జిమెంటు వాయిదా, అనామికాభ్యాన్నమః, అర్గ్యుమెంటు కనిష్ఠికాభ్యాన్నమః, హియరింగ్ కరతలకరపృష్ఠాభ్యాన్నమః, ఏవం-హృదయాదిన్యాసః. జడ్జిమెంటు దిగ్బంధః-హోటల్‌లో భోజనం, కదాచిత్ పరాన్నం. కాఫీక్లబ్ ఫలహారం, వృక్షమూల-విశ్రాంతం, వీధివీధుల సంచారం, ఛత్రసావిడి-శయనం అడ్జర్న్‌మెంటు-శ్రవణం, వదే వదే-ధనహరణం కూట సాక్ష్యాది నిరూపణం, ఇత్యాది ధ్యానానంతరం జడ్జిమెంటు ప్రకాశం, అమీను సందర్శనం, గృహవారంటు బంధనం, అపీలు ప్రకరణం, చరస్థిరఅస్తి సర్వస్వం - డిక్రీద్వారా శర్మణా ప్రీత్యర్థం, తత్సవితుః బ్రహ్మార్పణమస్తు. ఇతికోర్ట న్యాయం సంపూర్ణం.

కొట్ర ఆదిశేషయ్య (నెల్లూరు)

* * *

## మక్కికి మక్కి

ప్రాచీన కాలంలో కాగితాలు, కలాలు మొదలయినవి కనిపెట్టక ముందు కవులు తమ

# హాస్యకథలు

కావ్యాలను తాటియాకుల గ్రంథాలమీద గంటంతో వ్రాసేవారు. అవి పాతబడి చెడిపోయే స్థితిరాగానే వాటిని మళ్ళీ క్రొత్త ఆకులమీద వ్రాసేవారు.

ఒక గురువుగారు తన శిష్యుడికి ఒక పాత తాటియాకుల గ్రంథాన్నిచ్చి, దానిలోని సంస్కృత శ్లోకాలను తిరిగి క్రొత్త తాటియాకులమీద వ్రాయమన్నారు.



"నాన్నా నీకు అమ్మ అప్పపెట్టాలంటే వచ్చేనెల 1వ తేదీలోగా తీర్చే పద్ధతిన నాకు పావలా వడ్డీ ఇచ్చుకోవాలి. 10వ తేదీలోగా తీరిస్తే వడ్డీ అర్ధరూపాయి అవుతుంది."

గురువుగారు చెప్పినట్లు శిష్యుడూ జాగ్రత్తగా ఆ శ్లోకాలను క్రొత్త పుస్తకంలో వ్రాయసాగాడు. మధ్యలో ఒక చోట అతనికి ఒక చచ్చిన ఈగ కనిపించింది. అది తాటియాకుల మధ్యపడి, నలిగి, చచ్చిపోయి ఆకులకు అంటుకొని వున్నది. అది సరిగ్గా ఒక అక్షరం మీద అంటుకొని ఉన్నది.

శిష్యుడు వెంటనే ఆ ఈగను తొలగించి, దాని క్రింద ఉన్న అక్షరాన్ని తన క్రొత్త పుస్తకంలో వ్రాసి, మళ్లీ ఆ ఈగను ఇదివరకు ఉన్న చోటనే అంటించాడు.

అతనికి ఇంకో సందేహం వచ్చింది. గురువుగారు తనను అందులో ఉన్నట్లు వ్రాయమన్నారు. అందులో ఒక అక్షరం మీద ఈగ ఉంది. కాబట్టి ఇందులో గూడా ఆ అక్షరం మీద ఈగ ఉండాలి. లేకపోతే పాతగ్రంథం, క్రొత్త గ్రంథం ఒకేవిధంగా ఉండవు. అని అనుకొని ఎట్లాగో తంటాలుపడి ఒక ఈగను పట్టి, చంపి, తాను వ్రాసిన అక్షరం మీద అంటించాడు.

మక్కి అంటే ఈగ; పాత గ్రంథంలో ఈగ ఉన్నదని, శిష్యుడు మూర్ఖంగా క్రొత్త గ్రంథంలో కూడా ఈగను అంటించాడు. అందువలన ఎవరైనా ఉన్నది ఉన్నట్లు మార్పు చేయకుండ కాపీ వ్రాస్తే "మక్కికి మక్కి"గా, అంటే, ఈగకు ఈగ అంటించిన విధంగా వ్రాశారని అంటారు.

'రాజబాబు' (ఏలూరు)

★

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7 Thambuchetty Street



## ఆరోగ్యము మొదట లెక్కలోకి వస్తుంది

ఆరోగ్యము ఎల్లప్పుడూ మొదట లెక్కలోకి వస్తుంది. ప్రతి నిత్యమూ పనిపాటలలో పడే దుమ్ము మరియు ధూళి నుండి మీ కుటుంబము గోని వారి చర్మమునకు రక్షణ కలుగ చేయండి. ఉత్తమ్ నీమ్ సబ్బు యొక్క ఆరోగ్యరక్షక గుణము సాటిలేనిది. అది సూక్ష్మక్రిముల నుండి మరియు అంటు రోగముల నుండి రక్షణనిచ్చు చర్మమును అందముగా ఉండేలా ఉంచుతుంది.




సంపూర్ణమైన చర్మ ఆరోగ్యమునకు
సాటిలేని సబ్బు

# ఉత్తమ్ నీమ్ సబ్బు

ISI SIKRI PRODUCT

మోడల్ సోప్ కంపెనీ, పి. బి. నెం. 2287, కలకత్తా

TLU

SISTA'S-MSC-19